# హెచ్చరిక

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి

చిన్నకథలూ,

నవలలూ,

నాటకాలూ,

రూపికలూ,

చరిత్రలూ,

మీగడతరకలూ,

ఖండకావ్యాలూ.

వర్ణచిత్రాలూ,

మెరుపుదెబ్బలూ,

వ్యాఖ్యానాలూ,

వ్యాసాలూ

మొదలయినవి

లిఖితరూపంగా, వారి, అనుమతి పొందకుండా

భాషాంతరీకరణం, ప్రదర్శనం, బ్రాడ్ కాస్టింగు,

రికార్డింగు, స్క్రీనింగు, అనుసరణం,

ముద్రణం, ప్రకటనం

వగైరా యేవిధంగానూ యెవరూ

వుపయోగించుకో గూడదు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి నవలలు

# ఆత్మబలి

కలాభివర్ధనీ పరిషత్తు
రాజమహేంద్రవరం

# మహారాజ పోషకులు

కళాప్రపూర్ణ, సాహిత్యసమ్రాట్టు

శ్రీశ్రీశ్రీ శ్రీవిక్రమదేవవర్మ మహారాజులుంగారు డి.లిట్

# ప్రధాన పోషకులు

శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావుగారు

ప్రొప్రయిటరు :— సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

కీ. శే. దురిశేటి శేషగిరిరావు పంతులుగారు, కాకినాడ

# పోషకులు

శ్రీ తూములూరి శివరామయ్య పంతులుగారు

బి. ఏ., బి. ఎల్. అడ్వకేటు. నెల్లూరు

శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారు

ప్రొప్రయిటరు: వి. రామస్వామిశాస్త్రులు&సన్సు. మద్రాసు

శ్రీ వడిద వేంకటరావు పంతులుగారు

భూస్వాములు. మహేంద్రవాడ

శ్రీ ద్వారంపూడి వేంకటరెడ్డిగారు

భూస్వాములు. అనపర్తి

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు

బి. ఏ., సి. బి. ఇ. భూస్వాములు. బుచ్చిరెడ్డిపాళెం

శ్రీ పుప్పల శ్రీరామమూర్తిగారు

మిల్లు ఓనరు. అనకాపల్లి

శ్రీ ఎం. వి. ఆర్. అణ్ణమాచార్యులుగారు

అగ్రహారందారు. మద్రాసు

శ్రీ వి. నాగయ్యగారు

రేణుకా ఫిలిమ్సుడైరక్టరు. మద్రాసు

కీ. శే. సబ్బెళ్ల పద్దయ్యగారు — కొంకుదురు

" కర్రి చిన వేంకటరెడ్డిగారు — మూరుమూరు

" చిట్టి నారాయణమూర్తిగారు — తణుకు

" ద్విభాష్యం వేంకటేశ్వర్లుగారు — చింతలూరు

ద్వారంపూడి రామారెడ్డిగారు — అనపర్తి

# సమర్పణం

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, వారి షష్టిపూర్తిమహోత్సవం సందర్భాన సమ్మాన సంఘంవారు దేశీయుల భూరివిరాళాలతో అచ్చువేయించి సమర్పించిన పుస్తకం.

# ఆత్మబలి

....o0o....

"అదేం పటం అల్లుడా?" అనడిగింది గోవిందమ్మ.

"రాధాకృష్ణుల పటం అత్తా" అని బదులు చెప్పాడు తిమ్మన్న.

ఉబలాటపడి వుబలాటపడి, సంకోచపడి సంకోచపడి, ఆదుర్దాపడి ఆదుర్దాపడి, చివరికి సాహసించి అడగ్గా, తానూ తిమ్మన్నా అయినట్టే ఆ పటంలో వున్న రాధా కృష్ణుడూ కూడా అత్తా అల్లుళ్ళయి వుండడం చూసి గతుక్కు మని పోయిం దామె.

అసలు, అతని చూపుల్లో మదనలేఖ లుండడం గుర్తించి, ఆభిజాత్యం కంటే మార్ధ్యమూ, మార్ధ్యం కంటే సిగ్గూ, సిగ్గుకంటే యీర్ష్యా ముంచుకురాగా అతని కేసి చూడ్డమే మానుకుని వుండిం దామె.

అప్పటికి నెలదినాల కిందటిదాకా మిడుతూ మిడుతూ చూస్తూనే వుండి, అందుకు తగ్గట్టామె కులుకుతూ బదులు చూపులు చూడకపోగా — మీదుమిక్కిలి తనకేసే చూడ్డం మానుకోగా కొట్టినంత బాధపడి, నిరాశచేసుకుని, అతనున్నూ ఆమెకేసి చూడ్డం మానుకుని వుండినాడు.

అయినా, అది గజమెత్తు పటం అయివుండడం చూసీ, అందులో వొక స్త్రీ యెదట పురుషుడు మోకరించి వుండడం గమనించీ చమత్కృత అయిందామె.

ఆ చమత్కృతి వెంటనే ఆమె మనస్సు కలిచేసింది.

ఆ కలత ఆమె హృదయగ్రంథిని శిథిలపరిచేసింది.

ఆ శైథిల్యం ఆమెను వివశను చేసింది.

దాంతో యిక పట్టలేక యిలా అడిగేసిందామె.

ఎలాగయినా ఆమెని సుముఖురాలుగా చేసుకోవాలని అతనికీ పట్టుదల లేకపోలేదు.

ఆపటం ఆమెకు స్పష్టంగా కనపడేటట్టుంచి పట్టుకు వెళ్లడంలో అందుకు తగ్గ ప్రయత్నం కూడా లేకపోలేదు.

అయినా, ఆమె పటం చూస్తుందని కానీ, చూసినా వుబలాటపడుతుందని కానీ, వుబలాటపడ్డా సాహసించగలుగుతుందని కానీ, సాహసించినా ఇలాగ సాదరంగా తనని పలకరిస్తుందని కానీ, పలకరించినా నూటిగా పటంమాటే అడుగుతుందని కానీ కలలోనైనా అనుకోలేదతను.

ఇలాంటి స్థితిలో ఆమె యిలా అడిగాటప్పటికి వింతపడి, అప్రయత్నంగా ఆగిపోయి, సప్రయత్నంగా మాట తెచ్చుకుని, అవ్యవధానంగా యిలా బదులుచెప్పాడతను.

అరుగుమీది స్తంభం ఆనుకుని చివరిచీడీమీద త్రిభం

గిగా నుంచుని వుండిం దామె.

అప్పటి కప్పుడే అయిదారు గజాలు ముందుకు సాగి పోయి వుండినా డతను.

కాని యీ ఆభిముఖ్యం గతం మరిపించగా, యీ ఝడితిప్రత్యుత్తరంతో వుత్కంఠకు చనువున్నూ తోడు కాగా, ప్రసన్న అయి "ఏదీ వొకమాటు చూద్దాం" అని మళ్లీ అడిగిం దామె.

మేఘమేదుర మైన భాద్రపదనిశీథాన కారు మెరుపు లాగ ఇది చకితుణ్ణి చేసిం దతన్ని.

ఎండిపోతున్న సస్యానికి కుంభవృష్టి లాగ అతని ఆశకి నవనవోన్మేషమున్ను కలిగించిం దిది.

దీంతో "దొరికిపోయిం" దని యెగిసిపడి, వెంటనే వెనక్కి వచ్చి అరుగుమీదగోడకి చేరబెట్టాడు పటం అతను.

చెంపకి చారెడేసి కళ్లు చేసుకుని తోడనే పటందగ్గిర కూచుందామె.

ముందు కళ్లు చెదిరిపోయాయి.

నిలవరించుకుని బాగా పరకాయించగా గోడకి ఖచులు విశాల మైన పూలతోట కనపడింది.

రంగురంగుల కలవపువ్వులతోటీ, తామరపువ్వుల తోటీ నిండి అందులో వొక సరోవరం.

దానికి తూర్పుగట్టున దిద్ది తీర్చిన పచ్చికపట్టు.

అందులో వాకమూల చంద్రకాంత శిలావేదికా, దానికి కొంచెం అవతలగా వాక పూవుటీరమున్నూ.

వేదిక విడిచి చివాలున లేచిపోతూ, గ్రీవాభంగాభిరామంగా పులుకుపులుకున చూస్తూ, ఎడమచేత పావడకుచ్చెళ్లు పట్టుకునివుండి కుడిచేత్తో కృష్ణుణ్ణి నిరాకరిస్తూ, పూవుటీరం ద్వారం తప్పించి కొంచెంపక్కగా రాధ.

ప్రత్యాలీఢపాదంగా కూచుని, ఎడమచేత రాధ పైటకొంగు పట్టుకుని దీనంగా చూస్తూ కృష్ణుడు.

ఆదృశ్యం చూసి గోవిందమ్మ పులకిత అయింది.

అలాంటి పటం చూశాటప్పుడు పక్కన తిమ్మన్న వుండడం లజ్జావహాంగానే వుంది; గాని అప్పటి కప్పుడే తాను ఆపూలతోటలో, వారికి కొంచెం దగ్గిరగా వుండినట్టయిం దామెకి.

రాధ కాక మరెవతె అయినా కృష్ణుడి చూపులకు కరిగిపోయి వుండు ననీ, కృష్ణుడు కాక మరొక రెవరయినా రాధ చూపులు గుండెలు దూసుకు పోగా నీరయిపోయి వుండు ననీ తోచిం దామెకి.

అయితే " అలాంటి ఆడదానికి — అలాంటి తోటలో అలాంటి చోట — అలాంటి సమయాన — అలాంటి కోపం తగునా?

అలాంటి అల్లుణ్ణి — అంత విధేయుణ్ణి _ దీను డయి

పోయిన వాణ్ణి అలాగ కసిరికొట్టడం ధర్మమా ?"

ఇలా తోచగా ఆమె మన స్సెలాగో అయిపోయి, చూపులు వటం అంతటా చెదిరిపడ్డాయి.

చూడగా, పచ్చికబయ లానుకుని వుండిన గులాబీ కట్టవ అవతల, నురపొన్న చెట్టు కింద కూచుని జిలి బిలిగా పాడుతూ వొకతే, వీణ మీటుతూ వొకతే, తాళం వేస్తూ వొకతే, మృదంగం వాయిస్తూ మరొకతే — మొత్తం నలుగురు యువతులు పాటకచేరీ చేస్తున్నారు.

బొడ్డుమల్లె పొదకి కొంచెం చాటుగా వున్న ఆడ నెమిలి, మెడ రిక్కించుకుని "యెంత వయ్యారమే వో భామా ?" అన్నట్టురాధ కేసి చికిలి చూపులు చూస్తోంది.

తియ్యమామిడి గున్నమీద కూచుని వుండిన గండు గోయిల, రెక్కలు ఆడించుకుంటూ, యిటే చూస్తూ కుహూ కుహూ అని మహా కసిగా కూస్తోంది.

మెడా మెడా పెనవేసుకుంటూ, అన్యోన్యం పొదువు కుంటూ, వూవుటీరంమీద పావురాల జత వొకటి కువ కువ లాడుతోంది.

వేదిక విడిచి రాధ శరవేగంతో లేవడంలో రేగిన గాలి విసురికి వూగీసలాడి పోతూ వున్న వరగోగువువ్వు మీద జానె డెత్తు కెగిసి, కొదమతుమ్మెద "హూ" మ్మని కొప్పడుతున్నట్టు ఝుంకారం చేస్తోంది.

పావంచాలదగ్గిరగా, సరోవరంలో, చిరుకెరటాలకు వెండి పూతా, తోట అంతటా వృక్షాగ్రాలకు బంగారు పూతా, తమాల వృక్షాల చాటున కాటుకపూతా కల్పించివుండిన నీరెండ, పచ్చిక పట్టు ధగ ధగలాడించి రాధాకృష్ణుల మీద వింతకాంతి గుమ్మరిస్తోంది.

"పా—వం చిన్న కుర్రాణ్ణి చేసి ఆడించేస్తున్నావు కాదూ; వస్తున్నా నుండు" అన్నట్టు, అష్టమిచంద్రుడు పల్చని తెలిమబ్బుతెర వొత్తిగించుకుని తొంగు తొంగున దూకుతూ వస్తున్నాడు.

సరోవరంలో జలకమాడి, చెట్లగుబురుల్లో వయ్యారి నడక లలవర్చుకుని, కుసుమసౌరభాలు ఆబగా పులుము కుని, కృష్ణుని తవన గ్రహించి "యీవొక్క తప్పూ మన్నించు" అని లాలిస్తున్నట్టు పిల్లగాలి రాధ ముంగుర్లు సవరిస్తోంది.

ఈపరిసరా లన్నీ చూశాటప్పటికి గోవిందమ్మ కళ్లకి, కృష్ణుని చూపుల్లో దీనత చాటున బెల్లింపు కనపడింది.

దీనికి సాయం, రాధ చూపుల్లో చురుకుదనం మాటున మెత్తదనమున్నూ పొడగట్టిం దామెకి.

దాంతో వ్యగ్ర అయి "మాయలమారి నల్లోడు" అంటూ కృష్ణుని బుగ్గలు పొడిచి, తిమ్మన్నకేసి వోర చూపులు చూసింది గోవిందమ్మ.

## 2

కేవలమూ బొగ్గునలుపు కాదు గాని మొత్తానికి తిమ్మన్న నలుపే.

కొండ రతన్ని "మాయలమారి" అనడమూ వుంది, వూళ్లో.

ఇవి యెరిగివుండిన తిమ్మన్న, ఆమె తనని హేళన చేస్తోందా అని శంకించుకుని తుళ్లిపడ్డాడు.

ఇంతలో "యీచూపుల్లో మత్తుమం దుంది. అంచేతే యేలాంటి ఆడదీ నిలువునా కరిగిపోడం. లేకపోతే గొల్లగూడెం అంతా యెలా చుట్టబెట్టగలిగాడూ?" అందామె, మళ్లీ అలాగే చూస్తూ.

ఇది విని శొయ్యే అయిపోయా డతను.

కరిగించలేకపోయాడే గాని, తా నామెని సాకూతంగా చూడ్డమూ నిజమే.

ఇదివరలో నలుగురైదుగురు గొల్లభామలను మాయ చేసి వుండడమూ నిజమే.

చివరి కిప్పు డొక గొల్లభామని చేపట్టి వుండడమూ నిజమే.

"అయితే, గోవిందమ్మ మాటలో యీ అర్థమూ, చూపులో యీ దెప్పూ వుండడమే నిజమయితే, మరి, ఆమెభావం యేమిటీ?"

తిమ్మన్న యిలా ఆలోచన ప్రారంభించాడు.

"మతం మార్చుకుని పటం చూపించమందా, పటం చూసి తరవాత మతం మార్చుకుందా ?" అనిన్నీ ముందు చర్చించుకున్నా డతడు.

ఈ వ్యవధానంలో, రెప్పవెయ్యకుండా మళ్లీ పటం చూసిం దామె.

చూసిచూసి తల పంకించుకుంది.

పంకించుకుని యేదో భావించుకుంది.

ఆ భావనమీద వొకానొక మధురానుభూతి కలిగి వొళ్లు ఝల్లు మంది.

దీంతో ప్రకృతిలో పడి, కృష్ణుని చూపులతో తానున్నూ కరిగిపోయివుండినట్లు గుర్తించుకుని, నిర్విణ్ణ అయిపోయి - కాని అలాంటి దేమీ లేనట్టు నటిస్తూ చటుక్కునా చురుగ్గానూ చూసింది తిమ్మన్న కేసి.

ఇది యిలా జరుగుతుం దని గుర్తించని తిమ్మన్న, అప్పటికి ముసిముసినవ్వులు నవ్వుకుంటున్నాడు.

అది చూసి మొదట వులిక్కిపడిం దామె.

తన భావసరణి అతను గ్రహించేశా డనుకుని, తరవాత నీరయిపోయింది.

దీంతో సిగ్గుపడిపోయి మొగం పక్కకి తిప్పేసుకుంది.

చివరికి కళ్లుమూసుకుని, చెదిరిపోయిన మనస్సు

కుదుట పరుచుకుంది.

అప్పటి కొక విధంగా నిలవగలిగిం దామె.

వెంటనే ఆభిజాత్యం స్మరించుకుని, గాంభీర్యం నటిస్తూ "ఎంత తొందరపనిమీద వెడుతున్నావో, నిన్నాపు చేశాను. ఇక పట్టుకువెళ్లు పటం" అంటూ చివరిచీడీ మీదికి వెళ్ళి నుంచుంది.

అది గడుసుతన మయినా జాలి అయినా, కృతజ్ఞత చూపించడం అయినా క్షమార్పణ చెప్పుకోడం అయినా, నిజంగా నిర్లిప్తతే అయినా వొకటే అయిందతనికి.

ఏమంటే?

అతను నుంచునివుండిన చీడీమీదనే ఆమే నుంచుంది.

తన్మూలంగా, చాలా దగ్గిర అయింది.

తనకేసి చూడ్డమే మానుకుని వుండిన సుందరి, వైముఖ్యం విడిచిపెట్టి తనతో చనువుగా మాట్టాడ్డమూ, మాట్టాడుతూ వోరచూపులు చూడ్డమూ, చూసినందుకు సిగ్గుపడ్డమూ, సిగ్గుపడిన్నీ చివరి కింత చేరువగా వచ్చి నుంచోడమూ ఏమి తక్కువ?

అత నిందుకే చాలా సంతోషించాడు.

భవిష్యత్తు ఆశావహంగా కనపడిం దతనికి.

"పటం చూపించమనడంలో విశేషం యేమీ లేదు సుమా" అన్నభావం వ్యక్తం చెయ్యడానికే చూసు

కుంటోంది గాని యిదేమీ గుర్తించుకోడం లేదామె.

కాగా, వ్యవధి సంహించలేక "పట్టుకువెళ్లు" అంది మళ్ళీ.

ములుకు లాగ గుచ్చుకుంది తిమ్మన్నకీ మాట.

కాని యీసంగతి పైకి పొక్కకుండా బిగపట్టు కోడంలో అది కూడా దొంగవవ్వాయిపోయిం దతనికి.

ఉండుండి, ఒకరి నొకరు కీగంట చూసుకుని నిజస్థితి గ్రహించుకున్నారు.

"మెత్తపడిపోతున్నాం" అని కంగారుపడిపోతూకూడా ఆనందమే అనుభవించిం దామె.

"నెగ్గేశాం" అని గర్వపడుతూ కూడా అపజయమే శంకించుకున్నా డతను.

ఇలాగ, యిద్దరూ వొక్క క్షణం వుండిపోయారు.

చెరోవైపుకీ మొగంపెట్టుకుని మరీ వుండిపోయారు.

"ఇదీ బాగానే వుం" దనుకున్నా డతను.

అద్దంలో ముద్దులాగే వున్నా యిది కూడా పులకలు రేపెట్టిం దామెకి.

అది గ్రహించి "ఇప్పటి కిది చాలు" ననుకుని తిమ్మన్న పటంకేసి అడుగువెయ్యగా, వీధే పోయేవాళ్ళు తన వాలకం గ్రహించేస్తున్నా రేమో అని ఆదుర్దాపడుతూ పిల్లఅరుగుమీదికి తప్పుకుంది గోవిందమ్మ.

అటూ యిటూ కూడా చూసింది.

సరిగా యీసమయాన, హోండీలుబారుకి, చేపలగు ది తగిలించుకుని, కారియరుమీద వచ్చిగడ్డిమోపు బిగించు కుని, బుజాన గోంగూరమూట వేలాడవేసుకుని, బీడీ కాల్చుకుంటూ పదిపద్దెనిమిదేళ్ళ కుర్రా డొకడు సైకిలు తొక్కుకుంటూ వచ్చి, "వస్తాడే మాబావ" అంటూ గోవిందమ్మకేసి చూసి, గంటకూడా గణగణలాడించి తూర్పుగా వెళ్లిపోయాడు.

జట్కామీద మళ్లీ పెళ్లి జోగ్గులు వేలాడవేసుకుని, లోపల సైడ్డుడ్రమ్ము దబదబ లాడించు కుంటూనూ ట్రంపెట్టు బర్రుమనిపించు కుంటూనూ వచ్చి. సినీమాపిల్ల కాయలు, గోవిందమ్మని రాసుకుంటూ వెళ్లి అరుగుమీద పడేటట్టు నోటీసులు విసిరికొట్టి పడమరగా వెళ్లిపోయారు.

దీంతో, ఆయిద్దరికీ గూడా ధన్నుమని హృదయాల మీాద దెబ్బ పడ్డట్టనిపించింది.

అయితే, తిమ్మన్న హృదయ ఫలకం "భేషు భే" అని శబ్దించగా, గోవిందమ్మ హృదయవీణ "సిగ్గుసిగ్గు" అని ముక్తాయించింది.

కాని యిది పూర్తి కాకుండానే — లోపల చోటు లేక వూచలుపట్టుకుని కొందరు పడిచెక్కలమీదే నుంచుని వుండినా, మడ్‌గార్డుమీద కూడా యెగిరెగిరిపడుతూ కొందరు వేళ్ళాడుతూ వుండినా, తృప్తిలేక "కోటిపిల్లి

కోటిపల్లి" అని కండక్టరు అరుపులతో బస్సొకటివచ్చి హారన్ కొట్టి వెళ్ళిపోయింది.

ఇద్దరూ వులిక్కిపడ్డారు.

చివరికి ప్రకృతిలో పడ్డారు.

కాని, చేత్తో పుచ్చుకోడం తరవాయిగా పటందగ్గిర నుంచుని వుండిన్నీ "వుండనియ్యత్తా!" అంటూ తిమ్మన్న మళ్ళీ మొదటికి వచ్చాడు.

"వద్దుబాబూ, పట్టుకుపో అల్లుడా" అంటూ గోవిందమ్మ వెంటనే మళ్ళీ చివరికి వచ్చేసింది.

తిమ్మన్న కప్పటికి నెమరుతిరిగింది.

"ఉండనియ్యి, ఉండనియ్యి" అనే కాని తా నెందుకుండనియ్య మంటున్నదీ చెప్పకపోవడంవల్ల నే గోవిందమ్మ "పట్టుకుపో పట్టుకుపో" అంటోం దనీ, విభ్రాంతి వడిపోయి యింతవరకూ చెప్పకపోడం తనదే తప్పనీ గ్రహించుకున్నా డతను.

అందు కొక్కమాటు తనలోతాను నిందించుకుని, మళ్లీ ధైర్యం తెచ్చుకుని, వెంటనే "మరేమీ లేదత్తా! చత్రం కట్టడం అయిపోయిం దని వనివాడు చెప్పగా డబ్బిచ్చేసి పట్టుకువచ్చాను గాని యెక్కడ పెట్టనూ? ఇల్లు తాళంవేసి వుంది" అన్నాడు, మెల్లిగా.

"అంటే?" అనడిగిం దామె, కళ్లు చికిలించుకుంటూ.

" ఊళ్లో లేదత్తా! "

" మనమల్నీ మనమరాలినీ చూడ్డానికి ములకల్లంక వెళ్ళిందా? "

ఒక్కొక్కప్పుడు, ఎదటివా రడిగినకొద్దీ ప్రత్యుత్తరం చెప్పడం పెట్టుకుంటే చివరికి విషమసంధి యేర్పడుతుంది.

అప్పు డున్నది ఉన్నట్టు చెబితే వొకచిక్కు, అసలే బదులు చెప్పకపోతే వొకచిక్కు, అబద్ధం చెబితే మరొకచిక్కును.

ఇంతే కాదు.

ఒక్కొక్కప్పుడు ప్రాశ్నికులకున్నా అది దుస్సహంగా పరిణమించవచ్చు.

కాని సమయం తటస్థిస్తే యెవరూ అడగడంమానరు.

గోవిందమ్మ యిప్పు డాస్థితిలోనే వుంది.

చెప్పడమా మానడమా అని బాగా ఆలోచించాడు తిమ్మన్న.

విప్రతిపత్తులు చాలానే కనిపించాయి; గాని అన్నిటినీ మించి వొక మంచి వుపాయమున్నా కనపడింది. అయినా మంచి దని " మా అమ్మ కాదత్తా! " అని కొంచెం గూఢంగా చెప్పాడు మిడుతూ మిడుతూ చూస్తూ.

ఈచూపుతో ఆమె జాలిపడి వుండవలసిందే ; కాని ఆమె కళ్లు మిసమిస లాడాయి.

గొల్లభామ సంగతి వచ్చాటప్పటి కామెకి వల్లమాలిన యీర్ష్య ముంచుకు వచ్చేసింది.

"అయితే, మాయింట్లో వుంచుదామనే తెచ్చావా?" అని దురుసుగా మాట కూడా వచ్చేసిం దామెకి.

"లేదత్తా" అన్నాడు తిమ్మన్న, కొంచెం జంకుతూనే, "ఏమి లేదు అల్లుడా?"

అతని జంకంతా యెగిరిపోయింది.

తాను "అత్తా" అన్నప్పుడల్లా ఆమె "అల్లుడా" అంటూ వుండడం గుర్తించి దిటవు తెచ్చుకున్నా డతను.

మంచిమాటాడితే ఆమె సుముఖురాలు కాకపోదనిన్నీ అతను నిశ్చయించుకున్నాడు.

ఈనిశ్చయంతో "తెస్తున్నానే గాని యెక్కడ వుంచడమా అని ఆలోచిస్తూనే వున్నాను. ఇంతలో నువ్వు పలకరించావు దేవతలాగ" అన్నా డతను.

"దేవత" అన్నమాట వచ్చాటప్పటికి పరిమితంలేని గొప్పతనం సంక్రమించేసినట్టనిపించింది గోవిందమ్మకి.

ఈ అనుభూతి కలిగాటప్పటికి, తిమ్మన్న ధోరణిలో ప్రాధేయపడుతున్న సవ్వడీ, చూపుల్లో వేడుకుంటున్న వాలకమూ కనపడ్డా యామెకి.

దాంతో, ఆమె హృదయం మహాఘనత వహించింది.

దాని వెంటనే "ఊళ్లో లేన కైటరగవా నువ్వు?" అని

మృదువుగానూ సాదరంగానూ, మాటకూడా వచ్చేసిం డామెకి.

"ఎరుగుదు నెరుగుదును. నెల్లా ళ్లుండిరావడానికి తమ్ముడుగారి యింటికి వెళ్ళివుండిన తల్లిని ఓమాటు చూసివస్తా నని తెల్లవారేకే వెళ్ళింది. నేనే రెయి లెక్కించివచ్చాను; కాని ఆదారినే వెళ్ళి రాజమండ్రిలో బజారుపని చూసుకోడంలో యీ సంగతి మరిచిపోయా" నన్నా డతను, అధికారి యెదట నుంచుని విన్నపాలు చేసుకునేటట్టు.

"పా — పం" అందామె చిరునవ్వు దాచుకుంటూ.

ఈమాట బహుచిన్న దే కాని యిందులో "మతి పోయింది కామోసు పాపం", అన్న ధ్వని తోచి చిరునవ్వు పొటమరించిం దతనికి.

తాను మనసుపడిన సుందరి "ఆడదాన్ని విడిచి వుండలే" నన్నట్టు మాట్లాడడం దెప్పడమే అయినా మగవాని కది జయపతాకే.

"కాని, చీమలగుంట చెరువుగట్టు ఎక్కేదాకా నాకీ సంగతి జ్ఞాపకం రాలేదత్తా" అన్నాడు తిమ్మన్న, మెల్లిగా.

"అలాగా అల్లుడా!" అంటూ ఆమె నుతారంగా పలికింది, మెల్లిగా తల వూపుకుంటూ.

"మళ్ళీ రాత్రి బండికే వచ్చేస్తుంది" అన్నాడతను.

అని "యింకా వాక్యం పూర్తికాలేదు సుమా" అన్నట్టు చూశాడు.

"ఆమాట యేమిటో పూర్తిచెయ్యి" అన్నట్టామె చూసింది.

దీనిమీద, సిగ్గు అభినయిస్తూ, కళ్లున్నూ చికిలించుకుంటూ "స్టేషనుకి వెళ్ళాలి. బండి తీసుకువెడతా" నన్నాడు తిమ్మన్న, అంతకంతకు స్వరం తగ్గించుకుంటూ.

మొదట "చలికాదూ?" అనడగబోయిం దామె.

తరవాత "నీవ్వంపుకునకత్తె సంగతి నాకెందుకూ?" అని కసరబోయింది.

"సంసారి మొదట చెప్పవలసినమాటలేనా యివి?" అనడక్కపోతే పోకుండా కోట్టేస్తా డనుకుంది చివరికి.

కాని, అన్నిటికీ అన్ని విఘాతాలూ కనపడ్డాయి.

దీనికి సాయం, ఎడమచేత పగ్గాలు పట్టుకునీ, కుడిచేత గొల్లభామని పొదివిపట్టుకునీ, తిమ్మన్న, తడిక నానుకుని కూచున్నట్టూ రెండు చేతులా అతని మెడ పెనవేసుకునీ, మొగంమీద మొగంపెట్టి దీనవాక్కులు పలుకుతూనూ గొల్లభామ అతని వొడిలో కూచుని వుండినట్టూ — అతని "రాజా" యెడ్లు బండి నింపాదిగా లాగుతున్నట్టూ స్ఫురించిం దామెకి."

ఆ పండువెన్నెట్లో — గూడులేని ఆ సొంతబండిమీద

వారనుభవించే ఆనందంలో కొంత తానూ సంక్రమింప చేసుకుంది గోవిందమ్మ.

దీంతో, ఆమె శరీరం గరిపొడిచింది.

అయితే, తానున్నది నడివీధి కావడమూ, ఆమనిషి గొల్లభామ కావడమూ, పైపెచ్చు — దానికి దాసుడైన తిమ్మన్న తన యెదటే వుండడమూ గుర్తించుకొని చకిత అయినీ — అంతలో మనస్సు సరిచేసుకొం దామె.

పమిటి కొంగుతో పెదిమలు కప్పుకొంది.

మళ్ళీ వీధిపొడూగునా చూసింది.

ఈ వ్యవధానంలో ఆమెకి "చేరదీసిన మనిషిని బాగానే కనిపెడతా" డని అతనిమీద ఆదరభావమూ "యేమంత చక్కని దనీ అలా చాకిరీచెయ్యడం?" అని నిరసనభావమూ కలిగాయి.

ఆమె మన స్సెలాగో అయిపోయింది.

"అయితే యేం? పటంపట్టుకువెళ్లు" అని మళ్లీ బెట్టుసరీచేసింది.

మాట యిలా వచ్చిందే కాని చూపులు పటంమీద వాలాయి.

"నిజంగా తిమ్మన్న యిది పట్టుకుపోతే సీకీ రాత్రి నిద్రపడుతుందా?" అని యెవరో అడిగిన ట్టయింది.

"ఈ బెట్టు సహింపలేక, విసిగిపోయి, పటం పట్టుకు

పోతా డేమోంకొంపతీసి'' అని ఆమె మనస్సు గుబగుబ-
లాడిపోయింది.

ఇదంతా ఆమె మొగాన ప్రతిఫలించింది.

అదంతా అతను గ్రహించేశాడు.

"నెగ్గేశాం'' అని స్థిరనిశ్చయమూ చేనుకున్నాడు.

కాని యేమీ యెరగినట్టు అమాయికంగా చూస్తూ "నిన్ను బలవంతపెట్టడం కాదు గాని, అయినా, దయ వుంచి – '' అని మాట తేల్చేసి చూశా డతను.

"అదీ మాట'' అనుకుం దామె.

ఒకసుందరికి దాసుడై వుండినవాడు ఇంతమాట అంటే మరోసుందరికి – సర్వవిధాలా ఆమె కంటే తాను గొప్ప దా న్ననుకునే సుందరికి ఇక కావలసిం దేమిటి?

పొంగిపోయి, దయకూడా వుంచి, వెంటనే "సరే'' అనేసింది గోవిందమ్మ.

"అట్నుంచి నరుక్కువద్దాం'' అనుకుంటూ పూర్వ శ్వాసతో వొక్కదూకు దూకి వీధిన పడ్డాడు తిమ్మన్న.

# 3

అత నలా వెళ్లీవెళ్లడంతోనే తా నిలా పటందగ్గిర కూచుని "యేమిటీ యిదంతానూ?'' అని విభ్రాంతి పడిపోయింది గోవిందమ్మ.

తానే చూడ్డం కూడా మానుకున్న యువకుణ్ణి తానే పిలవడమూ, తానే యెదురుగా — దగ్గిరసా నుంచోడమూ, తానే మాట్లాడించడమూ, తానే వోరచూపులు చూడ్డమూ, ఆ మనిషిమీద తానే "దయ" వుంచడమూ, చివరికి, తాను, ఆ మనిషి ఆజ్ఞాపించినట్లల్లా చెయ్యడమూ — యిదంతా తప్పుకుని తప్పుకుని మహా యిదయిపోయిందామె.

ఒక పురుషుడొక స్త్రీ పైటకొంగు పట్టుకున్నట్టు పటమా ?

తానా పటం చూడాలనుకోడమా ?

తనకోసం గుటకలు మింగుతూ వున్న పురుషుడే తెచ్చి అది తన యెదట వుంచడమా ?

అతని యెదటే తానది యెగాదిగా చూడ్డమా ?

చూచి పరవశురాలున్నా కావడమా ?

ఎంత సిగ్గుచేటు సంగతీ యిదీ ?

ఇలా అనిపించగా, గడగడలాడిపోయిందామె.

కంగారుపడిపోయి, కలగదొక్కుకుని, నిలవలేక స్తంభానికి చేరబడి కళ్లున్నా మూసేసుకుంది.

కాని, మళ్లీ కళ్లు తెరిచిచూశాటప్పటికి మళ్లీ యెదట ఆ పటమే.

కృష్ణుడు రాధ పమిటికొంగు లాగుతూనే వున్నాడు.

రాధ కోప్పడుతూనే వుంది.

మరి తాను ?

ఒక స్త్రీకి అమానుషం జరుగుతూ వుంటే తాను నిశ్చింతగా చూడ్డమా ?

తనకే అలాంటిది జరిగితే ?

ఈ వూహా తట్టాటప్పటికి, నిజంగా, అలా జరిగినట్టే తోచింది. కాని దానివల్ల చచ్చినచా వయిపోయినట్టు కాక చక్కిలిగింతలు పెట్టినట్టయిం దామెకి.

హృదయం ఆనందముగ్ధం అయినట్టున్నా తోచి మొగం వికసించింది.

పటం చూస్తూ వుంటేనే తన కిలా వుందే, మరి, స్వయంగా అనుభవించే రాధ కెలా వుండనూ ?

అలాంటి రాధ కృష్ణునిమీద కోప్పడగలదా ?

"అమ్మయ్యో" అనుకుంటూ చేతులు పిసుక్కుంది గోవిందమ్మ.

కోపిస్తే రాధ కిక బతు కేదీ ?

ఆ సౌందర్యమూ, ఆ సౌందర్యపిపాసా, ఆ రసికతా, ఆచాతుర్యమూ ఏమి కానూ ?

జీవితమాధుర్యం రుచికట్టలేని మొండుకట్టె లాగ రాధ మూలబడి మగ్గిపోగలదా ?

మరి తాను ?

ఒకటి కాదు, రెండు కాదు, ఇరవై ఏళ్లనుంచి తాను బతకడం లేదూ?

అది బతుకు కాదూ?

అంతా అయోమయంగా కనబడిం దామెకి.

తన వొంటరితనం మిక్కిలీ అసహ్యంగా తోచింది.

తనకీ యిలా తోచే, రాధ, అల్లుణ్ణి మంచిమాట చేసుకుని వుటుం దనుకుం దామె.

అయితే, మరి తనకి మాత్రం లేదూ అల్లుడు?

ఆమె మన స్సురకలు వేసింది.

వెంటనే ఉత్సాహంగా లేచి, చివరిచీడీమీదకి వెళ్లి, వీధి పొడూగునా చూసింది.

నాలుగైదిళ్లు దాటి వున్నాడు తిమ్మన్న.

మదగజం లాగ నడుస్తున్నాడు.

ఆ నడకలో మహోత్సాహం కనపడుతోంది.

ఆ ముదురుఎండలో మిలమిలా మెరిసిపోతున్నాడు.

అలాంటి అల్లుణ్ణి గొల్లభామా సేవించుకోడం!

"అందచందా లెరగని అడవిమనిషి" అంటూ వూళ్లో వున్న రసికురాళ్లెందరు తనని యీసడించుకుంటున్నారో?

ఇక్కడ గోవిందమ్మ ఇలా అనుకునే సమయంలోనే అక్కడ, తిమ్మన్న వెనక్కి తిరిగి చూశాడు.

సావకాశంగా నుంచుని సూర్యరశ్మికి చెయ్యి అడ్డం

పెట్టుకుని నిదానంగా చూశాడు.

తనకి సలాం చేస్తున్నట్టుంది అతని వాలకం.

"నన్ను చేరనిచ్చావా? నీకే అనుగ్రహం వుంటే గొల్లభామని కళ్ళతో అయినా చూసేవాణ్ణా?" అని అతను అడుగుతున్నట్టూహించుకుం దామె.

లెక్కకి ముప్ఫయి అయిదేళ్ళదే కాని వో - ట్టి ముద్దరాలు గోవిందమ్మ.

పెళ్ళయి పదిమాసాలు మాత్రమే కాపరంచేసిం దామె మొగుడితో.

మాంగల్యం విడచిపెట్టడానికే కాదు, చూపించడానికయినా కాలం చాలకపోయిం దామెకి.

తరవాత నైనా - ఈ యిరవై సంవత్సరాలూ వసిపిల్లలాగ కాలం వెళ్ళబుచ్చిం దామె.

ఎప్పు డైనా మనస్సు చలించడం కలక్కపోలేదు; గాని అదుపాజ్ఞలెరగని మాంగల్యం అమాంతంగా దాన్నణచివేస్తూ వచ్చింది.

అంచేత, ప్రౌఢోపభోగ్యా లయిన తిమ్మన్న చూపులు భరించలేక పోయిం దామె.

అతని కేసే చూడలేకపోయింది.

వెనకపాటుగా వెడుతున్నవాడు ఉన్నట్టుండక చటుక్కున తిరిగి చూశాడు కనక తన మనస్సులో రేగిన

తుపాను తన మొగాన అతను గుర్తించేశాడేమో అని తహతహలాడిపోయిం దామె.

ఇక నుంచో లేకపోయింది.

వెంటనే గిరుక్కున మళ్ళీ వురికేసినట్టు చీడీ లన్నీ దాటేసి పటం దగ్గిర చతికిలబడింది.

చూడగా, యిక్కడ యింత జరిగినా, అక్కడ, అప్పటికీ, కృష్ణుడు రాధ పమిటికొంగు లాగుతూనే వున్నాడు.

రాధ కూడా కోప్పడుతూనే వుంది.

అయితే, తామరవువ్వు రేకల్లాగ అతికోమలంగా — ముద్దొస్తున్నాయే రాధ కళ్లు? అవి దావాగ్ని వంటి అంతటి తీవ్రకోపం సహించగలవా?

ఇంత సేవున్నూ భరించగలవా?

"అసంభవం" అనుకుంది గోవిందమ్మ.

కనక "అదికోపమే కా" దనుకుంది.

"అది ఆడదానికీ మొగాడికీ కూడా హృదయోత్తేజనం కలిగించే ఒకనొక విలాసమే" అని కూడా గుర్తించుకుం దామె.

"నే నెవ రనుకుంటున్నారో, పోలీసు హెడ్డుని, తెలుసా?" అనుకుంటూ వెన్ను విరచుకు తిరిగే తన పెనిమిటి దగ్గిర, తానుకూడా వొకటిరెండుసార్లు అలాంటిది చూపించివుండడం జ్ఞాపకం వచ్చిం దామెకి.

# 4

ఖరాగా యిరవై సంవత్సరాల నాటి మాట అది.

అప్పటికి పదిహేనేళ్ళ పిల్ల గోవిందమ్మ.

పెళ్ళయి ఆరుమాసాలే అయింది.

పోలీసులైనులో కాపరంచేసే స్త్రీలలో ఆమె చిన్నది.

సాటి కానిస్టేబుల్సుకి కూతురు లాగో చెల్లెలు లాగో ఉండే దామె.

అప్పు డావూరిలో సబినస్పెక్టరొక క్షత్రియుడు.

అతనిభార్య బుచ్చివెంకయ్యమ్మ ముప్ఫయ్యేళ్ళది.

తొలీనాడు గోవిందమ్మ చూడ్డానికి వెళ్లినప్పుడు "మా చెల్లాయిపేరు గోవిందరాజయ్యమ్మ. కొన్ని అక్షరాలు తక్కు వయినా నీపేరూ అదే. పైపెచ్చు, మీ యిద్దరి వయస్సూ వొక్కటే. మాచెల్లాయి కింకా పెళ్లి కాలే దింతే భేదం. కనక, ఆమెని చూసినట్టుంది, వీలయి నప్పు డల్లా వస్తూ వుండమ్మా" అని యెంతో ప్రీతి కనపరచింది, బుచ్చివెంకయ్యమ్మ.

అప్పుడప్పు డామె కూడా గోవిందమ్మ యింటికి వస్తూ వుండేది.

మంచి మంచి కూరలూ పిండివంటలూ చేయించు కున్నప్పుడు గోవిందమ్మకి పంపిస్తూనూ వుండే దామె.

ఈవిధంగా వారి కిద్దరికీ బాగా కలిసిపోయింది.

గోవిందమ్మకి బుచ్చివెంకయ్యమ్మ తల్లికంటేనూ యెక్కువ అయిపోయింది.

లైనులో వుండే ఆడవాళ్లు, గోవిందమ్మ బుచ్చి వెంకయ్యమ్మ యింటికి వెళ్ళడం చూసి "అమ్మగారింటికి వెడుతోంది" దనీ "పెట్టిపుట్టిం" దనీ అనుకునేవారు.

బుచ్చివెంకయ్యమ్మ గోవిందమ్మ యింటికి వెళ్ళడం చూసి "వ్వాళ్ళోనే యిచ్చుకున్నారు కనక, కూతు ర్నెప్పుడుపడితే అప్పుడు చూసుకోవచ్చు అమ్మగా" రనీ "యేమి పిండివంటలు పట్టించుకు వెడుతున్నారో" అనీ అనేవారు.

బుచ్చివెంకయ్యమ్మా గోవిందమ్మా కూచుంటే లోకాభిరామాయణాని కంతూ పొంతూ వుండేది కాదు.

ఒకనాడు పిచ్చాపాటీతో అంకురించి, సినీమాలలో మారాకువేసి, నాటకాలలో కొనలుసాగి, భారతంలోకి పాకి, ద్వైపాయనహ్రదం దగ్గిర విస్తరిల్లి, భీముని వేట కాళ్లను చూడ్డంతో కూరల్లోకివెళ్లిపోయింది వారిప్రసంగం.

గోవిందమ్మకి నెలతప్పివుంది అప్పటికి.

ఆమెచూపు రకరకాలతినుబండారాలమీదికిపోతోంది

అది గుర్తించి, అప్పుడప్పుడా వాంఛలన్నీ స్వయంగా తీరుస్తూ "మన కులాలూ, మన భర్తల వుద్యోగాలూ శౌర్యమూ బలపరాక్రమాలూ ప్రధాన మైనవి. కనక,

మన బిడ్డలు కూడా అందుకు తగ్గవాళ్లే కావాలి. కావా లంటే మనం అందు కనుగుణంగా మసులుకోవాలి. కాబట్టి, నువ్వు, ముఖ్యంగా యిప్పుడు, కోడిమాంసమూ, పొట్టేలు మాంసమూ, అడవిపంది మాంసమూ తరుచుగా తింటూ వుండాలి" అని మహోపదేశం చేసింది బుచ్చి వెంకయ్యమ్మ.

"పట్టప్పుడేమి తిన్నా, నెలతప్పినప్పుడు మళ్ళీ పురుడు వెళ్ళేదాకా నేనీ కూరలే తింటూ వుంటాను. చూడు మరి, నాకొడుకు లిద్దరూ చిన్నవాళ్లే అయినా యెంత శౌర్య వంతులో?" అని నిదర్శనమున్నూ చూపించిం దామె.

ఇది గోవిందమ్మకి నచ్చింది.

మనస్సులో నాటుకునే పోయింది.

దీంతో, తనకి కొడుకే పుట్టా లనీ, ఆకొడుకు వీరుడూ శూరుడూ కావా లనీ కోరుకుం దామె.

ఆకొడుకు శౌర్యం చూసి బుచ్చివెంకయ్యమ్మ మెచ్చు కోవా లని కూడా ఆశించిం దామె.

ఆకొడుక్కి, అన్నం ముట్టించిన ఉత్తరక్షణం మొదలు కూనే అలాంటికూరలు వండిపెట్టాలనీ నిరుకుచేసుకుం దామె.

ఇంతేకాదు, అస లింటి రాచపడుచు చేసిన యీ మంత్రోపదేశంవల్ల గోవిందమ్మకిన్నీ శౌర్యం పుద్బుద్ధం అయింది.

ఆమె పెనిమిటి వెంకటసా మయినా అందుకుతగినవాడే.

మాంచి శూరుడే.

అతని పూర్వులున్నూ అందరూ సైన్యంలో మంచి పేరు పొందినవారే.

అతని తండ్రిన్నీ పోలీసు హెడ్డే.

కాని, పాపం, వెంకటస్వామికి అప్పటికి వయస్సు కొంచెం మళ్లివుంది.

యాభై వొకటో సంవత్సరం నడుస్తోం దప్పుడు.

నిజాని కిది మధ్యవయస్సే.

బుద్ధివికసించి, అనుభవం పెరిగి, అదంతా కార్యరూపం వహించే వయస్సే.

కాని, అప్పటి కప్పుడే సీనియర్ల జాపితాలో పడిపోయి వున్నా డతను.

పెన్షను కూడా అతని కళ్లయెదట తాండవం చేస్తోంది.

అయినా, రెండో పెళ్ళి పెళ్ళాం కావడంవల్లా, చిన్నపిల్ల కావడంవల్లా, పసినిమ్మపండు రంగుతో చక్కని చుక్క కూడా కావడంవల్లా అరిచేత ఆడించుకునేవా డతను గోవిందమ్మని.

మొదటిభార్య బిడ్డలు లేకుండా పోవడంవల్లా, బిడ్డల మీాది అపేక్షవల్లనే తాను గోవిందమ్మని పెళ్ళిచేసుకుని వుండడంవల్లా కంటికి రెప్పలాగ చూసుకునేవా డతను.

కాని, తెనుగువాళ్లకి సైన్యంలో ప్రవేశం లేక పోవడమూ, దాని తరవాతిదే అయినా, పోలీసుశాఖలో, హిందుస్థానవాడికి డి. ఎస్. పి పదవే తరుచు చివరి దయిపోతూ వుండడమూ చూసి, శౌర్యం కంటేనూ బలపరాక్రమాలకంటేనూ బుద్ధిబలమే యెక్కువ ప్రయోజనకారి అనీ, అదే వుంటే యెంతెంత వుద్యోగాలయినా దొరకుతా యనీ, మంత్రే అయిపోవచ్చు ననీ స్థిరపరుచుకుని వున్నా డతను.

మాంసంకూరలు రక్తమాంసాలుపెంచి జవసత్వాలూ, శౌర్యసాహసాలూ కలిగించడం నిజమే కాని, అవి, బుద్ధిని మందగింపచేస్తా యనీ, కనక, బుద్ధిబలం కోరేవాళ్లు కాయగూరలే యెక్కువగా తినా లనీ సిద్ధాంతం చేసుకుని వున్నా డతను.

గోవిందమ్మలాగ అతనూ కొడుకు పుట్టా లనే ముచ్చటపడుతున్నాడు; గాని ఆకొడుకు మాత్రం అపర బృహస్పతి అయిపోవా లని ఆశిస్తు న్నా డతను.

తన కొడుకు, అధమం, జిల్లాకలెక్టరుపనో, జిల్లాజడ్జీపనో, పెద్దయింజనేరుపనో చెయ్యాలంటే, తాను, మాంసం కూరలు కళ్లంతో నయినా చూడగూడదనీ వ్రతంపట్టి వున్నా డతను.

ఇదంతా అతని మొదటి భార్యకి నచ్చింది.

ఇందు కనుగుణంగానే మసులుకుం దామె.

"ఓ — ట్రి బావనోడి వయిపోయా" వనేవారు సాటి కానిస్టేబుల్సు.

అయితే, భార్యాభర్త లిద్దరూ యెంత ముచ్చట పడ్డా, యెన్ని నోములు నోచినా, యెన్ని దానధర్మాలు చేసినా, యెంతమంది దేవుళ్ళకు మొక్కినా, చివరికి, సాగ రాల యాత్ర కూడా చేసే వచ్చినా సంతానం కలగలేదు.

"ఆ, దేవుడికి దయవచ్చిం" దని నాలుగు దినాలయినా సంబరపడ్డానికి వారి కవకాశం లభించలేదు.

ఈముచ్చట తీరకుండానే ఆమె చచ్చిపోయింది.

ఇలాంటి స్థితిలో గోవిందమ్మని పెళ్ళాడా డతను.

వెంకటస్వామి అవస్థ చూసీ, అతని ముచ్చట్లు గ్రహించీ, దోసిళ్ళకొద్దీ సంపాదిస్తున్నాడు కనక పిల్ల సరదాలు తీరనీ అనీ, మనుగుడుపులకు పంపినప్పుడే సారె పెట్టి పంపేశా రామెని పుట్టింటివారు.

ఆమెమీాద బులు పెక్కువ కావడాని కతని కిదొక కారణం అయింది.

దీంతో, ఇరవై రూపాయలకు తక్కువ కాకుండా ఆమెకి నెల కొక చీర కొనేవా డతను.

ముద్దినుసు జాకెట్లూ కుట్టించేవాడు.

ఏమి టేమిటో ఫలహారాలు తెచ్చిపెట్టేవాడు.

కొత్త ఫిలిం వచ్చిందంటే తొలినాడే తీసుకువెళ్ళేవాడు.

ధైర్యస్థైర్యాలూ, చాకచక్యమూ, ముఖ్యంగా ముద్దు పెట్టుకోడమూ బాగా అబ్బాలని యింగ్లీషు ఫిలిం వచ్చిందంటే రెండుమూడుమార్లయినా తీసుకువెళ్ళి చూపించి వచ్చేవాడు.

నాటకం అంటే బుచ్చివెంకయ్యమ్మ చెవికోసుకుంటుంది, కనక, ఆవేళ తనకి డ్యూటీ వుంటే ఆమెతో పంపేసేవాడు.

వర్షం వస్తే సరిగంగాస్నానాలు చేసితీరేవాడు.

"పాపం చిన్నపిల్ల, కాయగూరల సిద్ధాంతం చెప్పి యిప్పుడే బెదరగొట్టకూడ" దనీ "క్రమంగా అలవాటు చేస్తూ చివరికి చెబుదాం" అనీ వోపికపట్టి, ఆమెతోపాటు తానున్నూ మాంసంకూరలు తినడం ప్రారంభించాడు.

ఇది తెలిసి లైనులోవాళ్లు "మతం వొదిలేశా" డని వేళాకోళాలు చేస్తే చిరునవ్వు కనపరిచి వూరుకునేవాడు.

ఇలా వుండగా, వచ్చిన మూడో నెల్లోనే గోవిందమ్మకి నెలతప్పింది.

మరో నెల కీసంగతి వెంకటస్వామికి తెలిసింది.

ఉప్పొంగిపోయాడు.

ఈ సంగతి తనకి తెలిసిననాడు, కారణం చెప్పకుండా వచ్చకర్పూరమూ, కుంకుమపువ్వూ, జీడిమామిడి పలు

కులూ, బాదంపప్పూ, చారపప్పూ, కిసిమిసిపళ్ళూ తెచ్చి పరమాన్నం చేయించి, "ఇంకా పుచ్చుకో, ఇంకా పుచ్చుకో" అని గోవిందమ్మని ప్రోత్సాహపరిచి, లాలించి, తానున్నూ తృప్తిగా పుచ్చుకున్నా డతను.

కాయగూరల సిద్ధాంతం మరిచిపోలేదు; గాని "యిది స్థిరపడనీ" అనుకుని వోపికపట్టాడు.

మూడోనెల చొరబడాటప్పటికీ సంగతి పోలీసులైనంతా తెలిసిపోయింది.

ఆడవాళ్లే కాదు, సాటి కానిస్టేబుల్సు కూడా "కొడుకు పుడుతా" డని అతన్ని ప్రశంసించారు.

దీంతో "యిక ఫరవా లే" దనుకున్నా డతను.

## 5

డ్యూటీమీద రాత్రంతా పోలీసుస్టేషన్‌లో పడుకున్న వెంకటస్వామి, తెల్లవారు జామున మెళుకువ రాగా, చేతిలో "శ్రీ రాములవారు" అని మూడుమాట్లు రాసుకుని కళ్లకద్దుకుని, లేచికూచుని కళ్లుకూడా బాగా నులుముకుని, కాయగూరల సంగతి యెలా యెత్తుకుని యెలావిస్తరించి యెలా నడిపి గోవిందమ్మ బుద్ధి నెలా మార్చియ్యాలో యోచించుకుని వొక ప్రణాళిక వేసుకున్నాడు.

క్రిమినల్ కేసుల్లో ఆరితేరినవాడు కనకనూ, తా నల్లాసీదా అయిపోయేటట్టామె అడ్డుప్రశ్నలు వెయ్య గలుగుతుందని కానీ, చిల్లపిల్ల కనకనూ తాను పోలీసు ఆఫీసరు కనకనూ తాను చెప్పినమాట ఆమె తిరస్కరించేస్తుం దని కానీ యేకోశానా అతనికి సందేహమే కలగలేదు.

ఈ నమ్మకంతోనూ యీ దిలాసాతోనూ "బ్రాహ్మలు కూడా డంగయిపోయే ప్రణాళిక యిది" అనుకుంటూ మహోల్లాసంతో యింటికి వచ్చాడతను.

అదే మళ్లీమళ్లీ యోచించుకుంటూ, సవరణలు చేసు కుంటూ, గత్యా గత్యా ఆమె అడ్డప్రశ్నలు వెయ్యగలగ డమే తటస్థిస్తే అందుకు తగ్గ రస్తాలు ఆలోచించు కుంటూ, అతను క్షాల్యాలు తీర్చుకునేటప్పటికి గోవిందమ్మ కాఫీ తయారుచేసింది.

ఆమాటా యీ మాటా చెప్పుకుంటూ, వేళాకోళాలు చేసుకుంటూ, నవ్వుకుంటూ, తుళ్లుకుంటూ వారిద్దరూ కాఫీ పుచ్చుకున్నారు.

"ఈ కాస్తే యీ కాస్తే" అంటూ కొసిరికొసిరి మహో అరకప్పు కాఫీ అతని కెక్కువగా యిచ్చిందామె

ఆ అరకప్పులోనూ సగమైనా ఆమెకి ముట్టచెప్పక పోతే ఆమె ప్రేమ యెదట తన ప్రేమ లొగాడయిపోతుం దని, తాను పుచ్చుకుంటూ పుచ్చుకుంటూనే రెండు

మూడు మార్లు తన కప్పు ఆమె నోటి కందించా డతను.

దీంతో ప్రేమావేశం కల్గ్గా, అతను తన నోటి కందిం చినప్పు డల్లా ముసిముసినవ్వుల్లో సిగ్గూ, సిగ్గులో కులుకూ రంగరించి, కళ్లుతిప్పుకుంటూ వెంటవెంటనే తాను కూడా తన కప్పు అతని నోటి కందిస్తూవచ్చిం దామె.

ఇది చూసి "అరరే" అంటూ నాలుక కరుచుకున్నా డతను.

తాను తెలివితేటలూ యుక్తీ మాత్రమే కనపరచగా, ఆమె ప్రేమ వాక్కులే కాక శృంగారవిలాసాలు కూడా చూపించడం "వోడిపోయాన్" అని డికారెంచిన ట్టయిం దతనికి.

అయితే, కాయగూరల తెలివి మళ్లీ దూసుకురాగా, చటుక్కున జేబులో చెయ్యిపెట్టి, రుమాలు తీసి మడత విప్పి ఆమె పెదిమలు తుడవబోయా డతను; కాని "వుండండి, వుండండి" అంటూ చెయ్యడ్డుపెట్టి మొగం కూడా పక్కకి తిప్పేసుకుం దామె.

అందుకే అతను తెల్లపోగా, అతనింకా తేరుకోకుండానే, తన చెయ్యి కడుక్కుని అతడిచేత్తో ముందతని పెదిమలే తుడిచి, తరవాతే తన పెదిములు తుడుచుకుం దామె.

రుమాలుతో అంతకి ముందే సిద్ధంగా వున్నాడు కనక, అవ్యవధానంగా ముం దామె పెదిమల తడివొత్తి తన

పెదిమలు తరవాతే తుడుచుకున్నాడతను; కాని అతని మనస్సే "అబ్బే! తీసిపోయావ్" అనేసింది.

అత నీస్థితిలో వుండగా, కప్పులూ సాసర్లూ, స్పూనులూ కెటిలూ పుచ్చుకుని చక్రవాకాయ లాగ లేచి వూచలాగ పెరట్లోకి వెళ్ళిపోయిం దామె.

ఇది వూపిరితీసుకోడాని కవకాశం కలిగించిం దతనికి. మనస్సు కుదుటపడింది.

దీనికి సాయం — వేడివేడి కాఫీపుచ్చుకున్న ఫలితం అప్పటి కందుకుంది.

అయితే, కాఫీతో వచ్చిన చలాకీ చాలక చుట్టా అగ్గి పెట్టే చర్రున తీశాడు; కాని "ఛా" అనుకుంటూ మళ్ళీ జేబుల్లోకి గెంటేశా డవి.

కాని, ఆజేబులోనే రెండుమూడు లవంగమొగ్గలు చేతికి తగలగా నోటవేసుకుని కచ్చాపచ్చాగా నమిలాడు.

నాలుక చుర్రుమంది.

అది మంచిచురుకు పుట్టించింది.

"సరే, రానీ" అనుకున్నాడు.

తలంపుతోనే ఆమె వచ్చేసింది.

అప్పటికప్పుడే లేచీ, ప్రణాళిక మరోమాటు తిరగ వేసుకునీ వుండి, వచ్చీరావడంతోటే ఆమె బుజాలమీద చేతులు వేసి, "పిచికమీద బ్రహ్మాస్త్రం" అన్నట్టు

పదహారేళ్ల పిల్లమీద బ్రహ్మాండ మైన ప్రణాళిక ప్రయోగిస్తున్నందుకు తనకే నవ్వురాగా అది బాగా కుదించుకుని, చూపుల్లో యెంతో అపేక్ష కనపరుస్తూ "అయితే, బీరకాయలు పంపమంటావా కూరకి, నీటివంకాయలు పంపమంటావా?" అని మెల్లిగానూ లాలనగానూ అడిగాడు.

అందుకు "ఏమిటీ?" అనడిగిం దామె వింతపడుతూ, అంతకి ముందే అతని చేతులు పట్టుకుని.

"ఎన్నిసార్లయినా చెబుతాను, ఇందులో వున్న కిటుకు నీకు తెలిస్తే గదా?" అన్నట్టుచూస్తూ వొక్క చిన్న మందహాసం విసిరి, తరవాత అక్కడి మాటలిక్కడా, యిక్కడి మాట లక్కడా చేర్చి, మళ్లీ ఆ వాక్యమే పలికాడతను, గంభీరంగా చూస్తూ.

కాని, మయూరక్రేంకారం లాగ వెంటనే నవ్వేసింది గోవిందమ్మ, అతని చేతులు తప్పించుకునీ, తనచేతులు తీసేసుకునీ, వొక్క అడుగు వెనక్కివేసిన్నీ.

నిర్విణ్ణు డయిపోయా డతను.

అతను తేరుకోకుండానే "బీరకాయలు కొని బ్రాహ్మలకు పంపండి. నీటి వంకాయలు కొని కోమట్లవీధిలో లాభాని కమ్మించండి" అనేసిం దామె, తొణుక్కోకుండానూ, అంతకంటే గంభీరంగా చూస్తూనూ.

స్తబ్ధు డయిపోయాడు, పోలీసుఆఫీసరు, వెంకటస్వామి.

"నేనింత లాలనగా అడుగుతూ వుంటే తానంత హేళనగా జవాబు చెబుతుం దేమిటి?" అంటూ అసంతృప్తిన్ని పొందా డతను, కాస్త తేరుకున్నాక.

అదంతా "మాంసాహారం పెంచిన రాజసం" అనుకున్నాడు, తాను మాత్రం సాత్వికం విడిచిపెట్టకుండా.

దానికి మందు కాయగూరలవల్ల వికసించిన తన ప్రతిభ చూపెంచడమే గాని అడలకొట్టడం కా దనుకున్నాడు.

అసల్లో, అతను, నీటివంకాయల మొదట బీరకాయలు తీసికట్టు కనకనూ, గోవిందమ్మ చిన్నపిల్ల కావడంవల్ల యింకా పొదు పెరగదు కనకనూ, రుచులకే పోతుంది కనకనూ నీటివంకాయతో తెమ్మంటుందనీ, కాదంటే, చిక్కుడుకాయలో బంగాళాదుంపలో తెమ్మంటుం దనీ, ఆమెచేత చెప్పించుకుని చేస్తే మోజెక్కువ వుంటుం దనీ, తాను ఆమె చెప్పినట్టు నడుచుకుంటున్నట్టూ అవుతుందనీ యిలా ప్రారంభించాడు గానీ, బీరకాయలు తెద్దా మని అతనికీ లేదు.

ఆమె యింత గడుసురాకడ వస్తుం దనిన్నీ అతను అనుకోలేదు.

కాగా, దీంతో అతను ఉల్లాసీదా అయిపోయాడు.

"లోకువకట్టేస్తుంది" అనుకుంటూనే మాటకూడా ఆడలేకపోయాడు.

# 6

చివరికి దగ్గిరుండి, అతనిచేతనే కోడిపుంజుని కోయించి వండి వడ్డించిం దాపూట గోవిందమ్మ.

ప్రణాళిక అమలుచేయలేకపోతున్నందుకే కాక — వ్రతం నిర్వహించుకోలేకపోతున్నందుకున్నూ గాక—తన చేతులతోనే అంతపని చెయ్యవలసివచ్చినందుకు చాలా యిదయిపోయాడు వెంకటస్వామి.

అయితే, ఇవ్వాళ పూటలో తేలేది కాదనీ, గోవిందమ్మ వాళ్ళ పట్టాన లొంగదనీ తెలిసిపోయిం దతనికి.

"కనక, తొందరపడకూడ" దనుకున్నాడు.

"ఇంతమాత్రాన నిరుత్సాహపడి వుద్యమం విడిచిపెట్టుకోగూడ" దనిన్నీ దృఢపరుచుకున్నాడు.

"కాయగూరల మహిమ అలా వుండగా, యిన్నేళ్లు గడిపి, ఇంత అనుభవం సంపాదించి, యింత తపస్సు చేసి, ఇంత ఆత్మశక్తిన్నీ సంపాదించుకున్నానే, యివన్నీ గంగపాలు చేసి యీపిల్ల దగ్గిర చేతులు ముడుచుక్కూచోనా?" అనిన్నీ అభిమానపడ్డాడు.

"భోజనానికి రావచ్చు" నని ఆమె పిలిచాటప్పటికీస్థితికి వచ్చివుండినా డతను.

చేతులూ కాళ్లూ కడుక్కుని, చెదిరిపోయిన మీసా

లెగ నవ్వుకుంటూ అతను వచ్చి కూచునేటప్పటికి, చేసిన వన్నీ వడ్డించిం దామె.

చిన్న పళ్లెం మూతపెట్టి వెండిగళ్ళాసుతో మంచి నీళ్లున్నూ అంతకి ముందే సిద్ధంచేసింది.

మొదట, వడ్డించిన పదార్థా లన్నీ పరకాయించి చూసుకున్నా డతను.

తరవాత మూత తీసి కింద వుంచి, గళ్ళాసులోని మంచి నీటితో రెండు చేతులూ తడుపుకున్నాడు.

చివరికి కళ్లుమూసుకునీ, మొగం పైకెత్తుకునీ, చేతులు జోడించుకునీ, నిటారుగ్గా కూచునీ మాంసంకూర మినహాగా తక్కినవన్నీ ఆరగించ మని శ్రీరాములవారిని ప్రార్థించు కున్నాడు.

ఆమె నెయ్యి వడ్డించింది.

ఆనెయ్యి కొంచెం పెదిమలకు రాసుకుని, తరవాత, మాంసంకూరతో వొక్కొక్కముద్దే లోపలికీ, మిడుతూ మిడుతూ చూస్తూ వొక్కొక్క మాటే పైకీ విడిచి పెట్టసాగా డతను.

"నే ననేకమంది సబిన్‌స్పెక్టర్లనీ సర్కిల్సునీ, డీవై యస్పీలనూ, డీయస్పీలనూ చూశాను; గాని వొక్క బాహ్మలు తప్ప మరేజాతి వాళ్లూ పగడైన మెత్తులు వెయ్యలేకుండా వున్నారు"

అతనీమాట మొగం వంచుకుని తనలో అనుకున్నట్టనడంవల్ల బదులు చెప్పవలసిన అగత్యం కనబడక విని వూరుకుం దామె.

నిజానికి, జవాబుకోసం తానే అపేక్ష పడకపోయినా, యీమౌనం చూశాటప్పటికి తనమాట తనకే శ్రుతిలేని పాట లాగ కనపడిం దతనికి.

అయినా నిరుత్సాహపడక "వాళ్ళ బ్రాహ్మలు మాత్రం—వోః! దేవత లూడిపడతారు వారి యెత్తులకు" అన్నాడు మళ్లీ అలాగే.

విని, మళ్లీ వూరుకుం దామె.

ఆమె దృష్టీ, శ్రద్ధా ఆకళించుకోవా లని వాళ్ళ మాటు కంఠం సవరించుకుని, మొగం వంచుకునే వుండి, తల పంకించుకుని "తెలివితేటలు వారిసొమ్ము" అన్నాడు మళ్లీ అలాగే.

దీనిమీాద నయినా ఆమె యేమయినా అనకపోతుందా అని అతను చెవులు రిక్కించుకున్నాడు ; గాని అప్పుడూ ఆమె అలాగే వూరుకుంది.

అంతే బలవంతాన బండి నడపడం అతనికీ కష్టంగానే వుంది ; కాని "గొప్ప గొప్ప వుద్యమాలు మాటలతో కొనసాగుతాయూ మరీ ?" అని తనకి తానే సద్ది చెప్పుకున్నాడు, మొదట.

"మొదటి విజయం యెప్పుడూ పశుబలానిదే. ఓపిక పట్టు గలిగితే, అంతిమ విజయం మాత్రం యెప్పుడూ సాత్వికానికి తప్పదు" అని తరవాత ప్రకృతి తత్వం పరిశీలించుకున్నాడు.

"ఎలాంటి పరిస్థితుల్లోనూ కూడా పూనుకున్న ఉద్యమం విడిచిపెట్టకపోవడంలోనే వుంది మనిషి సత్తా" అని దిలాసా కూడా తెచ్చుకున్నాడు, చివరికి.

దీంతో, మొదట వుండినంత వుత్సాహమూ మళ్లీ కలిగిం దతనికి.

వెంటనే "అదంతా కాయకూరల మహిమ" అని నిశ్చయించి, వొక్కమాటామె కేసి చూసి, మళ్లీ మొగం వంచుకున్నాడు.

ఆ మాటతో నవ్వు వచ్చిం దామెకి.

ఆచూపుతో తెరలు తెరలుగా వురకలు వేసిందా నవ్వు; కాని అది కొంటె చూపుల్లోకి మళ్లించుకుని "అ — ల్లాగటండీ?" అన్నట్టు తల పంకించుకుని వూరుకుం దామె.

అప్పటి కొక మజిలీ దాటినంత తేలిక అనుభవించా డతను.

కించత్తయినా యెదురువాదం తల యెత్త నివ్వకుండా యింత పసందుగా వుపోద్ఘాతం నడపగలగడం "గొప్ప

శుభసూచన కాదూ ?" అనుకున్నాడతను.

శాసనసభలో ప్రతిపక్షులను మట్టిబొమ్మలుగా చేసి కూచోబెట్టడానికి తన కొడుకిక్కడి మంచి పునాది అవుతుం దని కూడా భావించుకున్నాడతను.

అయినా, ఆమె యింగితం యేమిటో కనిపెడదా మని అతను, మొగం పైకెత్తుకుని చూసేలోపున, గిన్నెడు పెరుగూ కంచంలో వొంచేసి, కసింత వుప్పునూ్నా వడ్డించి, కాలు మడిచి యెడమపాదమూ హీపూ గోడ కానించుకుని పెరట్లోకి చూస్తూ యెదట నుంచుందామె.

# 7

మన్నాడు, పొట్టేలుమాంసం వండి వడ్డించిందిగోవిందమ్మ.

"పట్టుదలగానేవుందే" అనుకున్నాడు వెంకటస్వామి.

లోపల్లోపల నవ్వుకుని "హనుమంతుని ముందరా కుప్పిగంతులు ?" అనుకుంటూ తల పంకించుకున్నాడు.

అయినా, ఆ కూర కూడా లొట్టలు వేసుకుంటూనే తిన్నాడు ; గాని "మాంసం కూరలు తెలివి తేటలు చంపేస్తాయి. బలపరాక్రమాలు మంచివే గాని అవి బుద్ధిబలానికి లొచ్చు" అని వూరుకున్నాడతను.

ఒక్కమాటు చిరునవ్వు నవ్వుకుని, తలకూడా పంకించుకుని ఆమె కూడా అప్పటికి వూరుకుంది.

మూడో నాడు అడవిపంది మాంసం కూర.

మసాళా గిసాళా దండిగా వేసి రాచకొమారుడు తయారుచేశాడది.

బుచ్చివెంకయ్యమ్మ చాలా ప్రేమతో వంపింది.

"అడిగితే, నీపెనిమిటితో నువ్వు వండినట్టే చెప్పాలి సుమా" అని కబురుకూడా పంపిందామె.

ముసిముసినవ్వులు నవ్వుకుంటూ అది వడ్డించి "యిక మొదలు పెట్టండి పంచాంగం" అని వొకమాటు బెల్లిస్తూకూడా చూసి, తరవాత తరవాయివడ్డన పూర్తిచేసిందామె.

"ఇంకేం! మహా పట్టుదలమీదే వుందయ్యోయ్" అని గృథవరుచుకున్నాడతను; గాని అప్పటికప్పుడే మసాళా ఘాటు నసాళం అంటింది.

దీంతో, నెయ్యి వడ్డించేదాకా ఆగలేక వొట్టికూరే ముందు నోట పెట్టుకున్నాడతను.

"భలే కూర" అనుకున్నాడు.

పైకిన్నీ యీమాటే అంటూ గోవిందమ్మకేసి చూసి "కూడూ, ఇలా కూచో" అన్నాడు, ప్రేమ వొలకపోస్తూనూ, పక్కని స్థలం చూపిస్తూనూ.

మొదట వొక్కపిసరు సిగ్గుపడిందామె.

తరవాత "మరి కథ సాగించండి" అనుకుంటూ సిద్ధపడి, చివరికి సావధానత కనవరుస్తూ చతికిలబడిందామె.

ఏమీ యెరగనట్టు "ఎందుకూ!" అన్నట్టు కూడా చూసింది.

నిదానించగా, ఆచూపులో మాధ్ధ్యమే కనపడిం దతనికి.

"పాపం, కుర్రతనం, పెంకితనం మాత్రం కాదు" అని అతనికి ధైర్యమే కలిగింది.

వెంటనే "హాస్యాలాడ్డంలేదు నేను. వున్నదున్నట్టూ, తోచింది తోచినట్టూ చెబుతున్నా" నంటూ మెల్లిగా ప్రారంభించాడు.

విని, మిడుతూ మిడుతూ చూస్తూ వూరుకుంది గోవిందమ్మ; గాని యెత్తుగడ మారింది దని మాత్రం గ్రహించేసింది.

"ఈ అవస్థ అంతా యెందుకండీ!" అని అడిగేద్దా మనుకుంది; గాని "తొందరేమీ!" అని వోపికపట్టింది.

"మాంసం కూరలు మాత్రం మానగూడదు" అని స్థిరనిశ్చయం కూడా చేసేసుకుంది.

ఇదేమీ గుర్తించుకోలేక "ఈవేళ మతంలో కలిపెయ్యాలి" అనిస్థిరపరుచుకుని "ఎప్పుడు నేర్చుకున్నావో గాని నలభీమపాకాలను కూడా మించివుంది నీవంట" అన్నాడు మొదట.

"అలాగా!" అన్నట్టు తల వూపిం దామె.

"మొత్తానికి మాంసం కూరలు నువ్వు వండితేనే మజా" అన్నాడు, మళ్ళీ.

"అయితే!" అన్నట్టు చూసిందామె.

బదులు చెప్పకుండా ఆమె చూసీ, తల వూపీ వూరుకోడం అతని కేమీ బాగా లేదు. అయినా అంతటితోనన్నా నిరుత్సాహపడక "అందులోనూ యీ కూర వుందే, యివాళ? వా! బ్రాహ్మలకన్నా-డా నోరూరించేస్తుందంటే నమ్ము" అన్నాడు, వూగీస లాడుతూనూ, పెదిమలుబిగించుకుని తల తాటించుకుంటూనూ.

దీనిమీద నవ్వు ముంచుకు వచ్చేసింది గోవిందమ్మకి; కాని అతికష్టంమీద నిలువుకోగా అదామెని వూపేసింది.

ఆ వూపున్నా ఆమె నిగ్రహించుకుంది; కాని చిరునవ్వు మాత్రం తప్పనిసరి అయిపోయి, చివరికి మొగం వంచేసుకుందామె.

అది కూడా అతనికి చాలా కష్టం అనిపించింది.

ఇంతగా మెచ్చుకున్నందు కామె పొంగిపోతుందనీ, చిన్నపిల్ల కనక, యీ పొగడ్తకు తట్టుకోలేక సిగ్గుపడిపోతుందనీ, అయినా చివరికి సాహసించి "అంత బాగుందిటండీ? నిజంగానే? ఏమండీ చెప్పరూ? మీకు నచ్చుతుందో లేదో అని పితపితలాడిపోతున్నానండీ, నేను......ఏమో బాబూ! దాని కది సరిగా పడింది

కాబోలు మసాళ్లా, నాకేం తెలుసూ?......బతికాను"
అని అమాయికత్వం కనపరుస్తూ లేడిచూపులు చూస్తుం
దనీ, ఆపునాదిమీద తారురోడ్డుమీద మోటారు లాగ
తన ప్రణాళిక చరచరా సాగిపోతుందనీ, ఫలిస్తుం దనీ
అనుకున్నా డతను; గాని యిప్పుడున్నూ యిలా చేసి
నందుకు తెల్లపోయి వూరకున్నాడు.

పోనీ, ఆ వూరుకోడం భోజనం విషయమున్నూ
అయివుంటే బాగుండిపోను; కాని, ఆ కూరసావాసంతో,
కలుపుకున్న అన్నం అంతా ముద్దమీద ముద్ద చొప్పున
అతని కడుపులో పడిపోయింది.

అది మంచి పుష్టి కలిగించిం దతనికి.

అతను శుద్ధ అహింసావాది కనక, తామసానికి
ఆస్కారం లేక దాంతో రాజసం పెరిగింది.

అయితే, సాత్వికం లాగ రాజసం వూరుకోనివ్వదుగా?

ఊరుకోనివ్వకపోడంలోనూ, రాజసం, యుక్తిప్రత్యు
క్తులతో కార్యవాదానికి దారితీస్తుంది; గాని తామసం
లాగ పరుషవాక్కులతో ఖడ్గవాదం అందుకోనివ్వదుగా?

కనక, ఆ ప్రణాళికలో మరో రస్తా అందుకుని
మళ్ళీ వెంటనే ప్రారంభించా డతను.

"చూడూ" అన్నాడు, మొదట.

ఆమె చూసింది.

"బాలసూర్యుడు లాగ ధగధ్ధగాయమానంగా మెరిసి పోయే మొగపిల్లవాడు పడ్డాడు నీ కడుపున" అన్నా డతను, కనుబొమ్మ లెగరవేసుకుంటూ.

సిగ్గుపడి మొగం వంచుకుం దామె.

"అతగాడు నాకు పేరు తెస్తాడు. నిన్ను సుఃఖపెడ తాడు" అన్నా డతను.

ఒక్కమా టతని చూపుల్లో చూపులు కలిపి, మొగం వంచుకుని, లోపల్లోపల మురిసిపోయిం దామె.

"తెలివి తేటలకు బృహస్పతి అటూ, మనవా డిటూను" అన్నా డతను, స్థిరవిశ్వాసం ప్రకటిస్తూ.

"తెలిసిపోయింది" అన్నట్టు చూసిం దామె.

ఏ విఘాతమూ లేకుండా అసలు విషయం యిలా ప్రకటించగలిగినందుకు సంతుష్టి పొంది "మన చిట్టితండ్రి అంతటివాడు కావడాని కయినా, సామాన్యు డయి పోడాని కయినా కీలకం మనచేతిలో వుం" దన్నా డతను, పిడికిలి చూపిస్తూ.

"అంటే!" అనడిగిం దామె, విసిగిపోయి చురచుర చూస్తూ.

"జిజ్ఞాస రేకెత్తిం" దనుకుని స్తిమితపడి, ముందు, గోడకి చేరబడ్డా డతను.

తరవాత గంభీరంగా చూస్తూ "మన కులం పిల్లలకు

బలపరాక్రమాలకు లో టెలా వస్తుందీ? శౌర్యసాహ సాలు మాత్రం తక్కువ మెలా అవుతాయీ?" అనడిగా డతను, ప్రశ్నార్థకంగా తలా చెయ్యా వూపుతూ.

"కనక!" అందామె, పురప్పుర చూస్తూ, నిలవతీసినట్టు.

దీంతో, అతని గొంతుక నొక్కేసిన ట్టయింది.

నల్లేరుమీద బండి లాగ చరాచరా నడిచిపోతూ, అమోఘమై వుండిన ఆప్రణాళిక, ఆచూపుతో తక్కీ మని ఆగిన్నీ పోయింది.

కాని, వొక్క క్షణకాలం మాత్రమే అతను స్తబ్ధుడై వుండిపోయాడు.

ఉత్తరక్షణంలోనే "దానికి తేలేకపోతామూ మనం!" అని ఆత్మ ప్రత్యయం కలిగించుకున్నాడు.

ఈడలాసాతో అన్యవధానంగా అందుకుని "భీముణ్ణి చూడూ. అంత సత్తుపరాశి యెవ రున్నారూ? కాని తెలివి శూన్యం. అంచేతే కృష్ణుడు సూచన చేస్తేగాని దుర్యోధనుణ్ణి తొడలు విరగ్గొట్టి కూల్చలేకపోయాడు. అక్కడ కొడితే గాని దుర్యోధనుడు చావడు మరి" అని మాతి బిడాయించుకుని గంభీరంగా చూశా డతను.

అది విని ఆమెకూడా గంభీరంగానే చూసింది.

చూసిమాత్రం వూరుకుంది.

ఆ ఔదాసీన్యం సహించలేక "అంటే యేమన్న



4

మాటా?" అని తనకి తానే ప్రశ్నించుకుని, వొక్క క్షణం ప్రత్యుత్తరం కోసం నిరీక్షించి, ఆమె బదులు చెప్పక పోగా "తెలివి ముఖ్యం అన్నమాట" అని తనకి తానే బదులుచెప్పుకున్నా డతను.

చెప్పుకుని, దీని కిక తిరుగు లే దన్నట్టు చురుగ్గా చూసి, వూరుకోలేక "యేమంటా?" వన్నాడు, చివరికి.

గోవిందమ్మ "అవు" ననేస్తుం దనే అతని నమ్మకం.

"ఇలాంటి నిదర్శనం చూపించాక మరోలాగ అన డానికి వీలేదీ!" అనిన్నీ అతని ధైర్యం.

కాని "తెలివి మాత్రం వుండి, మరి, బలం లేక పోతేనో?" అనడిగిం దామె.

ననుకుతూ ననుకుతూనే అడిగింది; గాని అడిగిమాత్రం, నిలవతీస్తున్నట్లు చూసింది.

దీంతో, అతని ప్రణాళిక టుప్పు మని మరోమాటు తెగి చక్కాపోయింది.

తెల్లపోయాడు పాపం, అతను.

# 8

"ఎందుకూ, ఇంగ్లీషు చదివావు కావు గాని, ప్రాశికూ టింగు ఇన్‌స్పెక్టరువి కాదగినవాడవు కావుటోయ్ ?" అన్నారొకరిద్దరు డి. యస్. పీలు. వెంకటస్వామిని.

బ్రాహ్మణ డి. యస్. పీలే అన్నా రామాట.

"కాయగూరల మహిమ అలా వుండగా, మరి ఠిలా పొగడ్త అంతా వ్యర్థంగా పోవలసిం దేనా?" అనుకుని శౌర్యం తెచ్చుకున్నా డతను.

అలాంటిదీ యిలాంటిదీ కాదు మళ్లీ, ఆ – ధ్యా – త్మి – క – శౌర్యమే తెచ్చుకున్నాడు.

గోవిందమ్మ వచ్చినప్పణ్ణించీ మాంసం కూరలు తినడం వల్ల కమ్ముకున్న తామసంపొర చీల్చిస్నీ పారేసుకున్నాడు.

దాంతో, కారుమబ్బుల్లో మెరుపుతీగ లాగ అతని సాత్వికప్రతిభ తళుక్ తళుక్ మంది.

వెంటనే "స్స" అంటూ సీత్కారం చేసి "అబ్బా, కాసాకీ విను అడ్డదిడ్డంగా మాట్లాడతా వేమిటి మధ్య మధ్య?" అని విసుక్కుని, దాంతో ఆమె బెదరి పోతుం దేమో అని కంగారుపడి అంతలో బుజ్జగింపు మొగం పెట్టు కుని "పసిదానవు నువ్వు. కష్టసుఖాలూ లాభనష్టాలూ నీకేం తెలుసునూ? నీ సవతి కొక్కమాటు చెప్పాను. చెప్పా నంటే సూచించా, నంతే. బతికి వుండగా మరి మాంసం కూర వండలే దది... కళ్లతో కూడా చూడ లేదు. ప్రాప్తం లేకపోయింది గాని యెంతెంత వుద్యో గాలు చేసేవాళ్ళని కనివుండునూ అదీ? పెట్టిపుట్ట లేదు గాని, పెద్దకలెక్టర్లకి తల్లి అయి వుండవలసింది కాదూ అదీ?"

అనడిగా డతను, జెల్లించి చూస్తూ.

వినివిని, చూసిచూసి, కనబడీ కనబడనట్టు చిరునవ్వు నవ్వుకుని వూరుకుంది గోవిందమ్మ.

అయితే, ఆ పసి మొగాన — ఆ అమాయికపు నవ్వులో, ఆ లేత కళ్లల్లో వటబీజప్రాయంగా వుండిన వెటకారం గుర్తించ లేకపోయా డతను.

కాగా, వొక్క క్షణం భోజనం సాగించి, అంతలో వొక తన్నా స్ఫురించగా మెరుపుకొట్టినట్టయి, గభీ మని గోడకి చేరబడి మళ్ళీ అందుకున్నా డతను.

"ప్రపంచకానికి ప్రపంచకం యీనత్తూ యిప్పుడు వోటుమీద తిరుగుతోంది. వోటంటే యెరుగుదువా, వోటు? చక్రవర్తుల చేతిలో వుండే రాజదండం కంటే గొప్ప దన్నమాట. అయితే యేమిటో తెలుసా? ఎవ డెక్కువ వోట్లు సంపాదించుకుంటాడో వాడు గవర్నరు గారి ప్రధానమంత్రి అయిపోతాడు"

ఆమె యిది విని వూరుకుంది.

"అన్నివోట్లు సంపాదించా లంటే సంచులకొద్దీ డబ్బయినా గుమ్మరించాలి, వల్లమాలిన తెలివితేట లయినా చూపించాలి. అంతేగాని, వోటుదగ్గిర బల పరాక్రమాలూ శౌర్య సాహసాలూ గుడ్డిగవ్వకున్నా మారవు. కాబట్టి, మనం మన చిట్టితండ్రి అఖండ మేధా

వంతు డయేట్ట్లు చూసుకోవాలి"

ఇలా అని తల పంకించుకుంటూ వొక్కమా టామె కేసి గంభీరంగా చూశా డతను.

అప్పుడున్నూ ఆమె విని వూరుకోగా, బుర్రవంచుకుని మరోమాటు భోజనం సాగించాడు.

ఊరుకోలేక, తరవాత "చూశావూ?" అంటూ మళ్ళీ అందుకున్నాడు.

"మన దగ్గిర యేమంత డబ్బుంది గానీ – అయినా యెంతో కొంత వుందే అనుకో. అయితే, అది మన చిట్టి తండ్రికి ఇంగ్లీషు చెప్పించడానికి సరిపోతుంది. ఇక వోట్లకోసం గుమ్మరించడాని కేదీ? కనక, యిక గొప్ప తెలివి వుండితీరాలి. అదెలా సంభవిస్తుందీ? కష్టపడి, మనం, దూరాలోచనతో పకడ్బైన పునాది వేస్తేనే మన నాయనకి అంత తెలివి అబ్బుతుంది......ఇ. తకీ: మంత్రి అంటే యేమిటో తెలుసా?"

"ఏమిటీ?" అన్నట్టు కనుబొమ్మ లెగరవేసుకుందామె.

"మంత్రి అంటే చిన్న గవర్న రన్నమాట. అంటే, మన సబినస్పెక్టరుగారి తరవాత నే నెంతవాణ్ణో గవర్నరు తరవాత మంత్రి అంతవా డన్నమాట. అయితే, మరి, మంత్రి అయినవాడి కొక్కొక్క నెలకి జీతం యెంతో తెలుసా నీకు?"

చెప్పిచెప్పి చివరికిలా లాలిస్తూ అడిగాడతను.

"తెలియు" దన్నట్టు తల అడ్డంగా వూపిందామె.

"దినముత్యాల మాంసం మెక్కడం వొక్కటే తెలుసు నీ" కన్నట్టు ముందు హేళనగా చిరునవ్వు నవ్వాడతను; కాని, తరవాత, వోపిక పట్టడం తప్పదని గుర్తించి, ఉపదేశముద్ర కూడా పట్టి, తల తాటించు కుంటూ, ఆగిఆగి, వొత్తివొత్తి "అయిదు వేలా — అయిదు వందలా — ముప్ఫయిమూడు రూపాయల — అయిదణాల నాలుగు పైసలు — అంటే దమ్మిడీ లన్న మాట — నెలకి" అని చెప్పాడు, కనుబొమ్మలున్నూ యెగరవేసుకుంటూ.

ఆమె మొగం విప్పారింది.

ఆమొత్తం తానుకూడా వొకమాట కూడబలుక్కుందామె.

తళతళ లాడుతూ రూపాయల గుట్ట కనపడ్డట్టయి కళ్లు చెదిరిపోయినట్టున్నూ అయిందామెకి.

"ముప్ఫయి కాసు లుంటే — అంటే అయిదు వందల రూపాయ లుంటే కట్టకాసులపేరు వస్తుం" దన్నాడొకమాటు ఆమె తండ్రి.

తనతండ్రి అలాంటి "బాలతొడుగు" పెట్టగలవాడు కాడని తెలిసే వుండినా, తన తండ్రి స్థితిని పట్టి అలాంటి

నగలు చేయించగల భర్త దొరకడమున్నా కష్టమే అనిన్నీ తెలిసే వుండినా, ఆచిన్నతనంలోనే ఆమెకి ఆకాసులపేరుమీద మోజు పుట్టేసింది.

దీంతో, దినమ్మూ పొద్దున్న లేవగానే "పెళ్లిలోనే కాసులపేరు పెట్టే మొగుణ్ణి దయచెయ్యి" మని యేడు కొండలవాడికి మొక్కుకునేది పాపం, అయినా ఆమె కోరిక తీరలేదు.

తన మొగుడికి నెలకి పాతిక రూపాయలే జీతం.

రెండు కాసుల కయినా చాలి దది.

అసలు, సంసారానికే కటాకటి.

మంత్రికి వచ్చే జీతంతో, అతని పెళ్ళానికి నెలకే పదకొండు కాసులపేళ్లు.

"బాబోయ్" అనుకుంటూ స్వగతంగా గుండెలు కొట్టుకుం దామె.

ఇదంతా గ్రహించేశాడు వెంకటస్వామి.

"పాచికపారిం" దని పొంగిన్నీ పోయాడు.

ఈ ధైర్యంతో "విన్నావా?" అంటూ ఆమె దృష్టి ఆకర్షించుకుని "మన చిట్టితండ్రి అంతవాడయి, అంత జీతం తెచ్చేటప్పటికి —"

ఇలా అని వొక్కమాటాగా డతను.

ఆగి, అటూ యిటూ చూసి, మొగంమీద మొగం

పెట్టి, కంఠం నొక్కుకుని "పాతికరూపాయల జీతగాణ్ణి నేనే నెలకి మరో యాభయ్యేనా కొట్టేస్తున్నాను గదా, అయిదువేల పైచిల్లర జీతగాడు — మరో పదివేలయినా వాలు —" అంటూ మళ్ళీ సరిగా కూచున్నా డతను.

కూచుని "యే మనుకున్నావో మరి!" అన్నట్టు చూసి, స్వరం మామూలు స్థాయికి తెచ్చుకుని "మన చిట్టితండ్రి అంత వా డయి అంత జీతం తెచ్చాటప్పటికి యింటి పెత్తనం అంతా నీది. అనుభవంకూడా నీది. ఇవాళ పోలీసు కానిస్టేబుల్లు పెళ్ళాని వయి ఉన్నావు గాని, ఆవేళ, మంత్రిగారి తల్లినయి ఉంటావు' అన్నాడు, బెల్లించిచూస్తూ.

బ్రహ్మానందపరవశురా లయిపోయిం దామె.

"మీరు మాత్రం మంత్రిగారి తండ్రి అయిపోరూ!" అనబోయింది కూడా; కాని అంతలో, వొకానొక మధురభావమూ, మధురానుభూతీ జ్ఞాపకంవచ్చి, సిగ్గుపడి పోయి మొగంవంచేసుకుంది.

అదిన్నీ గుర్తించి "కనక, నా మాట విను" అని మళ్ళీ ప్రారంభించా డతను.

ఆమె సావధాన అయింది.

"శాస్త్రిల సంగతి అలా వుంచు. పెద్దల మాట కూడా అలా వుండనియ్యి. నేను స్వానుభవం చెబు

తున్నాను విను. మాంసం మానేశాక నా తెలివి తేట లెంతో యెక్కువయిపోయాయి" అన్నాడతను, మెల్లిగా.

ఈముక్తాయింపు చెవిని పడేటప్పటి కామె కళ్లు రుస రుస లాడాయి.

దాంతో "దేవు డిచ్చాడు మీా కవి" అనేసింది, దురుసు గానూ, అవ్యవధానంగానూ.

అంతకంటే అవ్యవధానంగా "అవు" నన్నా డతను.

"అహింస అవలంబించాను కనక, ఆ శ్రీరామచంద్ర మూర్తి, దయవచ్చి నా కెక్కువ తెలివి తేట లిచ్చాడు." అని సగర్వంగా కూడా చూశాడు.

"మరి ఆవిడకు బిడ్డ లెందు కిచ్చాడు గాదూ?" అని నిలవతీసిం దామె, తల యెగర వేసుకుంటూ.

తెల్లబోయాడు వెంకటస్వామి.

అత ననుకోని ప్రశ్న యిది.

ఆలోచించాడు; గాని, దానికి తగ్గ రస్సా దొరక్క పోడమే కాదు, భావయంత్రమే నిలిచిపోయింది.

అయితే, దాని వేగం అతని కళ్ళల్లో కేంద్రీకృతం అయింది.

దాంతో, అతని చూపులు నిశితాలయినాయి.

ఆచూపులు భరించలేక ఆమె మొగం వంచేసుకుంది.

ఇదే వొక అవకాశంగా, మళ్ళీ ప్రారంభించా డతను.

"బిడ్డలతల్లి వయిపోతున్నావు గాని నీకింకా కుర్రతనం పోలేదు. తన పథ్నాలుగో యేట వచ్చింది, యిరవై యెనిమిదేళ్ళు నాతో కాపరంచేసింది, వొక్కనా డయినా నా కెదురుచెప్పిందా నీసవతి ?"

"నేను చూశానా ?"

ఆమె తాపీగానే అడిగింది. అయినా, మళ్ళీ వొక మాటు నిర్విణ్ణు డయి, మళ్ళీ అందుకున్నా డతను.

"మన చిట్టితండ్రి నాలాగే పోలీసు కానిస్టేబు లవుతా డనుకో. లేకపోతే, కిల్లీదుకాణం పెట్టుకుంటాడనుకో. అదీ కాకపోతే, బస్సుకండక్టరో, జట్కావాడో, రహదారీ కుడవసరంగో అయిపోతా డనుకో" అన్నా డతను, ఆత్రం కనపరుస్తూ.

ఆమె కెప్పుడూ తట్టని వ్యూహ యిది.

ఆమె మనస్సు గుబగుబలాడిపోయింది.

"చూడగలవా నువ్వు ? నీమనస్సు ఖేదించదూ? ఇంతేనా చిట్టితండ్రికి మనం చెయ్యగలది ? మంత్రి కాకపోతే మానె, పెద్ద కలెక్ట రయినా అయిపోయే టట్టు—మొదటే డీ. యై. యస్పీ వుద్యోగ మయినా అయేటట్టు చూడద్దూ మనం ?" అని గబగబా అడిగేశా డతను.

మిడుతూ మిడుతూ చూసిం దామె.

పాపం బిక్కమొగం పడిం దామెకి.

"పెద్దబ్బాయేనా మంత్రి కావడానికి తగిన పునాది వెయ్యకపోతే నా తెలివంతా యేమి కానూ? నీ కెంత నేర్పుండి యేమి లాభమూ?"

బదులు చెప్పలేకపోయింది, గోవిందమ్మ.

"నీమీద నాకు కోపమా? నువ్వు సుఖిస్తే నేను చూడలే ననుకున్నావా?" అనడిగా డతను మొగంమీద మొగంపెట్టి.

"మిమ్మల్నీ సుఖపెట్టా లనే గాదూ నా తాపత్రయ మూను!" అనడగబోయిం దామె.

అతని కేసిన్నీ చూసింది; కాని సిగ్గుపడి పోయింది.

దీంతో "మన ప్రణాలిక నగ్గేసింది" అని ధైర్యం కలిగిం దతనికి.

"ఇక గట్టిగా ఆజ్ఞ పెట్టవచ్చు" నని ధీమా కూడా కలిగింది.

దాని అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వచ్చి, ఉద్యోగదర్పం అత న్నావహించింది.

కంఠంలో కార్కశ్యం అంకురించింది.

చూపులు పదునెక్కాయి.

ఉపన్నాహంతో పూర్తిగా స్టేషన్‌హౌసాఫీస రయి పోయి, దానికి చిహ్నంగా వెన్ను విరుచుకుని "కనక, యీ క్షణం మొదలు పురుడు వచ్చేదాకా నువ్వు మాంసం

తినవద్దు. ముట్టుకోవద్దు. చూడనేవద్దు. తరవాతయినా నా సెలవు పుచ్చుకోకుండా ఆవూ సెత్తవద్దు" అని విధించేశాడతను.

విధించి గబగబా భోజనం సాగించాడు.

కొట్టినంత పనయిందామెకి, యిదంతా చూశాటప్పటికి.

వయస్సుకే చిన్నది; గాని అతను పోలీసు హెడ్డయితే ఆమె జమాదారు మనసురా, లేం తక్కువా?

పురుషుడికి ఆజ్ఞాపించే అధికారం వుంటే, స్త్రీకి తిరస్కరించే సత్తావుం, దేమి లోటూ?

రుసరుసలాడిపోయిందామె.

అతనిమీది చూపులు పక్కకి తిప్పేసుకుంది.

"బ్రాహ్మణపిల్లాడయిపోడూ? కన్నకొడుకుని పాడు చేసుకుంటావా తల్లీ!" అని బుచ్చివెంకయ్యమ్మ అడుగుతున్నట్టు కనపడిందాచూపులకు.

ఈ తెలివితక్కువ మాటలతో తానెక్కడ మాంసం మానేస్తుందో అని ఆమె ఆదుర్దాపడిపోతున్నట్టున్నూ కనపడిందామెకి.

వెంటనే గోవిందమ్మకి శౌర్యం ముంచుకు వచ్చేసింది.

రక్తం వుడుకెత్తి ఆపాదమస్తకమూ శరీరం వుడుకెత్తిపోయింది.

ఉబ్బెత్తుగా లేచిందామె.

లేచి అతని కంచం దగ్గిరగా వున్న కూరవళ్ళేమూ అన్నంవళ్ళేమూ, పులుసు గిన్నీ పుచ్చుకుని పొయి దగ్గిరికి వెళ్ళిపోయింది.

విజయ గర్వంతో అంధుడయి, భోజనం అయిపోగా, చెయ్యి కడుక్కోడానికి పెరట్లోకి వెళ్ళిపోయా డతను.

## 9

తన వాదసరణి తలుచుకుని తానే దంగై పోయాడు వెంకటస్వామి.

"ఓః! మహా గొప్ప పాయింట్లు పడిపోయాయి కదూ?" అని మురిసిపోయాడు.

"ఇది పనిచేస్తుంది. ఇవాళ కాకపోతే మానె రేపణ్ణుం చయినా మాంసం పిడిచిపెట్టేస్తుంది వెర్రిపిల్ల" అని స్థిరమున్నా చేసుకున్నా డతను.

కాని యీ వూహా తో చాటప్పటి కతనికి హృదయం కలుక్కు మన్న ట్టయింది.

"ఎందుచేత చెప్మా?" అనుకుంటూ అయిమూల మొగం పెట్టుకుని చూడగా, కంచం యెత్తేసి స్థలశుద్ధి చేసేస్తోం దామె.

దీంతో, గంభీర మయి వుండిన అతని మొగం వేలాడి పోయింది.

ఆకంచం అలాగే వుండగా, చెయ్యి కడుక్కుని అత నింటోకి వచ్చాటప్పటికి సిద్ధపరిచి వుంచిన తాంబూలం చేతికిచ్చి, మధ్య మధ్య వొకటిరెండు చిలకలున్నూ నోటి కందించి, అతని కంచం పక్కనే తన కంచం పెట్టు కుని భోజనం చేస్తుం దామె.

ప్రతీ పూటా యిదీ పద్ధతి.

అప్పుడప్పుడిద్దరూ కలిసి కూచుని యేకబంతినే భోజనం చెయ్యడం కద్దు.

"అలాంటి దల్లా పోయి యిప్పు డిదేమిటీ?" అని కళవళపడ్డా డతను.

ఆదరా బాదరా కాళ్లు కడిగేసుకుని, యిలా కళవళ పాటుతోనే మళ్లీ అతనక్కడికి వచ్చాటప్పటికి, వంటింటో వుం దామె.

అన్నంమీాదా, కూరమీాదా, పులుసుమీాదా మూతలు పడేస్తోంది.

భడీభడీ చప్పు డయేటట్టు పడేస్తోంది.

అది చూసి "మంత్రం బెడిసికొట్టిందా?" అనుకున్నా డతను.

"వెర్రిపిల్ల అనుకున్నావు కాదుటోయ్? శాంతంగా

పికెటింగు చేసేవాళ్ళమీద లాఠీఛార్జీ చెయ్యడం అనుకున్నావు పా—వం" అని యెవరో తిరగవేసి కొట్టినట్టు కాగా గుండెలు తుప్పు మనిపోయాయి.

కళ్లు తెరపడ్డట్టయి చూపు మందగించింది.

అత నీ స్థితిలో వుండగా రివ్వున పెరట్లోకి చక్కా పోయిం దామె.

చూడగా, తన కంచం కడుగుతోంది.

"నోటిదగ్గర అన్నం పడగొట్టావు కాదూ?" అంటూ యెవరో పడగెంటినట్టు కాగా తూలిపోతూ వెళ్లి గదిలో మంచానికి చేరబడి పోయా డతను.

"మాంసం అంటే అంత పట్టుదల అయితే యెలాగా!" అనుకున్నా డతను; కాని ఆమాటే తిరిగివచ్చి అతని చెవుల్లో రింగురింగు మంది.

ఉలిక్కిపడి తేరుకని "రానీ" అనుకున్నాడు; గాని, వొకటి-రెండు-మూడు-నిమిషాలు గడిచినా ఆమె రాలేదు.

తొంగి చూడగా, తలకాయ తలుపు ఆన్చుకుని, కాళ్లు చాచుకుని, వుదాసీనంగా పెరట్లోకి చూస్తూ కూచుని వుం దామె.

"అన్నమూ తినక, తాంబూలమూ యివ్వక యేమి యిదీ?" అనుకుంటూ మొగం చిట్లించుకున్నా డతను; కాని, దూ టీమీద వుండినప్పుడు పెంకితనం

చేసిన యెందరో ముద్దాయిలను యీడ్పించేసి, స్వయం గానూ యీడ్చేసివుండిన ఆపోలీసు ఆఫీసర్ని "గుఱ్ఱం దిగు" అని బుకాయించి నిలేసింది బుద్ధి.

వాళ్లంతా చీమలూ జెఱ్ఱెలూ పాకుతున్నట్టయింది.

వెనక్కి వెళ్లి "యేమిటి దారి?" అని యోచించు కుంటూ మంచాన వాలాడు; గాని పడుకోలేక పోయాడు.

లేచి నుంచుని, కళ్లుమూసుకుని, గుమ్మంకేసి మొగం పెట్టి, చెవిలో పడకుండా యితరధ్వను లన్నీ స్తంభింప చేసుకుని, అతికష్టంమీద మాటకూడా తెచ్చుకుని "తాంబూలం" అని కేక వేశాడు, బహు మెల్లిగా.

"పెట్టెమీద వుం" దని జవాబు వచ్చింది, అంత కంటే మెల్లిగా.

చురచురలాడుతూ పెట్టెకేసి చూశాడు.

చేత్తోనూ పుచ్చుకున్నాడు; కాని "దానిచేతులతో యివ్వందే తాంబూల అంటే యేమిటి?" అనుకుని, నోటిదాకా తీసుకునిన్నీ పెట్టెమీద వుంచేశాడు.

ఎవరో కిలకిలా నవ్వినట్టయింది.

"మాంసం కూర లేకుండా భోజనం చెయ్యడం అంటే నీ పెళ్లానికీ యిలాగే వుంటుందేమో మరి?" అని అడిగినట్టూ అయింది.

చకితు డయిపోయాడు.

దీనిమీాద ఆకూర రుచి జ్ఞాపకం వచ్చింది.

అప్పుడే అది తినివుండినా, చూపు దానిమీాదికి పోయి మళ్లీ నోరూరింది.

"ఛా" అనుకుంటూ దృష్టిమార్చుకుందామని పక్కకి చూశాడు.

మళ్లీ తాంబూలం కనపడింది.

కళ్లు చికిలించుకుంటూ యింకోపక్కకి చూశాడు.

గూట్లో చుట్టలకట్ట కనపడింది.

"ముందు నాదీ వంతు" అంటూ ఆ కట్టలోనుంచి వొక చుట్ట పైకి లేచినట్టునిపించింది.

అదికూడా నోరూరించింది.

ఇటు తాంబూలం పూర్తిచేసి, చుట్ట ముట్టించే సమయం అతని కది.

మనస్సు కలిగిపోయింది.

కాళ్ళు గూటికేసి సాగాయి ; గాని "మన చుట్టపాటి దయినా కాదూ దాని భోజనం?" అనుకుంటూ నిలిచి పోయాడు.

"ఎద్దన్నానుటయ్యా?" అని మనస్సు నిష్ఠురాలాడగా "నా కెందుకు బాబూ మీా గొడవలూ?" అంటూ బుద్ధి తటస్థంగా వుండిపోయింది.

దీంతో, ఎటూ నిశ్చయించుకోలేక, కాళ్ళు తేలి

పోగా కుర్చీలో కూలబడ్డాడు.

వెనక్కి చేరబడి, కళ్ళు మూసుకొని, మొగం పైకెత్తుకుని, కాళ్ళు చాపుకుని, చేతులు వేలాడవేసుకుని అభావ దశకిన్నీ వెళ్ళిపోయాడు; గాని అతని శుద్ధసాత్త్విక రక్తమే తాగి పరమపవిత్ర మయి వుండిన నల్లిపోతు పుటుక్కున పొడిచింది.

"అబ్బా" అనుకుంటూ యెగిసిపడ్డాడు; గాని అప్పటి కప్పుడే యింజెక్షనయి అదిచురుకు పుట్టించింది.

వెంటనే గుమ్మంలోకి వెళ్ళి మళ్ళీ తొంగి చూడగా, ఇంకా అలాగే వుందామె.

అసలే వేవిళ్ళు.

దానికి సాయం వుక్రోషం.

పీటిమీద అభోజనం.

అన్నీ వందుకుని, సకలమూ యెదట వుంచుకుని వుండిన్నీ వస్తు.

ఆమె కళ్ళు గుంటలుకట్టినట్టు కనపడి అతని కళ్ళు చెదిరిపోయాయి.

ఆమె కడుపు నకనకలాడుతున్నట్టు కనపడి అతని కడుపు చెరువయిపోయింది.

ఇంతేకాదు, అపరబృహస్పతి కావలసిన చిట్టితండ్రి ఆకలిపట్ట లేక కాళ్ళూ నేళ్ళూ వుండకుండా కేరు కేరు

మంటూా గోలపెట్టేస్తున్నట్టున్నూ తోచింది.

కంగారుపడిపోయాడతను.

ఆ ప్రధానమంత్రి అవస్థచూసి యీ పోలీసు ఆఫీసరు గజగజలాడి పోయాడు.

ఇక నుంచోలేకపోయాడు.

## 10

పసిగట్టినట్టు కాకుండా అతిచడిగా వెళ్ళి ఆమె దగ్గర నుంచున్నాడు వెంకటస్వామి.

చూడ్డం యిష్టంలేనట్టుకాకుండా, అంసాలూ మొగమూ వొక్కమాటు అడ్డంగా పూపుకుని, అతివిలాసంగా కళ్ళు మూసుకుందామె.

ఆమె కళ్ళు మూసుకోగా ప్రపంచం అతని కంధకార బంధురం అయిపోయినట్టు కనబడింది.

అతను దగ్గిర నుంచోగా ముళ్ళకంచె మీద పడ్డట్టని పించిందామెకి.

“ఏమంటే యేమి చేస్తుందో!” అని అతనికి కంగారు.

“ఏమిచేస్తే యేమనాలో!” అని ఆమె కాందోళన.

ఇద్దరూ వొక్క క్షణం వూరుకున్నారు.

కాని, ఆ వొక్కక్షణమే వొక్క గంట లాగ కన పడి, ఆదుగనే దిక్కులేక యేడ్చియేడ్చి చిట్టిగంద్రి సొమ్మ్మ

సిల్లిపోయినట్టున్నూ కనపడి, యిక ఆగలేక "భోజనం అయిందా?" అనడిగా డతను. యేమీ యెరగనట్టు.

ఆమె మాట్లాడలేదు.

"ఇలా చూడు" అన్నా డతను, గద్గదికతో.

ఆమె చూడలేదు.

మొగ మయినా యిటు తిప్పలేదు.

పైపెచ్చు, ధుమధుమలాడుతూ పమిటికొంగు మొగాన కప్పుకుంది.

దాంతో గుండె లాగిపోయిన ట్టయి, కళ్లు తిరిగి, కాళ్ళు వొణికి, ఆమెని పొదువుకుంటున్నట్టు దగ్గిరగా కూచున్నా డతను.

గడపమీదికి వొరిగిం దామె.

బుజంమీద చెయ్యివేశా డతను.

శరీరం ముడిచేసుకుం దామె.

ఆమె మొగంమీది పమిటికొంగు తీసేశా డతను.

అసలేపక్కవాటుగా వున్న మొగం వంచేసుకుందామె.

పొదివిపట్టుకుని "చూడూ" అంటూ వొళ్లోకి తీసుకున్నా డతను.

విడిపించుకోవా లని పెనగులాడిం దామె.

పొనివ్వకూడ దని మరింత గట్టిగా పట్టుకున్నా డతను.

శారీరకంగా చెయ్యగలిగింది లేక, మానసికంగా పతకం

మార్చుకుని "యేమిటిదీ?" అంటా మె వాచికంగా, యెర్రగా చూస్తూ.

"ఏముందీ?" అన్నా డతను, బెల్లించి చూస్తూ.

"పట్టపగలా?......తలుపు లన్నీ తెరుచుకునా? ... హవ్వ! ......" అంటూ నోరు నొక్కుకుం దామె.

"మంచిమాట చెప్పినా తప్పే? పెద్దాపిన్నా తార తమ్యం చూడవద్దూ? వచ్చినంత కోపమూ చూపిం చెయ్యడమేనా?" అని ముక్కుమీద వేలేసుకున్నాడతను.

"కోపాల కేం వుందీ?"

"భోజనం మానుకోడం యెందుకు వచ్చిందీ?"

"మీరు వద్దన్నారు గా?"

"నేనా?" అంటూ తెల్లబోయా డతను.

"అవును, మీరే" అందామె, నిష్ఠురంగా.

గతుక్కుమని పోయా డతను.

మాట్లాడనూ లేకపోయాడు; కాని వుత్తరక్షణం లోనే తేరుకుని "యేమిటిదీ?" అని తనకి తానే ప్రశ్నించు కున్నాడు.

శబ్దశక్తి అప్పటికి బోధపడిం దతనికి.

వ్యక్త్యపేక్షయా చూస్తే హెచ్చు తక్కువ లుండ వచ్చు; గాని, సహజంగా, విధినిషేధాలలో యేదీ లొచ్చు కాదనిన్నీ అప్పటికి అవగాహన అయిం దతనికి.

అతని లాగ జిజ్ఞాస చేసుకుంటున్న కొద్దీ ఆమె తీక్ష్ణంగా చూడసాగింది.

ఆ చూపుల్లో కసి కనపడిం దతనికి.

ఆ చూపులు సూదులై అతని హృదయం గుచ్చేశాయి. కత్తులయి చీల్చేశాయి. అగ్నిజ్వాల లయి మాడ్చేశాయి.

అతని పౌరుషమూ, వుద్యోగదర్పమూ నీరయి పోయాయి.

వెంటనే మేకపిల్ల నెత్తుకున్న ట్టామె నెత్తుకుని, గదిలోకి తీసుకువెళ్ళి దింపి, పాదివిపట్టుకునే వుండి "తప్పే. బుద్ధిలేక గాడిద అయిపోయి వున్నాను. తెలిసిందా! ఇంత శౌర్యం కలదానవు నువ్వు, ఆకూ అలమూ తింటే మాత్రం నీరక్తం యెలా మారుతుందీ? మన కులానికి సహజమైన స్వాధీన శౌర్యం అంతా చూపుల్లో కనబరి చేశావు, నీకడుపున పుట్టేవాడు శూరుడు కాక మరే మవుతాడూ? సెబాస్, మన చిట్టితండ్రి మంత్రే కానక్కరలేదు, ఏవృత్తిలో ప్రవేశిస్తే ఆవృత్తిలో మొనగా డయితే చాలు, లదే పదివేలు. అవసరం అయితే, మన కులంవా ళ్ళెంత సాత్త్వికం చూపించగలరో అంతా చూపించేసింది నీసవతి. సమయం వస్తే మన కులం వాళ్ళెంత రాజసం చూపించగలరో అంతా చూపించేశావు నువ్వూ. ఇలాగ సాటిలేని స్త్రీరత్నద్వయంతో పొదిగాడు

భగవంతుడు నాజీవితం. నేను ధన్యుణ్ణి. నీ మెరుపు చూపులతో నా అజ్ఞానాంధకారం తొలగిపోయి నాకిప్పుడు సత్యం గోచరిస్తోంది. బ్రాహ్మణులకు బుద్ధిబలం యెక్కువే కాని పిరికితనమూ నిర్లిప్తతా దాన్ని నిరుపయోగం చేసేస్తున్నాయి. మన స్మృతికర్తలు విద్యావ్యాసంగం నిషేధించి మన బ్రాహ్మణేతరుల్లో వైజ్ఞానిక సంప్రదాయం లేకుండాచేశారు; గాని లేకపోతే, శౌర్యంకంటే బుద్ధిబలమూ, బుద్ధిబలంకంటే శౌర్యమూ యెక్కువయి, దొరల్లాగ, మనమున్నూ శేముషీధురంధరులమూ, పరభయంకరులమూ కూడా అయి వుండుము. ఇన్ని యుగాలకయినా, మనకిగల విద్యానిషేధం తొలగిపోయింది కనక నీయిష్టం, నువ్వికమాంసం విడిచిపెట్టనక్కరలేదు, నేనూ మానను. కనిపెట్టలేకపోయాను; గాని యెంత చేసినా నేను జిహ్వా చంపుకోడం వొక్కటే కనపడుతోంది. ప్రతీదినమూ నువ్వికమాంసమే వండు. డబ్బెంత అయినా సందేహించకు. మన కుండిన సర్వమూ వెచ్చించి అయినా చిట్టితండ్రికి పెద్ద చదువులు చెప్పించుకుందాం, దాంతో వుభయుల కోరికలూ నెరవేరతాయి" అంటూ ప్రేమతో ఆమె ముంగుర్లు సవరించాడు.

కాని, క్షణంలో కలిగిన యీమార్పు ఆమె గుర్తించలేకపోయింది.

నమ్మనూ లేకపోయింది.

అది గ్రహించి "యేమీ, అలా చూస్తావేం? నేను నిజమే చెబుతున్నాను. లోకంలో మాంసాహారులే యెక్కువ. నే ననుకున్నట్టు వాళ్ళంతా మట్టిశలకాయలు కారు. బుద్ధిబలం యెక్కువయినందుకు, చచ్చు వేదాంతం చెప్పడం తప్ప బ్రాహ్మలునూ పొడిచేస్తున్నది యేమీ లేదు. కనక మనం మాంసం మానుకోనక్కర్లేదు. ఇదీ నే నన్నది" అన్నా డతను, లాలనగా.

అప్పటికీ యిది గ్రహించలేకపోయిం దామె.

ఆమె చూపుల్లో మౌగ్ధ్యం లాస్యంచేసింది.

అప్పు డతను "వెర్రిపిల్లా, ఇంకా నమ్మవూ?" అంటూ యెడమచేత పొదివిపట్టుకుని, కుడిచేత ఆమె గడ్డం నిమిరాడు.

నిలువునా కరిగిపోయిం దామె.

ఆమె శరీరములో, ప్రతీఅణుమాత్ర భాగానా మండుతూ వుండిన కోపం పోయి, ఆ స్థానంలో ప్రేమ కెరటాలు వేసింది.

ప్రేమ చిలుకుతూ వున్న అతని చూపులూ, అమృతం చిందుతూ వున్న అతని చిరునవ్వూ చూసి పరవశఅయి, అతని వక్షస్థలంమీద వాలి పోయిం దామె.

అది అతని ప్రేమ సముద్రిక్తపరిచింది.

వెంటనే గడ్డం పట్టుకుని మొగం పైకెత్తి, ముందు, ఆమె సీమంతం ముద్దుపెట్టుకున్నా డతను.

తరవాత, నరానగా, నుదురు ముద్దుపెట్టుకున్నాడు. రెండు కళ్ళూ ముద్దుపెట్టుకున్నాడు. రెండు చెక్కిళ్ళూ ముద్దుపెట్టుకున్నాడు. తనివితీరక చివరికి, ఆమె కెంజెదవులు గా — ట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

దీంతో, ఆమె కూడా ఉద్రిక్త అయిపోయింది.

వెంటనే అతని కుడిపాదంమీద తన ఎడమపాదం వుంచి నుంచుని, కుడికాలితో అతని యెడమకాలు చుట్ట వేసి, తన ఎడమచేత అతని నడుము చుట్టబెట్టుకుని, కుడిచేత్తో అతని యెడమభుజం ఆక్రమించి వంచి, అతనున్నూ నిర్భరానందంతో తనను పొదివిపట్టుకోగా, ఊర్ధ్వశ్వాసతో పృష్ఠాధిరూఢకంగా యెగిసి, ముందతని పెదిమలు ముద్దుపెట్టుకుని, మైమరుపు రాగా కళ్లు మూసుకుని, తెరపిమరపుల్లో కసిక్కున అతని అధరం కొరికింది.

కీచుమన్నా డతను; కాని ఆ మధురవేదనలో పారవశ్యమే చూరగొన్నా డతను.

అమాంతంగా ఆమె నెత్తుకుని, మొగంమీద మొగంపెట్టి, చూపుల్లో చూపులు కలిపి "కాస్తమాట అనేటప్పటికి ఆడతాచులాగ చర్రున యెగిసి కాటేశావు, మరి తీరిందా నీకోపం?" అని వీపు నిమురుతూ

బుజ్జగించాడు.

ఆమె సిగ్గుపడిపోయింది.

జందెప్పెట్టుగా అతన్ని కౌగిలించుకుని, తన మొగం అతని మెడలో దాచేసుకునిన్నీ కలికింది.

ఇదంతా అప్పుడామెకళ్ళయెదట జరిగినట్టనిపించింది.

"అప్పుడలాగ, అంత కోప్పడ్డ నువ్వే అలా చేశావే, మరి యిప్పుడిలాగ, ఇంత కోప్పడుతున్న రాధ మాత్రం క్షణానికో క్షణానికో నువ్వు చేసిన పని చెయ్యకుండా వుండగలదా?" అని యెవరో ముదలకించినట్టూ అయింది.

వెంటనే, తిమ్మన్న మీదికోపం, ఆమెకి, విలాసంగా మారిచక్కాపోయింది.

# 11

ఎడమచేత్తో పటం పట్టుకుని లోపలికి వచ్చి, కుడి చేత్తో తలుపు గడియవేసి, పటం రెండుచేతులా పైకెత్తి పట్టుకుని చూస్తూ పెరట్లోకి బయలుదేరింది గోవిందమ్మ.

అక్కడయితే యెవ రయినా చూస్తారనే భయం వుండదు కనక సావధానంగా చూసుకోవచ్చు ననీ, వెలుగు బాగా వుంటుంది కనక హావభావాలు స్ఫుటంగా కనపడతా యనీ అనుకుం దామె.

కాని, పసారాగుమ్మంం దగ్గిర వంగి నడవడంలో విసి

రేసిన ట్టయి తూలి పక్కకి పడిపోయింది.

పటం బద్దలాసిపోకుండా జాగ్రత్తపడగలిగిందే గాని, కుడికాలి చిటికినవేలికి తిరగటిరాయి తగిలి నరాలు జివ్వు మని ప్రాణం జిల్లార్చుకుపోయింది.

ఒక్క రక్తమే, రాలేదు గాని మహా చెడ్డదెబ్బే తగిలింది.

పైగా, క్షణం తప్పింది గాని, ఆపడ్డం పడ్డం వొక్క అడుగు కుడివైపున పడివుంటే, కత్తిపీట తగిలి కుడిజెబ్బ యెగిరిపోయివుండును.

ఆవిసురువిసురు కుడికణత పెచ్చెగిరిపోయున్నీవుండును.

అయినా, వొక్కలఘువుతో లేచి కూచుని, ఇస్సు మంటూ వేలొక్కమాటు నొక్కి పట్టుకుని, నిదానించి చూసి రక్తం రానందుకు నయమే అనుకుని, మెల్లిగా లేచి యెడమపాదంతో ఆవేలు నొక్కుకుని, తరవాత కుంటుతూనే నాలుగడుగులు వేసి, అప్పటికి కాలు బాగా సాగినా వొక్కమాటాగి మళ్ళీ వేలు చూసుకుని, చివరికి బయలు దేరినప్పటి వుబలాటంతోనే గబగబా వెళ్ళి కోళ్ళగూటికి పటం చేరబెట్టి కూచుందామె.

మనస్సు ఆకట్టిన పని కనకా, దృష్టి తదేకనిష్ఠమై వుంది కనకా తోచింది కాదు గాని, అదే యింటిపని యేదయినా అయివుంటే యీదెబ్బ తగలడం అపశకు

నంగా భావించుకుని యెంతయినా యిదయిపోయివుందు నామె.

కాని, అలాంటిది లేకపోగా, కూచునీ కూచోడం తోనే మురిసిపోతూ మళ్ళీ పటం చూడసాగిం దామె.

ఇవతల యింత పని జరిగినా, అవతల, అప్పటికీ రాధ పమిటికొంగు లాగుతూనే వున్నాడు కృష్ణుడు.

రాధ కోప్పడుతూనే వుంది.

మళ్ళీ ఆదృశ్యం కళ్ళబడాటప్పటికి "కృష్ణు డెంత రసి కుడూ!" అనుకుంది గోవిందమ్మ.

"రాధ యెంతజాణ!" అనిన్నీ అనుకుం దామె.

దీనిమీద "ఇలా జరిగితేనా రాజా" అనిపించిం దామెకి.

ఈతలంపు కలిగాటప్పటికి ముందు తిమ్మన్నా, తర వాత గొల్లభామా జ్ఞాపకంవచ్చారు.

ఒక ఫిలిము చూస్తూ వుంటే మరో ఫిలిము తాలూకు ప్రకటనభాగాలు మధ్యకాలంలో కనబడే ట్టు, ఈపటం చూస్తూవుంటే వారి అనంతవిలాసా లున్నూ జ్ఞాపకం వచ్చాయి.

ఎదు రెదురుగా కూచుని గొల్లభామా తిమ్మన్నా తాంబూలం సేవిస్తున్నట్టూ, గొల్లభామ, తన పెది మలతో వాక చిలక అతని నోటి కందించగా అతనున్నా

పెదిమలతో అవి అందుకున్నట్టే అందుకుని ఆమెఅధరం కొరికినట్టూ, అందుకు కోపం నటిస్తూ గొల్లభామ లేచి పోబోతున్నట్టూ, వెంటనే తిరస్కున్న ఆమె కాళ్ళు పట్టు కుంటున్నట్టూ —

తన అంతరదృష్టి కిలా కనపడాటప్పటికి గోవిందమ్మ హృదయం ముగ్ధం కాబోయిన్నీ తటాలున క్షుభితం అయిపోయింది.

"హాయ్" అంటూ యెత్తుకున్నట్టే యెత్తుకుని, ఆమె నాలుక, చివరికి "ఛీ" అనేసింది.

ప్రతీరక్తనాళంలోనూ, ప్రతీరక్తాణువులోనూ, ఈసు నిండిపోయి ఆమెని జలజలలాడించేసింది.

దాంతో "నాఅల్లుడిచేత కాళ్ళు పట్టించుకోడాని కెన్నివేల గుండెలున్నాయీ దీనికి!" అంటూ నిప్పులు కక్కేసింది గోవిందమ్మ.

## 12

ఆ వుడుకు చల్లబడి మళ్ళీ పటంకేసి తిరిగాటప్పటికి "కోడలా" అని యెవరో పిలిచినట్టు కాగా వులిక్కిపడి పోయింది గోవిందమ్మ.

గోడలమీాదుగా చూస్తూ యిరుగుపొరుగులవా రెవ రయినా పిలుస్తున్నా రేమో అని వాణికిపోతూ పటం

విడిచి వెనక్కి జరిగి, నాలుగు దిక్కులా పరకాయించిందామె; కాని యెవరూ కనపడలేదు.

ఇంతలో తాపీగా ప్రారంభించి గబగబా తలుపు గుంజినట్టయింది.

తన యింటి తలుపో పక్కయింటి తలుపో గుర్తుపడదామని చెవు లొరచేసుకుంది; గాని మళ్ళీ తలుపు చప్పుడు కాలేదు.

ఒక్క క్షణానికి "గోవిందమ్మా" అని మళ్ళీ పిలుపు వచ్చింది.

"ఆ" అనబోయినప్పటికీ కంఠం రుద్ధమయి మాట రాక పోగా, యెదటికంఠం గుర్తుపట్టుకుందామని చెవి అటు వొగ్గింది.

"వినపళ్లేదుటే పిల్లా?" అని మూడోమాటు కేక వచ్చాటప్పటికి వచ్చిన మనిషి నారమ్మత్త అని గుర్తించేసిం దామె.

"పిల్లా" అనడంలో ప్రేమ స్ఫురించగా ముఖం యింత చేసుకుని, ఉబ్బెత్తుగా లేచి రెం డడుగులు వేసి, అంతలో పటం జ్ఞాపకం రాగా చకిత అయి నాలుక కరుచుకుంటూ ఆగిపోయి, గుమ్మంకేసి చూస్తూ "వస్తున్నా వస్తున్నా" అంటూ కంగారుగా బదులు చెప్పి, క్షణంలో పటం దాచేసి వెళ్ళి తలుపు తీసింది.

"దయ వుండమ్మా నా కోడలికి. ఏమి పనిమీద వున్నావో, పలుకుతావో పలకవో అనుకున్నా" నంటూనే లోపల అడుగుపెట్టింది, నారమ్మ.

మళ్ళీ వులిక్కిపడింది గోవిందమ్మ.

"పటం సంగతి తెలిసే వచ్చిం దేమో" అని మొదట అనుమానపడిం దామె.

ముసలదాని కళ్ళల్లో బెల్లింపుచూపు లున్న ట్టనుకుని తరవాత కొంచెం తెల్లబోయింది.

కాని, అందుకు తగ్గ యితరలక్షణా లేమీలేక పోగా చివరికి స్తిమితపడింది, వూపిరి తీసుకుని.

ఈక్రమాంతరాలన్నీ గడిచాటప్పటికి చిరునవ్వురాగా "పలకడానికీ దయవుండాలా అత్తా" అన్నమాటలో అది గుచ్చెత్తి "యెంత దయ వుండబట్టి యెండలో నువ్వు వచ్చావో?" అని యెదు రడుగుతూ నారమ్మని కౌగలించుకుం దామె.

మొగం నిమురుతూ "పనిలోవున్నావా?" అనడిగింది నారమ్మ.

"లేదత్తా! ఒక్కదాన్నేగా, నాకేమంత పనుంటుందీ?" అని యెదురడిగింది గోవిందమ్మ.

ఇద్దరూ వెళ్ళి కవాచీబల్లమీద కూచున్నారు.

"రాకరాక వచ్చా వత్తా! ఎందుకు వచ్చావో చెప్ప

వమ్మా" అంటూ నారమ్మ రెండు చేతులూ పట్టుకుంది గోవిందమ్మ.

"అబ్బే వనేమి వుందీ?" అంటూ మొదట అలాగా యిలాగా చూసి తరవాత "నిన్న మాచెల్లెలి కొడుకు వచ్చాడు. ఇప్పుడే సాగనంపి యిక్కడికి వచ్చాటప్పటికి నువ్వు జ్ఞాపకంవచ్చావు. చూసిపోదా మని వచ్చా నంతే, వనేమీ లేదమ్మానాకు" అంటూ వొకమాటు వీధి కేసి చూసింది నారమ్మ.

గోవిందమ్మకి తృప్తికాలేదు; కాని "దయ వుంది కనక" అని మాత్రం ఆమె కళ్ళల్లోకి చూసింది.

"కొడు కేమయినా పంపుతున్నాడా?"

"మొన్ననే వచ్చిం దమ్మా మనియార్డరు"

"ఉత్తరాలు వస్తున్నాయా?"

"ఆ"

"కులాసాగా వున్నాడు కదా?"

"నిక్షేపంలాగున్నా డంట. ఇప్పటిదాకా జిర్రున చీదలే దంట"

"బాగుందమ్మా, బాగుంది"

ఇలా అని మళ్ళీ వొకమాటు వీధికేసి చూసి "వ మయితేం? మొత్తానికి నీకొడుకూ తొందరపడ్డాడు, నువ్వూ వరకాయించలేక పోయావు. ఇద్దరికీ చిన్నతనమే

అయిపోయింది. చెప్పవద్దూ? నాకిష్టంలేదు సుమా భూషయ్య యుద్ధానికి వెళ్ళడం" అంది నారమ్మ.

"గణపతిరాయుడు బాబుగారి కొండ్రలావు వెడుతున్నాడంటే "నువ్వు కూడా వెళ్ళవా నాయనా" అన్న మాట నానోట వచ్చేసింది. పొంగి పోయాడు నాయన, పెళ్ళికి వెడుతున్నట్టురికాడు."

ఇలా అన్నప్పుడు గోవిందమ్మ కంఠాన శౌర్యం శ్రుతి కలిపింది.

"అబ్బురమా? పౌరుషం గల కులం కాదూ మనదీ? అయినా, చిన్నతనం. పైగా, సప్తసముద్రాలూ దాటి దేశం కాని దేశం వెళ్ళడం. భయం లేకుండా –" మాట నాన్చేసింది నారమ్మ.

"భయమా!" అంటూ యెగిసిపడింది గోవిందమ్మ.

"హా" మ్మంటూ తొడకొట్టి పరవళ్లు తొక్కుకుంటూ ప్రతివీరు డెదటికి వస్తే, జబ్బచరిచి యెదురుకుంటూ యివతలి వీరుడు రంకెవేసిన ట్టుందా మాట.

"ఒంటిచేత్తో నలుగురు దొంగలను కూలగొట్టి, ఐదో వాడి దొంగపోటుకి నేల కొరిగిన పోలీసు హెడ్డు బిడ్డ, యుద్ధం అంటే భయపడతాడా అత్తా నాకొడుకూ?"

నిలవతీసి అడుగుతున్నట్టు కళ్లు తిప్పుకుంటూ, తాచుపాము పడగ ఆడించినట్టు తల తాటించుకుంటూ, మెరుపు

కొట్టినట్టు వ్యాగీసలాడుతూ ఇలా సాగతీసుకుందిగోవిందమ్మ.

"అవు నమ్మా, అవు" నంది నారమ్మ.

అని, గోవిందమ్మ కేసి చూస్తూనే యేదో జ్ఞాపకం చేసుకుంటున్నట్టూ, యేదో వెతుక్కుంటున్నట్టూ, మధ్య మధ్య అలాగా యిలాగా చూసింది.

నారమ్మ చెప్పేదంతా మాటవరస కయినట్టూ, ఆమె మనస్సులో మరేదో మసలుతున్నట్టూ అనుమానించి "అదేమయి వుంటుందీ?" అని ఆలోచన ప్రారంభించింది గోవిందమ్మ.

నారమ్మ అది గ్రహించింది.

గ్రహించి "అవు నమ్మా, అవును. నాతమ్ముని కొడుకూడా భూషయ్యలాగ మహా వుబలాటపడ్డా డంట; కాని వొడ్డూ పొడుగూ, చాలదు పొ" మ్మన్నా రంట అధికార్లు. దాంతో దిగాలుపడిపోయి నెలరోజులు అన్నం ముట్టలే దంట వాడు. యుద్ధానికి వెళ్ళడం మాత్రం అందరికీ దొరుకుతుందా? అదృష్టం వుండవద్దూ?" అనడిగింది గోవిందమ్మ కేసి చూస్తూ.

"అవును గదా? అంత శౌర్యం కలవాళ్ళని ఆపు చెయ్యడం మంచిదా? కండ వుంటే మాత్రం, అది పిరికి కండ అయితే?"

"నిజమే; కాని –"

"చేబాడిత పుచ్చుకుని నలుగురు దొంగల మీద పడ్డాడు శంభులింగం, వూదితే యెగిరిపోతాడు, మళ్లీ. పురాణంలో కూచుంటే చారల పర్వతం లాగ కనపడతా రయ్యావార్లంగారు, కాని, పాలికాపు తిరగపడతే పని మనిషి అడ్డుకోవలసివచ్చింది."

"అదీ నిజమే; కాని —"

"మని షయి పుట్టాక పేరుండిపోవాలి; గాని చావు కిన్ని దావు లున్నాయూ అత్తా?"

"ఉన్నాయూ మరీ? కాని —"

"నన్నూ నా కొడికునీ కూడా "తొందరపడకం" డని నాలుగుమాట్లు మందలించాడు చెంచయ్యన్నయ్య. ఆ తండ్రి కూతురే కానయితే, చూడమ్మ —"

"ఏమి చేసిందీ?"

"తలుపు చాటున నుంచుని, తండ్రి వద్దన్నప్పు డల్లా "మానవద్దు. తప్పకుండా వెళ్లు" అన్నట్టు చేసన్న చేస్తూ వచ్చిందమ్మా"

"ఆ సమయాన అక్కడ వుంటే నేనూ అంతే చేస్తు నేమో గాని—"

"పోలీసువేషం వేసుకుని నా పెనిమిటి డ్యూటీమీద వెడుతూ వుంటే, కనపడ్డంత సేపూ బొమ్మ నయి చూస్తూ వుండేదాన్ని నేను. మళ్లీ యిన్నాళ్లకి నా కొడుకు మిలిటరీ

వేషం వేసుకుంటే—"

"పొంగిపోయావు నువ్వు."

"అవును, నాకేం పొంగిపోకా? నా కండలో కండే గా నా కొడుకు? శరీరంలో వొక చోటి కండ కో గుణమూ, మరోచోటి కండ కో గుణమూ వుంటుందా? నేనురికిం చాను, నా కొడుకురికాడు. యోధకులంలో పుట్టి— "

"కాకేం?" అంది నారమ్మ, కులంమాట చెవినిపడే టప్పటి కుద్రిక్తురాలై; కాని వెంటనే మళ్లీ ఆలోచనలో పడిoది.

"అన్నావు గదా?" అంటూ అంతకి ముందే అందు కుంది గోవిందమ్మ.

"ప్రయాణం అయినప్పుడు వీపుతట్టి శౌర్యం గొచ్చ కొడుతూ నాపెనిమిటీ, శిరను ముద్దాడి ధైర్యంచెబుతూ మా నాయనా, నాకొడుకుని దీవించినట్టు కనపడింది నాకు. ఆ పాళంగా – వూరి బయటిదాకా మాత్రమే సాగనంపి వచ్చేద్దా మనుకున్నదాన్ని, కూడా రాజమహేంద్రవరం వెళ్లి రెయిలెక్కించిగాని వెనక్కి మళ్లలేకపోయా నత్తా"

నారమ్మ జబ్బలు పట్టుకుని వూపుతూ, మంచిపని చేసి నందువల్ల కలిగే ఆత్మసంతృప్తి కళ్లల్లో కనపడుస్తూ, వుత్సాహోల్బణంతో అంతకంతకు స్వరం హెచ్చించు కుంటూ యిలా అంది గోవిందమ్మ.

"మంచిపనే చేశా" వంది నారమ్మ.

అంటూనే మళ్లీ అలాగా యిలాగా చూసింది.

బిందె బుజాన వేంగాడవేసుకొని వయ్యారంగా చెరువుకి వెడుతోంది దొక యువతి.

ఆమెనుచూసి, దారి దొరికిం దన్నట్టు సోత్సాహ అయి, గోవిందమ్మ కేసి చూస్తూ వొక్క-మాటు కన్నుగీటి "విన్నావా?" అనడిగింది నారమ్మ, మెల్లిగా.

చకిత అయి "యేమిటత్తా?" అనడుగుతూనే అలా చూసింది గోవిందమ్మ; కాని అప్పటి కప్పుడే ఆయువతి దృష్టిపథం దాటిపోగా, లేచివెళ్లి ద్వారబంధం కమ్ములు పట్టుకుని ముందుకు వాలి చూసి "తిరపతమ్మ కాదూ?" అనడుగుతూ మళ్లీ వచ్చి కూచుం దామె.

"అవు" నంది నారమ్మ, ఎంతో గొడవ వున్నట్టు చూస్తూ.

"అయితే యేమి టత్తా?" అనడిగింది గోవిందమ్మ ఆత్రంగా.

చిరునవ్వు నవ్వుతూ, తల పంకించుకుంటూ, గంభీరంగా చూసి వూరుకుంది నారమ్మ.

అది వుద్వేగం కలిగించగా, మొగంమీాద మొగం పెట్టి "చెప్పవూ?" అని గునుస్తూ మరింత దగ్గిరసా జరిగింది గోవిందమ్మ.

అలాగే మరొకమాటు చూసి మళ్లీ ఊరుకుందినారమ్మ.

సంగతి చెప్పకుండా నారమ్మ దాటేద్దామని చూస్తున్న ట్టనుమానించి "అంతా చెప్పాలి. చెబితే గాని వొప్పు కోను. చెప్పకపోతే నన్ను చంపుకుని తిన్నట్టే" అంటూ బుజాలు పట్టుకుని ఆమెను గుంజేసింది గోవిందమ్మ.

దానిమీద తప్పనిసరి అయినట్టు అందుకుని "ఒకమ్మ గొడవలు మన కెందుగ్గానీ, — నీకు మాత్రం చెపుతా గానీ, — బాబోయ్, వీధికెదురుగా — యిక్కడ కూచునే చెప్పడం!" అని బుగ్గలు నొక్కుకుంటూ భయం నటించింది నారమ్మ.

దేవత ప్రత్యక్షమయి వరం కోరుకొమ్మన్నట్టు కాగా, వెంటనే లేచివెళ్లి, వీధితలుపు వేసేసి "పెరట్లోకి పోదాం రావమ్మా" అంటూ రెక్కపట్టుకుని నారమ్మని లేవ తీసింది గోవిందమ్మ.

# 13

"చిన్నపిల్లల నోట నువ్వుగింజ నానదు. కష్టసుఖాలు మీకేం తెలుసునూ? పాలకంటే యెక్కువగా పొంగి పోతూ వుంటుంది మీరక్తం. ఉబలాటమే గాని నిదానం వుండదు మీకు. ఒక్కొక్కమాట కొంపలు కూల్చేస్తుంది. ఊరికి వూరంతా చిచ్చుపెట్టే మాటలు కూడా దాచుకో

లేరు నీవయసుపిల్లలు –”

“నాసంగతి యెరిగివుండీన్నీ యిలా అంటావా అత్తా? ఏరహస్యం అయినా నేను బయటపెట్టడం –”

గోవిందమ్మ మాట పూర్తి కాకుండానే అందుకుని “యెరగనమ్మా, యెరగను. అందుచేతనే కాదూ తిరవ తిమ్మ మాట నీదగ్గిర తెచ్చానూ? గంటమ్మ, నాంచారమ్మ, ఆండాళమ్మ, తిరుమలమ్మ, గోపమ్మ, రామసుబ్బమ్మ, చెల్లమ్మ, తాయారమ్మ – ఇలాగ నీ వయసు వాళ్ళే యెంతో మంది నన్నెప్పుడూ పట్టుకుని పాకులాడుతూ వుంటారు గదా, వాళ్ళ దగ్గిర తెచ్చానా మరి? వద్దమ్మా వద్దు” అంటూ మూతి బిడాయించుకుంది నారమ్మ.

ఈమాటలో అటూ యిటూ కూడా అర్థం స్ఫురించగా కొంచెం జడిసి, అయినా ధైర్యం వహించి, నడుస్తూ నడుస్తూ వున్న నారమ్మని గభీ మని ఆపుచేసి “నాకు మాత్రం చెప్పాలి. లేకపోతే – ఏమనుకున్నావో మరి” అంటూ బుంగమూతిపెట్టుకుని తర్జని వూపింది గోవిందమ్మ.

నారమ్మ మందహాసం చేసింది.

ఇద్దరూ రాచవుసిరిచెట్టు కిందికి చేరుకున్నారు.

గబగబా వెళ్ళి కవాచీమంచం తెచ్చి వాల్చింది గోవిందమ్మ.

ముందు నారమ్మ ఠీవిగా కూచోగా, ఆమెవొళ్ళో కూచున్నంత యిరుగ్గా కూచుని "మరి చెప్పు" అనిన్నీ తొందరపెట్టిం దామె.

నారమ్మ చెయ్యి చాపింది "ఎక్కడా చెప్పవుగదా" అన్నట్టు చూస్తూ.

మాట్లాడకుండా ఆ చేతిలో చెయ్యి వేసి గిల్లింది గోవిందమ్మ.

"నీకు చెప్పడం అంటే కర్రపెట్టెలోవున్న సరుకు ఇనప్పెట్టెలో పెట్టినట్టే, నాకు తెలుసు. అయినా, మనసులోనే —"

అర్థోక్తిలోనే ముక్కుమీద వేలేసుకుంది గోవిందమ్మ.

"మనలో మనం చెప్పుకోవచ్చు గాని, దాని బతుకెందుకు పాడుచెయ్యాలీ!"

"అయ్యో, కాదుటమ్మా తల్లీ?"

"ఒక్కపిల్లని కన్నదే అనుకో. పిల్ల కూడా పదిహేనేళ్ళదే అనుకో. అయినా చిన్నదేకాదూ పాపం? రమారమీ ముప్ఫయ్యేళ్ళు — ఇంతేనా!"

"అవునవును"

"ఇంతకీ, వయస్సు. వయ స్సూరుకోనిస్తుందా మరి? అనుభవిస్తూ అనుభవిస్తూ వుండగా బోర్లతోశాడు భగవంతుడు. తట్టుకోలేకపోయింది."

గోవిందమ్మ కాత్రం మెక్కు వయిపోయింది. మాట మాత్రం తిరగలేదు. చూపులు సుడితిరిగిపోయాయి.

అది గ్రహించి నారమ్మ, గోవిందమ్మ మొగంమీద మొగంపెట్టి, కంఠంకూడా నొక్కుకుని "మా అంజమ్మప్ప కొడుకు నెరగవ్వా?" అనడిగింది.

"ఎరక్కేం? తిమ్మన్న కాడూ?"

"వాడికోసం అటమటించిపోతోంది తిరపతమ్మ"

నిర్విణ్ణ అయిపోయింది గోవిందమ్మ.

"తిమ్మన్న కోసమా?" అనిమాత్రం అంది పాము లాగ పడగయెత్తి.

నెమిలికూతను మించిపోయిం దా పలుకుబడి.

వైపరీత్యం తటస్థించినప్పుడు కలిగే విభ్రమాశ్చర్యాలూ, ప్రియమైన వస్తువు చెయ్యి జారిపోతున్నప్పుడు కలిగే ఆర్తీ, ఈపరిస్థితుల్లో ఏమీ చెయ్యడానికి వీలు లేకపోవడంవల్ల కలిగే ఆందోళనా – ఇవన్నీ స్ఫురించా యా కేకలో.

ఇది చూసి, స్తిమితపడి తల వంకించుకుంది నారమ్మ. అప్పటికి మాట తిరిగింది గోవిందమ్మకి.

"ఏమిటే? ఏమిటమ్మా అత్తా? చెప్పవ్వా!" అనడుగుతూ చంటిపిల్ల లాగ నారమ్మని కుదిపేసింది గోవిందమ్మ.

దీనికి జవాబురాకుండానే "తిమ్మన్న వొప్పుకున్నాడా?"

అనిన్నీ అడిగేసింది, ఆత్రంగా.

ఇది విని మరీ స్తిమితపడింది నారమ్మ.

గోవిందమ్మ హృదయపేటికలో పదిల పరిచి వుంచుకున్న వస్తువును నేర్పుగా లాగేసినట్టు మెరిసిపోయాయి, ఆ మెచూపులు.

ఇదేమీ గుర్తించుకోలేక, అస లనుమానించనే అనుమానించక "చెప్పవూ? చూశావా? ఏమమ్మా అత్తా, చెప్పవు కాదూ?" అంటూ మళ్ళీ తొందలువిడిపించేసింది గోవిందమ్మ.

దానిమీద "యెలా వొప్పుకుంటాడే వాడూ?" అని యెదురడిగింది నారమ్మ.

వివరాలమాట యేమయినా, కావలసిన సంగతి తెలిసిపోయినందుకు స్తిమితపడి "అమ్మయ్యా" అనుకుంటూ వూపిరితీసుకుని తేలికపడింది గోవిందమ్మ.

ఇది కూడా గమనించి "కావలసిందే పెంకిలంజెకి" అని తలతాటించుకుంటూ దురుసుగా పలికి, మళ్ళీఅందుకుంది నారమ్మ.

"మా తిమ్మన్న పరాయి ఆడదాన్ని ఆశించడం తప్పే. అనుకో. చాలామాట్లు నేనూ కూకలేశా ననుకో – "

ఇలా అని వొక్కమూ టాగింది నారమ్మ.

గోవిందమ్మ వులుకూ వులుకూ చూసింది.

"కూకలెయ్యడం యెందుకూ?" అని నారమ్మనే కూక లేస్తున్న ట్టున్నా యీ చూపులు.

"అయినా, వాడిదగ్గిర వొక సుగుణం వుం దే కోడలా!......విన్నా వా?"

"వింటున్నా"

"మంచయినా చెడ్డయినా చాటున చెప్పకోవాలి. ఏమంటావ్ ?"

"అవు" నంది గోవిందమ్మ, తొందరగా చెప్ప మన్నట్టుచూస్తూ.

"ఆసుగుణం యేమి టంటావా? ఎవ ర్తిమీా దయినా తన కళ్లు పడితే — కళ్లు లేకపోతే కలియుగమే లేదు కాదంటే? కంటికోసమే అందచందాలు కల్పించాడు భగవంతుడు"

ఇలా అని నారమ్మ "అవునా కాదా?" అన్నట్టు చూడగా "కళ్లకోసం అందచందాలూ, జిహ్వకోసం రుచులూ, చెవులకోసం ప్రియ మైన మాటలూ, ముక్కు కోసం పరిమళమూాను, కాకేం?" అని ముదలకించింది గోవిందమ్మ.

"అలాగే, ఆడదానికోసం మొగాడు. మరి మొగాడి కోసమో?"

జంకూ కొంకూ లేకుండా "ఆడది" అనేసింది. గోవిందమ్మ.

"అదిగదీ మాట. అలా కాక, వొక్క ముక్తి కోసమే యీపుట్టుకా, యీబతుకూ అయితే —"

"కోరికలు తీర్చుకోలేక లోపల్లోపల కుమిలి కుమిలి చచ్చేవాళ్లకి ముక్తేమిటమ్మా ముక్తి?"

"నా—తల్లి, నాతల్లి" అంటూ గోవిందమ్మ కణతల మీద మెటికలు విరిచి "అంతా తెలుసునమ్మా నీకు, అంతా తెలుసు. కనక అందమైన ఆడదాన్ని చూస్తే మొగాడి కళ్లేనా యేమిటి మిసమిసలాడడం? సొగసైన మొగాణ్ణి చూస్తే ఆడదాని కళ్లు మాత్రం కలకల్లాడవూ?" అనడిగింది నారమ్మ.

సైకి సిగ్గుపడి, లోపలమాత్రం కులుకుతూ "కలకల్లాడకేం?" అని బదులడిగింది గోవిందమ్మ.

"అవునుగదా? ఇక అనుగుణం యేమిటంటావా?"

"అవునమ్మా"

"నే నెంతోమంది మొగకుర్రవాళ్ల యింగితం కని పెడుతూవచ్చాను; గాని అందరూ కూడా — సీత్ —"

ఏవగింపు నటించింది నారమ్మ.

"ఏంచేస్తారూ?"

"వాళ్లని తలుచుకుంటేనే రోత నన్నడక్కే"

ఇలా రుంజుకుని మొగం వక్కకి తిప్పుకుని, వొక్క క్షణాని కిటు చూస్తూ "ఎవర్తిమీా దయినా తన కళ్లు

పడితే ఆపళంగా తొందరపడడు, అవతలి మనిషి కళ్ళు రుసరుసలాడాయా మిసమిసలాడాయా అని పరకాయించు కుంటాడు నావెర్రితండ్రి" అంది నారమ్మ.

తన నంగతి జ్ఞాపకం చేసుకుంటూ "అలాగా?" అని అడిగింది గోవిందమ్మ, యేమీ యెరగనట్టు.

"రుసరుసలాడాయా, మరి దానికేసి చూడడు. చూడడు గాక చూడడు" అని చేతులు విసురుకుంటూ, మూతి బిడాయించుకుంది నారమ్మ.

మనస్సులో "అవు, నెరుగుదును" అనుకుని, పైకి "ఊహూ" అంది గోవిందమ్మ, కళ్లు తిప్పుకుంటూ.

"మిసమిసలాడినా తొందరపడడమ్మా వాడు. అవతలి మనిషి మరో అడుగు ముందుకి వెయ్యాలి. అప్పుడూ—"

ఇలా అని తిమ్మన్న మీద మాతృవాత్సల్యం గుమ్మరించేసింది నారమ్మ.

"మరి తిరపతమ్మ అటమటించి పోతోం దన్నావు గదా?" అనడిగింది గోవిందమ్మ, జంకుతూ జంకుతూ.

"నిజమే. బదులుచూపులు చూసి వూరుకోక ముందుకే అడుగు వేసిం దంట అది"

ఇంతవరకూ సాదరంగానే చెప్పి, తరవాత, పళ్లు పట పట్టాడిస్తూ "కాని కావాలి లంజెకి" అంటూ గభీమని అగ్గయిపోయింది నారమ్మ.

# 14

నారమ్మ అగ్గయిపోగా, గోవిందమ్మ నీరయిపోయింది.

గణాచారి కళ్ల లాగ నిప్పులు కక్కుతున్న నారమ్మ కళ్లు చూడలేక కొంచెం వెనక్కి వాలి, మొగమున్నూ పక్కకి తిప్పేసుకుందామె.

ఆప్రేమికుల సంగతి అలా వుండగా, మధ్యని, యీ నారమ్మ ఔద్ధత్యం యేమిటీ? సంయే అనడమో రుసరుస లాడడమో కాక ఆనందకందళితం అయిన కాముక వ్యాపారంలో యీగజిబిజికూడా యేమిటీ?

ఈఅనుకూల్య ప్రాతికూల్యాలు బోధపడక గోవిందమ్మ నిర్విణ్ణ అయిపోయింది.

అదంతా గ్రహించి నారమ్మ ప్రారంభించింది.

"సినీమా చూడా లని ముచ్చటపడగా రాజమహేంద్రం తీసుకువెళ్లాడంట అంజమ్మవ్వని, తిమ్మన్న"

గోవిందమ్మ వూఁకొట్టింది.

"తిరుగుబండి దొరగ్గా, తనమానాన తానూ వెళ్లిం దంటతిరపతమ్మ, కూతుర్ని వెంటబెట్టుకుని, ఆసినీమాకే"

"తిమ్మన్న సంగతి తెలిసేనా?"

"తెలిసేనంట —"

"అంత రాత్రివేళ రాజమహేంద్రం వాళ్లెవళ్లూ మన వూరికి బండికట్టరు కనక, బండీ బయలుదేరాటప్పు డెవు

రుగా నుంచుంటే అంజమ్మప్ప తన బండి యెక్కమనక పోతుందా—"

"ఎంత జాణే మామ్మా!" అంటూ బుగ్గలు నొక్కుకుంది గోవిందమ్మ.

"ఆట అయిపోయాక, తిమ్మన్న బండి పూనుస్తూ వుంటే ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ—"

"తక్కుతూ తారుతూ—" అనందించింది గోవిందమ్మ కళ్లు తిప్పుకుంటూ.

"వయసుపిల్ల లందరూ అంతేగా!" అని తిప్పికొట్టింది నారమ్మ.

గతుక్కుమనిపోయింది గోవిందమ్మ. కాని నారమ్మ అవ్యవధానంగా అందుకుని "అమాయికం మనిషి కాదూ అంజమ్మప్ప! ఇంటికి వస్తానా—" అని మాట నగంలో వుండగా "ఊరుకుంటే యేమి జరుగునో!" అనడిగింది గోవిందమ్మ.

"ముందు తానే బండెక్కి, తరవాతే చెయ్యి పట్టుకుని అంజమ్మప్పని బండెక్కించివుంటును"

"అంతపనీ చెయ్యాదనా? అయితే యేమి కానీ—అంజమ్మత్తా, తనకూతురూ వున్నారు గదా —"

"విన్నా చూసినా యెవరూ అనుమానించరుగా?"

బుగ్గలు నొక్కుకోబోయి, అంతలో, తిమ్మన్నా

తిరపతమ్మా యేకాంతంగా బండి యెక్కి వస్తున్నట్టు కనబడగా వాణికిపోయింది గోవిందమ్మ.

ఆమె చూపులు ములుకు లయిపోయాయి.

అది గ్రహించి, వొక్కమాటు తల పంకించుకుని "పెనిమిటి పోయాక అదే మొదలంట తిమ్మన్నతో మాట్టాడ్డం. అంజమ్మప్ప కునికిపాట్లంట. ఊరుకో మని వొకటే గిల్లడం అంట కూతురు. అయినా నదురూ బెదురూ లేకుండా మాట్టాడేసిం దంట లోకం సంగతి, వూళ్లోకి వచ్చేదాకా" అంది నారమ్మ.

గుండెలు కొట్టుకుంది గోవిందమ్మ.

"తిమ్మన్న పిల్లలు తన పిల్లలే అన్నంత మమకారం చూపించేసిం దంట"

"తాను పెంచుతుం దటనా?"

"వినవమ్మా వెర్రితల్లీ"

"సరే సరే"

"తన యింటిదగ్గిర తాను దిగి గప్‌చిప్‌గా యింట్లోకి వెళ్ళిపోవచ్చునా అంజమ్మప్ప? తిరపతమ్మ నింటిదగ్గిర దింపి రారా నాయనా—"

"మురిసిపోతూ బండితోలేడంట తిమ్మన్న. అవునా?" అనడిగింది గోవిందమ్మ, గునుస్తూ.

"కాకేం? కోరుకున్న మనిషి —"

నగంలో అడ్డువచ్చి "తరవాతా?" అంది గోవిందమ్మ.

"బండి కదలాక తన పొలాలమాట తెచ్చిం దంట ముందు తిరపతమ్మ. తరవాత, నారింజతోట సిక స్తయి పోతోంది, చూసిపెడుతూ వుండమంటూ దగ్గిరికి చేరిం దంట మెల్లిగా"

"తన వ్యవహారాలు చూసిపెడుతూ వుంటే —"

"అదీ యెత్తు...... చూశావా?"

"శాబాసు"

"బండి ఆగీ ఆగడంతోటే "బావయ్యకి పాలు తీసుకురా" అని కూతుర్ని ఇంట్లోకి పంపేసిం దంట, తాళంచెవి చేతికిచ్చి"

సిగ్గు అదిమి పెడుతున్నట్టు ముడుచుకు పోయింది గోవిందమ్మ.

"ఎడ్లని దువ్వుతూ బండిముందు నుంచుని వున్నా డంట తిమ్మన్న. మెల్లిగా దగ్గిరికి చేరి "నంయే" అంటూ చెయ్యి పట్టుకుం దంట"

ఇది వినడమే కష్టంగా వున్నట్టు మొగం పక్కకి తిప్పుకుని, కులుకుతూ వోరచూపులు చూసింది గోవిందమ్మ.

"కాని, ముందు తన కూతుర్ని పెళ్ళిచేసుకోమం దంట" అని చెప్పి, పెదిమలు బిగించుకుని తల వంకించు కుంటూ నారమ్మ వెటకారం కనపరచగా "మామ్మా,

ఎంతపన్నాగమే తిరపతమ్మతల్లీ" అంటూ యీసడించు కుంది గోవిందమ్మ.

"అవునుగదా? నీయిల్లు బంగారం గాను, నువ్వూ అలాగే అన్నావు కదా?"

"అనక?"

ఇద్దరూ గంభీరంగా చూసుకున్నారు.

గోవిందమ్మ యేదో అనబోగా అడ్డువచ్చి "తిరపతమ్మ కూతురు అందగత్తే అనుకో. నిజంగా రంభే అనుకో. మూడు యకరాల పల్లమూ రెండు యకరాల తోటలూ కూడా వున్నాయనుకో. అయితే మాత్రం, నలుగురు పిల్లలుగదా, రత్నాలుగదా, వాళ్ళని పాడుచేసుకుంటా డంటే నాకోడుకు?" అని నారమ్మ సాగతీసుకోగా "కాదుటమ్మా?" అంటూ గోవిందమ్మ శ్రుతి కలిపింది.

అది, సంగీతసభలో, పాటకు డొక్క విసురు విసరగా, దాని మీాద ఫిడ్లరు వొక్క రవ్వా వేసినట్టుంది.

ఒక్క క్షణం యిద్దరూ వూరుకున్నారు.

ఎవరికి వారే యెదటివారు మాట్లాడతా రని యిద్దరూ వొక్క క్షణం ప్రతీక్షించుకున్నారు.

చివరికి నారమ్మ నాలకం కనిపెట్టి "లేనివాడా, చక్కనివాడు కాడా, వయసు మళ్లిందా, పెళ్ళాడా లను కుంటే యిన్నాళ్లెందుకూ? చుక్కమ్మ పోయాక నాలుగే

ఛ్చూరుకున్నవాడు మాయ తిరపతమ్మకోసం ఆకొంగని పెళ్ళాడతాడా తిమ్మన్న?" అనడిగింది గోవిందమ్మ, తల అయిమూలగా తాటించుకుంటూ.

"అదీ మాట. కష్టసుఖాలు తెలిసినదానవు కనక ను వ్వనగలిగావు. అయితే, దానిమీద నా కొడు కేమి చేశాడో యెరుగుదువా?"

"చెప్పవూ?"

"తిరపతమ్మ యిలా అనేటప్పటికి పాలతప్పేలా పట్టుకుని గుమ్మంలోకి వచ్చిం దంట కూతురు; కాని వులకలే దంట, పలకలే దంట, చర్రున బండి తిప్పేసి మేఘాలమీద యెగిరి వచ్చేశా డంట నాకొడుకు"

చకిత అయి "మహబాగా చేశా" డంది గోవిందమ్మ.

"అదిమొదలు దాని కేసి చూడ్డమే మానేశా డంట. ఏం, చేతగానివా డనుకున్నావా యేమిటే నాకొడుకు?"

నారమ్మ యిలా అడుగుతుండగా "గోవిందమ్మగారూ" అంటూ పిలుపు వచ్చింది.

"అంబా" అంటూ పక్కనే వున్న లేగదూడ స్వాగతం చెప్పుతుంది.

"ఆవొచ్చింది, కట్టేసి వస్తా నుండేం" అంటూ దొడ్డి గుమ్మంకేసి చక్కాపోయింది గోవిందమ్మ, "మంచి

సమయంలో వచ్చాడు వీడు పానకంలో పుడకలాగ”
అనుకుంటూ.

# 15

“మొన్ననే చేసుకున్నాను, రెండు జిలేబీలు పట్టుకు రానా అత్తా?” అనడుగుతూ వచ్చి పక్కని కూచుంది గోవిందమ్మ.

“వద్దమ్మా, వద్దు” అంది నారమ్మ.

“రెండే కాదూ? పోనీ, వొక్కటి” అని కొసిరింది గోవిందమ్మ.

“సగంకూడా వద్దమ్మా? మూడు అరిసెలూ, రెండు పుంజీల పనసతొనలూ ముందుంచి తినేదాకా దేవుళ్ళాడింది తిరపతమ్మ. తిన్నాను, వచ్చాను, అంతే. లేకపోతే, నువ్వింత ప్రాధేయ పడుతున్నప్పుడు జిలేబీలు చేదనా తల్లీ?” అని నారమ్మ సద్దిచెప్పింది.

గోవిందమ్మకి తృప్తికాలేదు.

నారమ్మ, తిరపతమ్మ పెడితే తినడమూ, తాను పెడతానంటే వద్దనడమూ — ఇదిచూసి చాలాయిదయిపోయింది గోవిందమ్మ.

అదిగ్రహించి “మరోలాగ అనుకోకేం?” అందినారమ్మ.

“అయితే పంచదార కలిపి కసిన్ని పాలచుక్కలు

తెస్తా" నంది గోవిందమ్మ, పుచ్చుకుంటే గాని వల్లకా దన్నట్టు చూస్తూ.

నారమ్మ గుక్కెడు తీసుకుర మ్మనగా గోవిందమ్మ బయలు దేరింది.

"అప్పుడే తేలిపోగూడ" దనుకుంది నారమ్మ.

అప్పటి కప్పుడే పాలు తీసుకువచ్చింది గోవిందమ్మ.

"ఎక్కడికి వెళ్ళినా నీవంటి వయసు పిల్ల లిలాగే అదనీ యిదనీ ఫలహారాలు పెట్టి తినేదాకా బతిమలాడ తారు, ముసిలి దంటే దయేనమ్మా మీాకందరికీని" అని మొదట మెచ్చుకుని, తరవాత చప్పరిస్తూనూ, లొట్టలు వేసుకుంటూనూ, మధ్యమధ్య మాట్టాడుతూనూ ఆపాలు పుచ్చుకోసాగింది నారమ్మ.

"తిమ్మన్నకోసమే చేసింది తిరపతమ్మ అరిసెలు"

"అరిసెలు తింటాడా నీకొడుకు ?"

"తినకేం ? రాజాపిండివంట కాదూ అదీ ? అయితే, కరకరలాడుతూ వుండాలి నా కొడుక్కి"

"నాకూ అంతే" అనుకుంది గోవిందమ్మ.

"నాలుగురోజుల కో పిండివంట చేస్తుంది తిరపతమ్మ. మధ్యమధ్య పాలకావిళ్ళవాళ్ళచేత రాజమహేంద్రం నుంచిన్నీ తెప్పించుతూ వుంటుంది"

"తిమ్మన్న మాట్టాడకపోయినానా ?"

"నాకొడుకు నే నగ్గిలో వురకమన్నా వురుకుతా డని దానికి తెలుసుగా ? అంచేత, పట్టుకువెళ్ళి పెట్టేదాకా నా ప్రాణాలు కొరికేస్తుం దది"

"పుచ్చుకుంటున్నాడా !"

ఈమాట అడిగినప్పుడు గోవిందమ్మ గుండెలు పీచు పీచుచున్నాయి.

"నామాట తీసెయ్యలేక నాలుకకు రాసుకుంటున్నా, డంతే" అంది నారమ్మ.

ఇది వినేటప్పటికి గోవిందమ్మ వొళ్లు మండిపోయింది; కాని కొంచెం శాంతించి "నువ్వెందుకూ బలవంతాన పెట్టడం?" అని మసగ్గా అడిగింది.

"తినన్నా యేమిచేసుకున్నా నాకేమీ అక్కర్లేదు సుమా" అన్నట్టూ "నీ శ్రేయస్సు కోరే చెబుతున్నా" నన్నట్టూ స్ఫురించాలని "మధ్యనీ కెందుకమ్మా రొష్టు ?" అని కూడా అడిగిందామె.

అయినా, నారమ్మ నిజమే గ్రహించేసింది.

వెంటనే గోవిందమ్మ రెండుచేతులూ పట్టుకుని "చూశావా ? చూశావా అంట. నాకొడుకూ యిలాగే అడిగాడు. మీ యిద్దరిదీ వొకటే చూపూ, వొకటే తలంపూ, వొకటే మాటా, వొకటే తపనాను. నాకు నచ్చింది. కాదూ ? పెంకితనమే గాని తిరపతమ్మ కింత

తెలివేదీ? నాకిప్పుడు బాగా తెలిసింది. తిరపతమ్మ నాకొడుక్కి సుతరామూ తగదు. తగదు గాక తగదు" అంది నారమ్మ, రెండు చేతులూ విదల్చుకుంటూ.

గోవిందమ్మ ఉలిక్కిపడింది.

అది గ్రహించినీన్ని "తిరపతమ్మ వూసిక నాకొడుకు దగ్గిర తెస్తానా నేను? తిరపతమ్మకోసం వాడికి కోపం వచ్చే పని చేస్తానా నేను? వద్దమ్మా వద్దు" అంటూ తిరపతమ్మ యెడల తీవ్రప్రాతికూల్యం కనబరిచినట్టే కన బరిచి "ఇంకెందుకూ తిరపతమ్మా గిరపతమ్మానూ!" అంది చేతులు చాపుకుంటూ, నారమ్మ.

ఈమాట కూడా తనమీదకే మొగ్గి వుండడం గుర్తించుకుని గోవిందమ్మ మళ్ళీ వులిక్కిపడింది; కాని వేడి వేడి కాఫీలో చేదుకంటే స్వాదే యెక్కువ అయ్యేటట్టు, ఈమాటలో భయం కంటే ప్రియమే యెక్కువ అయి ఆమెకి నిభృతానందమే కలిగింది.

ఇంతలో "యిది విన్నావా మరి!" అంటూ మళ్ళీ అందుకుంది నారమ్మ.

"ఇవాళ నాలుగుపుంజీల వనసతొనలూ, అయిదరి సెలూ పొట్టాలుకట్టి నా చేతి కివ్వబోయింది తిరపతమ్మ; కాని నేను పట్టుకు వెళ్ళనన్నాను. బతిమాలింది. నేను 'వినను గాక విన' ననేశాను"

"ఊరుకుందా మరీ?"

"ఊరుకుందీ? నెత్తీ నోరూ బాదుకుంది. కాళ్లా వేళ్లా పడి యేడ్చేసింది."

"కావాలి" అనుకుంటూ తల తాటించుకుంది గోవిందమ్మ.

తన దారి నిష్కంటకం అయినట్టు మళ్ళా నిశ్చయించుకుని తృప్తిపడింది.

"కాక? నా కొడుకు ప్రాణాల కుచ్చులు పస్నుతుందా?"

"పిల్ల నిచ్చిన అత్తగారు –"

"ఎంత తప్పో చూశావా? పిల్లనిచ్చిన అత్తగారూ, కన్నతల్లీ –"

"సమానమే కా దంటమ్మా?"

"మంచీ చెడ్డా తెలియనివా డంటే నా కొడుకూ? ధర్మరా జటూ, నా కొడు కిటూ –"

"అవునవును. కనకనే వొప్పుకోలేకపోయాడు పాపం"

"సెబాస్, నువ్వు గ్రహించావు మా తిమ్మన్న విలవ. పడవమీాద సరంగువని చేసి కావంటే నాలుగురాళ్లు సంపాదించాడూ దాని తండ్రీ? నీకు వచ్చినట్టు మంచి బుద్ధు లెక్కణ్ణుంచి వస్తాయే దానికీ?"

తన అభిజాత్యం స్మరించుకుంది గోవిందమ్మ.

"వాళ్ళిద్దరూ స్నేహాం చేస్తే –"

"చేస్తే?"

"వాడు కాఫీ లనా అది గంజినీ ళ్ళనా, వాడు జిలేబీ లనా అది చేగోడీ లనా, వాడు తమలపాకు లనా అది తులిసాకు లనా –"

"మహాబాగా చెప్పావమ్మా" అంటూ నారమ్మమీద పడి చుట్టలు చుట్టుకుపోయింది గోవిందమ్మ.

ఒక్క క్షణానికి తేరుకుని, గంజినీళ్ళూ చేగోడీలూ తులిసాకులూ మళ్ళీ మళ్ళీ జ్ఞాపకం రాగా, తుళ్లితుళ్లి మళ్ళీ మళ్ళీ నవ్వుకుని, చివరికి "సరే, అది యేడ్చింది, మరి నువ్వేం చేశావ్?" అనడిగింది, అతికష్టంమీద.

"తే, రెండువేల రూపాయలు చేతిలో పొయ్యి తీసుకు వస్తా" నన్నాను. అంతే, దాంతో అంకిళ్లు పడిపోయాయి దానికి" అంది నారమ్మ, చురుగ్గా చూస్తూ.

ఇది విని ఆనందవిహ్వాల అయింది, గోవిందమ్మ.

తిరపతమ్మ తిరస్కరించబడ్డ దంటే, తాను స్వీకరించ బడ్డట్టే అని దిటవు తెచ్చుకుం దామె.

అయితే "వొకవేళ, తిరపతమ్మ, రెండువేలూ యిస్తేనో?" అని వెంటనే సందేహం అంకురించింది.

"అసలు, రెండువే లేమిటి;" అని కూడా తోచింది.

చూసి చూసి ఆప్రశ్నే పైకి అనేసింది.

"అవును, రెండు కాదు, దానిదగ్గిర నాలుగువేలు

గుంజినా తప్పు లేదు. అలా చేస్తే కాని అలాంటి పెంకి భడవలకు బుద్ధిరాదు" అని ముందు చెంపుకుంది నారమ్మ.

తరవాత "నాలుగురోజులు చూసి మరి లాభం లేదని గ్రహించి "నా కూతుర్ని పెళ్లాడవద్దులే, దయవుంచి నన్నే యేలుకో" అని నా చేత కభురుపంపించింది; కాని నా కొడు కేమన్నాడో —"

మాట కడ్డంవచ్చి "యేమన్నా డమ్మా?" అనడిగింది గోవిందమ్మ, ఆత్రంగా.

"గొల్లదాని కాళ్లు పట్టుకోమన్నా" డంది నారమ్మ అవ్యవధానంగా అందుకుని చురుగ్గా చూస్తూ.

త్రానపడిపోయింది గోవిందమ్మ.

# 16

దారిదోపుడుగాళ్ళని తప్పించుకుని బందిపోటుగాళ్ళచేతిలో పడ్డట్టయింది గోవిందమ్మ పని.

లేకపోతే, తిరపతమ్మ పోటీ తప్పిం దనుకుంటే యీ గొల్లభామ వుద్ధృతం యేమిటీ?

ఇదంతా చూడగా, తాను కూడా గొల్లభామ కాళ్లు పట్టుకోవా లేమో అని ఆందోళనా, ఈ లోపున తిరపతమ్మ ఆ పనిచేసి పోటీకగులుతుం దేమో అని కంగారూ పట్టుకుం దామెని.

"ఇంతకీ: గొల్లభామ కా ప్రాముఖ్యం యేమిటీ!" అని కూడా జిజ్ఞాస పట్టుకుంది.

వెంటనే "ఆ కథ యేమిటో చెప్పవూ అత్తా?" అని గునుస్తూ అడిగిం దామె.

ఈ కళపళపాటంతా చూస్తూనే వున్న నారమ్మ, యిది విని చిరునవ్వు నవ్వుకుని, అంతలో మళ్ళీ గాంభీర్యం వహించి "వో — త్తి అమాయికురాలు పావం, అది. దాన్ని చూస్తే జాలి కలుగుతుంది. ఇవాళ, నా కొడుకు, అన్నంతినమంటే తింటుంది వద్దంటే మానేస్తుందది" అంది.

"అన లిద్దరికీ యెలా కలిసిందమ్మా?"

"భగవంతునికి తెలియాలి" అంటూ అంజలిబంధం శిరస్సున కీలించుకుంది నారమ్మ.

"చూ — శావా? నాదగ్గర దాస్తావా?"

"దాస్తానా? ఎంతమాటా? ఇది దాచా లనుకుంటే తిరపతమ్మ గొడవమాత్రం దాచివుండనూ? వద్దమ్మా, నీకన్నీ చెప్పేస్తాను"

సంబరపడి మాట లేకుండా నారమ్మ చేతులు పట్టు కుంది గోవిందమ్మ.

"దాని తండ్రి బతికివుండగా నాలుగు నేతిడబ్బాలు వుచ్చుకుని, చెన్నపట్నంలో యెవరో పెద్ద అధికా రంట, ఆయనికి పంపా డంట నా కొడుకు"

"ఊహూ"

"మరో పదిరోజుల్లో ముసిలాడు చచ్చిపోయాడంట"

"పాపం, అద్దముద్దించా వయిపోయింది సీనయ్యకి"

"మరో వారం రోజుల కాసామ్ము వచ్చిందంట. ఒకనాడు వెళ్ళి తల్లినీ కూతుర్నీ పరామర్శ చేసి, మర్నాడు పట్టుకువెళ్ళి సామ్మిచ్చేశాడంట తిమ్మన్న"

"కూతు రేనా పుచ్చుకుంట?"

"అసలే వెర్రిబాగులమనిషి. ఆపైని మూలబడి పోయింది, యిక ముసలి దేమి చేస్తుందీ? కాకపోయినా, తండ్రి బతికున్నప్పుడూ కూతురి దే గా పెత్తనం?"

"అవు నవు నెరగనూ?"

"తరవాత రెండుమూడు మాట్లు పిలిచి లెక్కలు చూపించుకున్నా రంట నాకొడుకుచేత"

"ఏమాత్రమో?"

"మొగదిక్కు లేక మేకలమంద అమ్ముకున్నారుగా? ఆరువేలు దాటిం దంట మొత్తం"

"మనకంటే మూడునంచు లెక్కువ" అనుకుంటూ గోవిందమ్మ గుండెలమీద చేతులు వేసుకుంది.

"ఈరాకపోకల్లో నాకొడుకుమీద కన్నేసిందంటపిల్ల"

"అంటే?" అనడిగింది గోవిందమ్మ, కొంటెగాచూస్తూ.

"అంటేనా? వెర్రితల్లీ" అంటూ గోవిందమ్మ

బుగ్గలు నిమిరింది నారమ్మ.

దాంతో వొళ్లు ఝల్లు మనగా మొగం వంచుకొని కులికింది గోవిందమ్మ.

అది గ్రహించి "మరి నాలుగు రోజుల కోనాడు పొలాన్నుంచి యింటికి వస్తున్నా డంట తిమ్మన్న" అంది నారమ్మ.

"దాని గుమ్మంలోనుంచే గా రావాలి?"

"మరే – మరే – అప్పటికి నాలుగు గంట లయిం దంట. ఆకలి దహించేస్తోం దంట"

"కాఫీ వెడుతుం దంట గా పొలం?"

"వెళ్ళింది చాలింది కాదంట ఆవేళ"

"ఎంతబాధపడ్డాడో?"

"బాధ కాదూ తల్లీ? ఎంత సుకుమారి అని చెప్పను నాకొడుకు? అయితే, యెంత బాధపడ్డాడో అంతా సుఖపడ్డా డంట క్షణంలో"

"ఎలాగా?"

"అప్పటికి గుమ్మంలో నుంచుని వుందంట పిల్ల"

"దారి కాసిం దన్నమాట"

"ఓమాటు లోపలికి రమ్మం దంట గునుస్తూ"

"రానన లేదూ?"

"అనలేకపోయా డంట"

"కడుపులో ఆకలి —"

"మరి వాళ్లు చూపించే ఆదరమో?"

"ఆ ఆదరించే మనిషి బంగారబ్బొమ్మ కూడా ఆమె" అంది గోవిందమ్మ, కళ్ళూ చేతులూ తిప్పుకుంటూ:

"గొల్లది బంగారబ్బొమ్మే, కాదని యెవరనగలరూ? అయితే, నాకొడుకుని రత్నాల మిటారికత్తెలు కూడా అంతకంటే యెక్కువగా ఆదరిస్తారు మరి, తెలుసా!" అనడిగింది నారమ్మ.

మిరియప్పొడి కలిసిన పానకం అయింది గోవిందమ్మ కీమాట.

ఒక్కక్షణం ఆమైకం అనుభవించి "సరే, రమ్మం దంట" అని మాట అందించింది, తరవాత, ఆమె.

"రమ్మని వసారాలోతుంగచాప పరిచి కూచో మని, బుట్టెడు రూపాయి కాగితాలు గుమ్మరించిం దంట లెక్క చూసిపెట్టమని"

"బుట్టెడు నోట్లు" అంటూ మళ్ళీ గుండెలమీద చెయ్యేసుకుంది గోవిందమ్మ.

"చివరికి —"

ఇలా అని పూరిస్తూ చూసింది నారమ్మ.

"చివరికీ! —" అని తారకస్థాయిలో అడిగింది గోవిందమ్మ చకిత అయి.

"వయసుకి చిన్న దే కాని రాజా ఆడది కాదూ అదీ ?"

"ఏమి చేసిం దమ్మా ?"

"నోట్లు లెక్క పెట్టి కట్టలు కట్టా డంట నాకొడుకు. అవి పట్టుకువెళ్లి తల్లి కిచ్చేసిం దంట, ముందు"

"ఇచ్చేసి ?"

"ఎంత ఆకలితో యింటికి వెడుతున్నారో పావం, ఝామసేపు కూచోబెట్టాను, క్షమించండి మామయ్యా గారూ" అందంట, తరవాత, తలుపు చాటునుంచి"

"అని ?"

"ఒక పళ్లెంలో జాంగ్రీ లంట. ఒక పళ్ళెంలో లడ్డుండ లంట. ఒక పళ్ళెంలో పకోడీ లంట —"

"రాజమహేంద్రంనుంచి తెచ్చింది. కామోసునమ్మా"

"ఫ్లాస్కుతో ఉడుకుడుకు కాఫీ అంట"

"ఇంకెక్కడి ఆకలి ?"

"ఇంతేనా ?" అని వెల్లిస్తూ చూసింది నారమ్మ.

అది గ్రహించి "చూపుల్లో చూపులు కలిపిం దంట; అంతేనా ?" అనడిగింది గోవిందమ్మ, మురుస్తూ.

దీనిమీద "కొంటెపిల్లా, కన్నేసిం దంటే యేమి టని అడిగావు కాదూ ?" అని నారమ్మ ముదలకించగా, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ మొగం తిప్పేసుకుంది గోవిందమ్మ.

చూసి చూసి "మన్నాడు బేరం పోగా కమ్ముకుని రాజమహేంద్రవరంనుంచి బండి తోలుకువస్తున్నాడంట తిమ్మన్న. బజారులో నేతిడబ్బా లమ్ముకుని వూరిబయట దారి కాసిం దంట" అంది నారమ్మ.

"ఎంతసేపు కనిపెట్టుకుందో?"

"ఎంతసేపు కనిపెట్టుకునీ వుండకపోతే దొరుకుతాడు చిట్టీ, నా కొడుకు? ఊళ్ళో మనిషి కనక, అస్తమానమూ కనపడుతూ వుంటాడు కనక, నీకు లోకువ –"

"అదేమి టత్తా? నా కేమి లోకువా? ఊళ్ళో మనిషయితే మాత్రం? అలా అనుకోకమ్మా, శాబాసు, నీకొడు కెక్కడ, నే నెక్కడ?" అంటూ చాలా చాలా నొచ్చుకుంది గోవిందమ్మ.

"లోకువగా కనపడకపోతే తిరపతమ్మ అలా అనగలదా మరి?"

"ఆలోకు వేమిటో చూపించాడు కాదూ?"

"చూపించడూ? చూపించడా అంట?"

ఇలాఅని వొక్కమాటు రూక్షంగాచూసింది నారమ్మ.

"మాటవరసకి చెబుతా, ఏదీ, నిన్నలా అనగలడా నా కొడుకు? "ఓహోయి రాజా" అంటే "వోహోయి రాణీ –" అని గోవిందమ్మకేసి గంభీరంగా చూసింది, తరవాత.

చివరికి "గౌరవంచేస్తే గౌరవం. ప్రేమ కనపరిస్తే ప్రేమ. మనసిస్తే మనసు. ఈ వూరి కావూరెంతో ఆవూరి కీవూరంతే. అంతేనా?" అని లాలనగా అడిగింది, మాట మరిపిస్తూ.

"అంతే" అంది గోవిందమ్మ, వొక కంట వులుకుతూనూ, వొక కంట కులుకుతూనూ.

"తెలుసునమ్మా, నీ కంతా తెలుసు" అంటూ మళ్ళీ ప్రారంభించింది నారమ్మ.

"నువ్వన్నట్టు దారి కాసిందంట. కాసి పదడుగులు నడిచినట్టే నడిచి —"

"తిమ్మన్నే యెక్క మన్నాడంట బండి, అవునా?" అనడిగింది గోవిందమ్మ, నిరాశతో.

"ఎంత మాట అన్నావు తల్లీ?" అనడగింది వెంటనే నారమ్మ, కొంచెం నిష్ఠురంగా.

"మరేమి జరిగిం దమ్మా?"

"ఆకాస్త చనువూ నమ్మకుని నాకొడుకు సాహసించి యెలా పిలవగలడు తల్లీ?"

మాట్లాడలేకపోయింది గోవిందమ్మ.

"పదేళ్ళు నిండకుండానే మొగుడు రాలిపోయాడు గదా, — మనలో మనమాట — అల్లరిచిల్లరి మాని పని మనమెప్పుడూ వినివుండలేదుగదా, యిరవైయేళ్ళు నిండనిపిల్ల అది మాత్రం యెలా సాహసించగలదూ

పాపం ?" అనడిగింది నారమ్మ, జాలికనపరుస్తూ.

"నేనూ అలాంటి దాన్నే, నన్నాదుకొ వ్వా ?" అన్నట్టు లేడిచూపులు చూసింది గోవిందమ్మ.

అదిగ్రహించి, గోవిందమ్మ మొగం మీద మొగంపెట్టి "మరినువ్వో ? నువ్వు మాత్రం యే మొరుగుమువు తల్లీ ? పదహారోయేట — భూషయ్య కడుపులో వుండగానే కాదూ వెంకటస్వామిని మింగేశాడూ దొంగనాకొడుకు ? అప్పణ్ణుంచీ నాలుగ్గోడల మధ్యా పడివుండీ, తిన్నావో వస్తే వున్నావో, — నుంచినీళ్ళకి గౌరువ్వకి వెళ్ళడం తప్ప వీధి మొగం చూసి యెరుగుదువా నువ్వు ?" అనడిగింది నారమ్మ, ప్రేమ గుమ్మరిస్తూ.

గోవిందమ్మ కరిగిపోయింది.

ఆర్ద్రకంఠకూడా అయి "నేనుచెప్పుకోవడంకాదత్తోయ్! నాకొడుకు దగ్గిర తప్ప మరో మొగమునిషి యెదట నుంచోడం అంటేనే నాకు కాళ్లు వొణికిపోతాయి —".

అంటుండగా గభీమని అందుకుని "నే నెరగనూ ? ఇరుగూ పొరుగూ కనకా, మీనాయనకు తాతా సహోదరం బొపతు కనకా, భూషయ్య యుద్ధానికివెళ్లినప్పణ్ణుంచీ నీవ్యవహారాలు చూసిపెడుతున్నాడు కనకా చెంచయ్యతో మాట్లాడుతున్నావు కాని — అగ్గి — అగ్నిహోత్రం కాదూ నువ్వూ ? లేదమ్మా లేదు, నాకు కొత్తా నువ్వు ?" అంటూ

బుజ్జగించింది నారమ్మ.

వరపళ అయిపోయింది గోవిందమ్మ.

శరవరంపరగా కంఠంలో వాగ్జాలం సుడితిరిగిపోయింది గాని, మాట రాక గుక్కిళ్లు మింగిం దామె.

అది చూసి "ఇంతెందుకూ?" అని వొక్క క్షణం ఆగి "ఇంతెందుకూ? వీధిలో కాదు – వాకిట్లోనూ కాదు – వసారాలో కూడా కాదు – ఈపెరట్లో – ఈ రాచవుసిరిచెట్టుకిందికి తీసుకువస్తా ననుకో – వాడు నిన్ను పలకరించ డనుకో – నువ్వు కూడా మాట్లాడ నక్కరలే దనుకో – చూపులూ చూపులూ కూడా కలుపుకో నక్కరలే దనుకో – అయినా మాతిమ్మన్న యెదట నిటార్గా నుంచోగలవా నువ్వు?" అనడిగి, మళ్ళీ గంభీరంగా చూసింది నారమ్మ.

ఇది వినడమే తడువుగా "అమ్మమ్మోయ్" అని చేతులు పిసుక్కుంటూ వడవడ వొణికిపోయింది గోవిందమ్మ.

హఠాత్తుగా వెలిగిన మెరుపుబల్బుల్లాగ ఆమె భుగ్న నేత్రాలు ధగధగలాడగా, పసిడిచెక్కులూ కెంపెదవులూ జిగజిగమన్నాయి.

స్విన్నలలాటంమీద అలక లతుక్కుపోయాయి.

తొణికిసలాడుతున్న బంగారపునీరు లాగ వొణుకు వొణుకునా ఆమె శరీరం నిగనిగ లాడింది.





ఆస్థితిలో, పొదివిపట్టుకోడానికి కిందనుచెయ్యా, చుబుకం పట్టుకోడానికి కుడిచెయ్యా, చాచుకొని, తన బింబాధరం ముద్దుపెట్టుకోడానికి స్ఫురితోష్ఠాలు సజ్జితాలు చేసుకుంటూ, తిమ్మన్న, తన మొగాన మొగం పెడుతున్నట్టు తోచి హృదయగ్రంధి శిథిలం అయిపోగా పరవశ అయి కళ్లు మూసేసుకుందామె.

అది గ్రహించి నారమ్మ తల పంకించుకుంది.

ఒక్క క్షణమే యిలా వుండిపోయింది గోవిందమ్మ.

ఉత్తరక్షణాన, గద్గదిక మయిపోయి కంఠం సరిగా పలక్కపోగా, పావురం గుబాళిస్తున్నట్టు ఆగి ఆగి "వద్దమ్మా అత్తా, అప్పుడు నుంచోడందాకా యెందుకూ, మత్వా మాట అంటే యిప్పుడు కూచోడమే శక్యం కాకుండా వుంది, ముందు నన్ను పట్టుకోవమ్మా" అంటూ నారమ్మమీదికి వాలిపోయింది.

నారమ్మ కిది బంగారపుకొండ దొరికినట్టయింది.

వెంటనే ఆమెని వొళ్లోకి తీసుకుని వీపు నిమురుతూ "లేదు లే అమ్మా, లేదు. మాటమీద మాట వచ్చి వూరికే అన్నానంతే. అమాయికప్పిల్లవు కనక నువ్విలా అయిపోతున్నావు గాని నాకొడుకు కొంత నాజూకు మనిషనీ? ఎంత సరసుడనీ? ప్రసన్నంగా వుంటుంది గాని వాడి మొగం వికటంగా వుంటుందా? నిన్నంటే నిన్ను కాద

నుకో, కాని కింద నడవనిస్తాడా నిన్ను? గొల్ల దేమంటో మొరుగుదువా మరి!" అని చెబుతూ గోవిందమ్మ మొగం తనమెదటికి తీసుకుందా మె.

అప్పటికి గోవిందమ్మ కొంచెం తేరుకుంది.

అది గ్రహించి నారమ్మ "చన్ను పిద్దమ్మలు చాలా మంది చూశారంట తనకోసం. తండ్రి చచ్చిపోయే దాకా తన కీ చూపే లేకపోయిందంట. తరవా తయినా, నేల మీద వ్యాపారం కనక మొగడిక్కు లేకపోవడం లోటుగా కనబడి హఠాత్తుగా మనస్సు చలించిందంట. ఛీ యెందు కీజన్మ అనిపించిం దంట. క్షణాలమీద నిరుకుచేసేసుకుం దంట. కచ్చితంగా చెప్పేసిం దంట తల్లితో. ఈసందు బాట్లో చూశా రంట యెవ రెవరో. కాని, కులదేవత కనక శ్రీకృష్ణమూర్తి తనవంటి తిమ్మనన్ని దయచేశాడంట తనకి" అంది బులిపిస్తూ.

"తరవాత?" అనడిగింది గోవిందమ్మ, ఆప్యాయనంగా.

"తరవాతా? తరవాతా?" నారమ్మ యాదాలా భంగా అటూ యిటూ చూడగా "యింటికి వెళ్ళిపో తున్నా నమ్మగారూ" అంటూ వచ్చి పాలికాపు కుర్రాడు దూరాన యెదురుగా నుంచుని వున్నాడు.

"వస్తా నుండవమ్మా" అంటూనే. గోవిందమ్మ వాడితో చక్కాపోయింది.

# 17

రెండుమూడు గడియల పొద్దు పన్యాశేషమే వుంది.

పిల్లగాలికి వూగిసలాడుతున్న రాచవుసిరిచెట్టు కొమ్మలు వసారా గోడమీద అడవిఫిలిము ప్రదర్శిస్తున్నాయి.

పశువుల పాకమీద బూడిదగుమ్మడిపళ్లు స్ఫటిక శివలింగాల్లాగ మెరుస్తున్నాయి.

నల్లనూతి పక్కని మునగచెట్టుకి కట్టివున్న లేగదూడ పాలికాపు అప్పుడే వేసిన చెంగలి పరకలు పుటుకూ పుటుకూ కొరుకుతోంది.

చాంగ తీసి, విప్పి చింకిబింకిరిగా పడవేసిన తెల్లబట్టల గుట్టంగాగ పాకలో పడుకుని పడమటూవు నెమరు వేస్తోంది.

పిడకలకూ డంతా అలుముకుని వున్న బీరపాదు, మొహారీలు విజ్జిమ్ముతున్నట్టు గుత్తులుగుత్తులుగా పుష్పాలు విడుస్తోంది.

బట్టంపిల్లి, ఎలకలకోసం గడ్డిమేటి చాటున వాడు పొంచుకుని వుంది.

పెరడంతా తిరిగి, కడుపునిండా తిని, నూతిపళ్లెంలో నీళ్లు తాగి, కోడిపెట్టలూ పుంజూ గూటికి చేరుకుంటున్నాయి.



చెరువుగట్టున వున్న రావిచెట్టుమీా. కయికురు బొయి కురు మని రొదచేస్తూ వందలూ వేలూ కాకులు చేరుకుంటు న్నాయి.

గోవిందమ్మా నారమ్మా కూడా యెసళ్లు పడేసుకునే సమయం అది.

ఆవుకి చిట్టూ తవుడూ పెట్టి గోవిందమ్మ పాలుకూడా తీసు కునే సమయం అది.

ఈసంగతి జ్ఞాపకంచేసి "మరి పోతా" నంటూ లేచి నుంచుంది నారమ్మ; కాని గభీ మని ఆమెని పొదివి పట్టుకుని "తర్వాత యేమి జరిగిందో చెబితే గాని వెళ్ల నివ్వ" నంటూ మళ్లీ కూచోబెట్టింది గోవిందమ్మ.

"కాదూ కూడ దంటే నాతో పాటు ఇక్కడే భోజనం చేస్తువు గాని" అనిన్నీ చెప్పిం దామె.

దానికి "హూమ్మ, మాతల్లే" అంటూ తన సంబరం కనపరచి "గుప్పెడు గింజలు పొంగించుకోడం యెంత సేపూ? పోనీ, కొంచెం పొద్దోయినా ముచ్చట పడుతు న్నావు కనక, – పడుచుపిల్లవు నువ్వు వింటే తప్ప నాలో జీర్ణం చేసుకుంటే యేమి సొగసు కనక, జరిగిం దంతా నీకు చెప్పే వెడతానులే అమ్మా" అంటూ సరిగా కూచుంది నారమ్మ.

"మాయింటో భోజనం చెయ్యకూడదూ అత్తా?"

"ఎందుకు చెయ్యకూడదూ? అక్కడ పదికూరలూ, పది పిండి వంటలూ మించిపోతున్నా యనా నువ్వింత ఆదరంగా పిలుస్తూ వుంటే కాదనడానికి?"

"మరింకేమీ?"

"ఈపూటకిపోనియ్యమ్మా, పాడుచేసుకుంటే నాకేమి లాభం నీకేమి లాభం, పొద్దున్న చేసుకున్న కూరా పులుసూ –"

"అయితే, రేపు తప్పదు మరి" అంటూ గారాం కురిపించింది గోవిందమ్మ.

అది చూసి వొకమా టుదాసీనంగా నవ్వేసి "నాతల్లి, నాతల్లి" అంటూ గోవిందమ్మ కణతలమీద మెటికలు విరిచి "అక్కడ మాతమ్మన్న యెంత గారవిస్తున్నాడో యిక్కడ నువ్వూ అంతగా నెత్తిమీద పెట్టుకుంటున్నావు నన్ను. మీ రిద్దరూ నన్నిలా కనిపెడుతూ వుంటే నా కింకేం లోటూ?" అనడుగుతూ ఆమెను వొళ్లోకి తీసుకుని లాలించింది నారమ్మ.

దీంతో, అడ్డాల్లో బిడ్డ అయిపోయింది గోవిందమ్మ.

ద్వంద్వాతీత మైన శైశవమాధుర్యం వొక్క క్షణకాలం ఆమె మొగాన లాస్యం చేసింది.

తల్లి పోయిన పదేళ్లనుంచీ ఆమె యీ సన్నివేశం యెరగదు. మరిచీ పోయింది; కాని ఆక్షణగూ మాత్రం

పరవశ అయిపోయి వుండి, ఉత్తరక్షణాన మళ్లీ యౌవన వ్యగ్ర అయిపోయింది.

ఆమె చూపుల్లో నల్లకలవలు వికసించాయి.

బుద్ధి చమత్కృతం అయి వొక యుక్తి తోచింది.

"నీకు పాయసం అంటే మహాయిష్టమంట, వీరాస్వామి తాతగారి శ్రీదేవమ్మ చెప్పిం దోమాటు. నేమ్యా లింటోనే వున్నాయి చేస్తానేం అత్తా" అందామె, వెంటనే.

"అదెందుకు తల్లీ, యిప్పుడు?"

"అలా కాదు, పెద్దదానవు నువ్వు, తగుదునమ్మా అని నిన్ను పిలిచి వొట్టి భోజనం పెట్టనా? పచ్చకర్పూరం పలుకులూ, కుంకుమపువ్వూ అవ్వీ మొన్ననే తెప్పించు కున్నాను చెంచయ్యన్నయ్యచేత"

"దర్జా అంటే నీకే తెలును. అన్ని వంటలూ చెయ్య గలవు నువ్వు, దేవుడు నాలుగు రాళ్లుకూడా యిచ్చాడు నీకేం లోటూ?"

"లోటుకాక యేమిటి గానీ –"

"విన్నావా?"

"ఏమిటమ్మా?"

"మాయతిరపతమ్మ చేసిం దొకనాడు"

"అయ్యో, మనకంటే ముందే చేసేసిందే?" అనుకుంది గోవిందమ్మ.

ఈ భావం గ్రహించి "నీకంటే ముందే చేసింది కానై తే" అంటూ మాట తేల్చేసింది నారమ్మ.

"కానై తే యేమిటమ్మా?" అనడిగింది గోవిందమ్మ.

"చెయ్యానూ చేసింది, తిమ్మన్నకి పంపనూ పంపించిందమ్మా, కాని సగ్గుబియ్యంతో చేసి బెల్లం పడేసింది కసింత" అంది నారమ్మ, యీసడించుకుంటూ.

"బెల్లమా?" అంటూ విస్తుపోయింది గోవిందమ్మ.

"చచ్చినచావయిపోయింది నాకు, పట్టుకువెళ్లడానికీ, తిమ్మన్నకి పెట్టడానికీని"

"పుచ్చుకున్నాడా?"

"నాబలవంతాన కూచున్నాడు; కాని బెల్లంవాసన కొట్టగా గిన్నెకి గిన్నె అంతా కోళ్లముందుకు గెంటేశాడు, వెలపరించుకుంటూ"

ముందు ముక్కుమీద వేలేసుకుని "ముండానడసం" అంది గోవిందమ్మ, లోపల పొంగిపోతూ.

"వంటింట్లో పొయ్యిదగ్గిరకూచుని తనేం కతికినా చెల్లుతుంది; గాని కోరుకున్న మొగరాజుకి పంపడం — సిగ్గూ భిడియమూ లేకపోతే సరి" అంటూ చీదరించుకుంది, తరవాత.

చివరికి "పచ్చకర్పూరమూ, కుంకుమపువ్వూ, కిసిమిసిపళ్లూ, జీడిమామిడిపలుకులూ, ఏలకాయలూ, అచ్చావు

నెయ్యొపడకపోతే పాయసం అంటే యేమిటి పాయసం?"
అంటూ ఝుమాయించి అడిగేసింది, చేతులు తిప్పుకుంటూ.

"కాదు తల్లీ?" అంటూ బుగ్గలు నొక్కుకుని "నువ్వు చెప్పిన వస్తువులు కళ్ళతో చూసయినా వుంటేనా అదీ? పల్లెటూళ్ళో పుట్టి, పల్లెటూళ్ళో పెరిగి, పల్లెటూళ్ళో ముగ్గిపోతోంది — మోటమనిషి — పోనిస్తూ దాని పూసెం దుకు మన కింకా?" అంది నారమ్మ, కళ్ళల్లోకి చూస్తూ.

"నేను చెప్పుకోడం కాదు గాని - రేపు చూస్తావుగా?"

అహంకారం కొంచెం కనపరుస్తూ గోవిందమ్మ యిలా అనగా "నేను చూడ్డంతో సరిపోతుందా?" అని యెదురడిగింది నారమ్మ

"ఇంకేమిటమ్మా?"

"అది ఆరగించి నే నింటికి పోతూవుంటే వీధికి వీధి అంతా గుమ్మ్మమని పోదూ?"

"అంతే కదా?"

ఆ పరిమళానికి దాగేపోయేవాళ్లంతా నన్ను చుట్టేసుకోరూ?"

"ఉలకం!"

"అంతేనా?" అంటూ మళ్ళీ మొదటికి వచ్చింది నారమ్మ.

"ఇంకేమిటమ్మా మరీ?" అంది గోవిందమ్మ, ఆ శుభ

మైన మాటకి ఎదురుచూస్తూ, అందువల్ల కలిగిన ఉల్లాసం కళ్లల్లో మాటుకుంటూను.

"నా కెందుకు తెచ్చావు కాదని తగువు పెట్టడూ నాకోడు కూ?"

మొగంమీద మొగం పెట్టి సాగతీసుకుంటూ నారమ్మ యిలా అడగ్గా "బాబోయ్" అంటూ ముడుచుకు పోయింది గోవిందమ్మ.

ఆ మాటతో తాను బేజారయినట్టు నటించబోయింది; గాని, భయానికి బదులు ఎంతో సుఖం కలిగినట్లు గుర్తుగా శరీరం పాదాది శిరఃపర్యంతమూ పులకలు పేటెత్తాయి.

ఆర్తికి మాయగా ఎంతో ఆనందం కలిగినట్లు సూచనగా, బాలభానుని అరుణకిరణాలతో ప్రఫుల్లం అయిన తామర మొగ్గలాగ మొగం వికసించింది.

అలాంటి అదృష్టం యెప్పుడెప్పు డని ఉవ్విళ్ళూరుతున్నట్టు లక్ష్యంగా, నీటి పై భాగానికి వచ్చి వొక్కమాటు చెంగుమన్న జేజీనమీల లాగ ఆర్ద్రనేత్రాలు చమక్ మన్నాయి.

"హాయిహాయి" అనబోతున్నట్టు చిహ్నంగా, కెంబెదవులు స్ఫురించాయి.

ఇదంతా పరకాయించి "వెర్రితల్లీ" అంటూ గోవిందమ్మ మొగం నిమిరి, తాపీగా ప్రారంభించింది నారమ్మ.

"డబ్బుండడం కాదమ్మా ప్రధానం, ఖర్చుపెట్టడం చేతకావాలి. పిండివంటలు చెయ్యడం కాదమ్మా ముఖ్యం, రుచి తెలియాలి. తాను తినడం కాదమ్మా గొప్ప, వాళ్ళకి పెట్టాలి"

"నిజమే నమ్మా"

"పెట్టడంలోనూ తారతమ్యా లున్నాయి. కడుపు మాడి చచ్చే బీదవాళ్ళకి పప్పూ ధప్పళమూ వేసి తిన్నంతా అన్నం పెట్టాలి గాని, రా రమ్మని పిలిచి కాస్త అరిసి ముక్క చేతిలో పడేసి పోపొమ్మంటే —"

"ఇంకా చెప్పుకోవాలి కూడాను"

"అల్లుణ్ణి తీసుకువచ్చి రకరకాల పిండివంటలు చేసి పెట్టాలి గాని, పప్పూ కూడూ పెట్టి —"

"సిగ్గుసిగ్గు" అంటూ నోరు నొక్కుకుంది గోవిందమ్మ.

"అవునుగదా, మరి నీవంటి బంగారుబొమ్మ "రాజా" పాయసం చేసి, నవమన్మధుడు మా తిమ్మన్నకి — అబ్బా, అబ్బా, ఆ రుచి తలుచుకుంటేనే నోరూరిపోతోందే మా తల్లీ! ఆ పరిమళం భావించుకుంటేనే మత్తెక్కిపోతోందే మామ్మా" అంటూ గోవిందమ్మని గుచ్చి కౌగిలించుకుంది నారమ్మ, అప్రయత్నంగా.

ఆ మాటతో, తానూ తిమ్మనా్న యేకకంచంలోనే

ఆపాయసం పుచ్చుకుంటున్నట్టు భావించుకుని, ఆ కౌగిలి లోనే నిర్భరానందం అనుభవించింది గోవిందమ్మ.

## 18

ఒక్క క్షణం వారిద్దరూ అలాగే వుండిపోయారు.

ఇంకో క్షణానికి విడిపోయారు.

మరో క్షణానికి గాని మాట్లాడలేకపోయారు.

అప్పుడయినా "వో—ట్రి జేల మసిషివి. మాయా మర్మమూ యెరగవమ్మా పాపం. అయితే ముసిలి దంటే నీ కింత మమకారం యెందుకు తల్లీ?" అంటూ నారమ్మే ముందు వలకరించింది.

దాంతో ప్రకృతిలో పడి "తరవాత యేమి జరిగిం దమ్మా, అత్తా!" అనడిగింది గోవిందమ్మ.

"ఏమి జరిగిందా?.........ఏమి జరిగిం దంటావా!" అని, జ్ఞాపకంచేసుకుంటున్నట్టొకమాటు పైకీ, ఒకమాటు కిందికీ చూసి, ఎంత బుర్రచించుకున్నా జ్ఞాపకమే రాకుండా వున్నట్టొకమాటు మొగం చిట్లించుకుని, చివరికి "మా కాలంలో మే మెరుగుదుమా యేమన్నానా, వయ్యారి భామల విలాసాలు నే నేమి చెప్పగలను తల్లీ? కాకపోయినా మరిచిపోయా, నిందాకా యెందాకా చెప్పాను చిట్టీ?" అని యెదురడిగింది నారమ్మ, నిజంగానే మరిచిపోయినట్టు.

"పదడుగులు కూడా నడిచినట్టే నడిచి బండి యెక్కేసిం దంట" అనందించింది గోవిందమ్మ.

"మరే మరే, కొసకి బండెక్కేసిం దంట. దీనిమీద "తిమ్మన్నే యెక్కమన్నాడా" అనడిగావు నువ్వు, అవునా?"

"అవును"

"బండి కాళీగానే వుంది నయమే అనుకుం దంట గొల్లది. రెంకుచేతులా రెండు కాళీడబ్బాలు పట్టుకుని నడవడం ఆడపిల్లకి కష్టమే అనుకున్నా డంట నా కొడుకు"

"ఎంత జాలిపడ్డాడో!" అంది గోవిందమ్మ కళ్ళు తిప్పు కుంటూ.

"జాలికాదూ? ఉందూరి మనిషి — చక్కనిచుక్క — విందుపెట్టిన సొగసులాడి —"

"కన్నేసిన జాణ —"

"అవునుగదా? అలాంటి మనిషిని చూస్తే యెవరి కయినా ప్రాణాలు పీకవూ? అందులోనూ నా వెర్రితండ్రికి!"

మందహాసద్యుతులతో గోవిందమ్మ శోణాధరం స్ఫురించింది.

"సరే, తరవాతా?" అనడిగిం దామె.

"మొదట దానికళ్లు మిలమిల్లాడాయంట. తరవాత తనకళ్ళు కలకల్లాడాయంట. అదయాక, మొదట, దాని పెదిమలు కదిలినట్టయిం దంట. వెంటనే తనపెదిమలు —"

"జరిగినదానికంటే చక్కగా చెబుతా వత్తా, నువ్వు" అంటూ నారమ్మని పట్టుకుని గుంజేసింది. గోవిందమ్మ.

"నడే, నాకొడుకు మాటలు గాని నామాటలా యివి?"

"అంత తియ్యగా మాట్టాడతాడా నీ కొడుకు!"

"వినాలి గాని చెబితే యేమి లాభమూ!"

"ఎందుకూ? లేనిపోని బెట్టుసరీ చూపించి పాడుజేసుకున్నా" ననుకుంటూ; యెంతో పశ్చాత్తాప పడింది గోవిందమ్మ.

"నువ్వేమి చేశావో నాకు తెలియదనా!" అని తల పంకించుకుని మళ్ళీ అందుకుంది నారమ్మ.

"ఇదంతా కనిపెట్టి వాటంతట అవే యెడ్లు ఆగి పోయాయంట"

"శాబాసు"

"శాబా సన్నావు గాని, నువ్వేమి చూశావు నా కొడుకు "రాజా" యెడ్లని?

"బండిమీద సామాను వేసీవెయ్యడంతోటే, వాటంతట అవే కొమ్ములతో మెడమీదికి తీసుకుంటాయంటగా కాడి?"

"విన్నావుగదా? అలాంటి యెడ్లవి" అని ఆగిపోగానే బండిదగ్గిరికి వచ్చిం దంట గొల్లది, తనకి తెలియకుండానే. ముందు దబ్బా లందుకుని బండిలో పడేసి, తరవాత

మెల్లిగా దానికి చెయ్యి అందించాడంట నాకొడుకు, అప్రయత్నంగా"

"పట్టపగలు –"

"ఏం అయితే?"

"అమ్మోయ్, వింటేనే –" అంటూ వాణికి పోయింది గోవిందమ్మ.

"వెర్రిపిల్లా, నాకు తెలును, ఈక్షణంలో నాకొడుకు ఎదటికి వచ్చి నుంచున్నాడంటే కులుకయిపోతుంది యీవొంటు కంతా" అంది నాశమ్మ, వెటకారం నటిస్తూ.

"వద్దత్తా వద్దు, అలా అనకమ్మా" అంటూ చేతులు జోడించుకుని దణ్ణం పెట్టింది గోవిందమ్మ. మనస్సులో ఆసన్నివేశం భావించుకుంటూనూ, కోరుకుంటూనూ.

"కావాలంటే వచ్చేదా, వద్దంటే పోయేదా యిది పూర్వజన్మములో చేసుకోవాలి, యీజన్మలో పెట్టి పుట్టాలి –"

"మరి తిరపతమ్మ –"

"అయిందిగా? తిమ్మన్న దొరికాడా దానికి? ఇక దొరుకుతాడా పోనీ?"

"దొరకనే వద్దు" అంది గోవిందమ్మ, మరాతి తీడాయించుకుని.



9

"నువ్వీ మాట అన్నావని తెలిస్తే నా కొడుకెంత పొంగిపోతాడో – "

"కొంపతీసి – "

"ఊరికే మాటవరస కంటున్నానమ్మా! నుంచున్న పాళంగా వచ్చి నీపాదాలమీద వాలడూ? మీయిద్దరి మీదా దేవతలు పూలవాన – "

"తిరపతమ్మ మీదో?"

"మన్నూ మశానమూ – "

"అదీమాట" అన్నట్టు చెయ్యూపింది గోవిందమ్మ, తల తాటించుకుంటూనూ, పెదిమలు కదుపుకుంటూనూ.

"శాస్త్రమే తల్లీ, శాస్త్రమే. శాస్త్రం వూరికే పోతుందా మరి? చూడూ, ఎంత వెర్రిబాగుల కులం అయినా శ్రీకృష్ణుడు పుట్టిన కులం కనక, గొల్లది యెంత రాజావని చేసిందోనూ? బుద్ధి పుట్టడంతోటే తిమ్మన్న మీద పడక సచ్చేదవలమీద పడితే? "

"ఛా, యీనాన్నిం" అంటూ కళ్లు మూసుకుని, వొళ్లు జలదరించుకుంది గోవిందమ్మ.

"కానయితే తిరపతమ్మ చూపూ – "

"చూపు మంచిదే; కాని కుళ్లుబుద్ధి. తిమ్మన్న అందమే చూసింది గాని విలవ తెలుసుకోగలిగిందా?" అనడిగింది గోవిందమ్మ ఆశక్తి తనకే వుందన్నట్టు

గర్వంగా చూస్తూ.

"తెలుసుకోగలిగిందా? తన కూతుర్ని పెళ్ళాడతాడే అనుకో. ఆవిధంగా లోకం కళ్లు కప్పవచ్చు ననుకుంది గాని —"

"కప్పగలదా? కూతురే అల్లరిపెడితే?"

"అదేడవా, తనేడవాను. అంతేనా?"

"తిమ్మన్నకి మాత్రం యేమి సుఖం అత్తా?"

"నువ్వు నూరేళ్లు వర్ధిల్లి — నాకొడుకూ యిలాగే అడిగాడు. ఇవాళ, కంటికి కడివెడు నీళ్ళుగా యేడ్చు కుంటోంది గానీ —"



"ఏడవనీ"

"బతికున్నంతకాలమూ నీ కేడుపే రాసిం దని చెప్పేశాను నేను. నాకొడుకు —"

"నీకొడుకు సుఖపడుతున్నాడు గదా?"

"ఒక విధంగా సుఖమే; గానీ —"

ఇలా అంటూ నసికింది నారమ్మ.

ఆవసుకు మనస్సు కలిచెయ్యగా "కానీ అంటే?" అనడిగింది గోవిందమ్మ, ఆత్రంగా.

"కానీ అంటేనా?.....కానీ అంటేనా?" అంటూ పక్కకి చూసింది నారమ్మ.

ఆచూపు గోవిందమ్మని కలిచేసింది.

ఏమిటేమిటో అనుకుందామె.

ఒక్కటొక్కటే కాదనీ అనుకుంది.

అయినా, వూరుకోనూలేకపోయింది.

"ఇక కానీ యేమిటత్తా?" అని వెంటనే మళ్ళీ అడిగింది, మరీ ఆత్రపడి పోతూ.

"గొల్లది పందుకొమలపాకే. బంగారబ్బొమ్మే. "ఆరాధే యిలా పుట్టిం దనుకో పిన్నమ్మా" అన్నాడు నాకొడుకు; కానీ — "

"నన్ను చంపుకుని — ఏం వొట్టుపెట్టుకోనా?" అనడిగింది గోవిందమ్మ, నారమ్మ చేతులు పట్టుకునీ, నిష్ఠురంగా చూస్తూనూ.

"వొట్టెందుకు తల్లీ? కులం కాని కులం—చెప్పడాని కేమివుందీ!"

చేతులు తేలవేసుకుంటూ నారమ్మ యిలా అనే అప్పటికి గుబగుబలాడిపోయింది, గోవిందమ్మ.

ఆమె కళ్ళల్లో ఆశాలతలు పాకిపోయాయి.

అది గుర్తించి "తన ఆటకి తిరపతమ్మ తాళం వేసినందుకు మహాపొంగిపోయా డంట నాకొడుకు" అని వూరుకుంది నారమ్మ, వూగీసలాడుతూనూ, గోవిందమ్మ ముఖభంగిమ గమనిస్తూనూ.

మాట ముగియడం తడువుగా "మరిప్పుడు?"

అనడిగింది గోవిందమ్మ.

"ఇప్పటికీ కులంమనిషికోసమే చూస్తున్నాడు నాకొడుకు" అంది నారమ్మ, అలాగే చూస్తూ.

ఇది విని పరిసరాలు మరిచిపోయి, పక్కకి చూస్తూ ఆలోచనలో పడింది గోవిందమ్మ.

"నారమ్మ కాళ్లు పట్టుకో" అని మనస్సు తొందర పెట్టింది; గాని "గొల్లభామ అడ్డుంది పరకాయించుకో" అని బుద్ధి మందలించింది.

దీంతో మరీ కంగారుపడిపోయిం దామె.

ఒక్క క్షణం దారీ తెన్నూ తోచలే దామెకి.

ఉత్తరక్షణంలో "కులంమనిషి దొరికితే మరి గొల్లభామ!" అని సందేహం తోచగా, అప్రయత్నంగా అదే పైకి అనేసింది.

"గొల్లభామ గొల్లభామే"

"అంటే?"

"గొల్లభామా నన్ను విడిచిపెట్టలేదు, నేనూ దాన్ని విడిచిపెట్టలేను" అన్నాడు నాకొడుకు"

"చిక్కువిడిపోలే దన్నా"

"భోగంవాళ్ళలోకూడా అంత రసికురా లుండదంట. కులంవాళ్ళలోకూడా అంత నమ్మకస్తురా లుండ దంట. బాపనోళ్లలో కూడా అంత శుచిశుభ్రత లున్న మనిషి

క్కుండదంట”

తన దగ్గిర అలాంటి యోగ్యత లున్నాయా లేదా అని ఆత్మపరీక్ష చేసుకుంటూ “అయితే?” అనడిగింది గోవిందమ్మ.

“కలిసి వారంరోజులు కాకుండానే వొకనాడు ఫలహారం తినిపిస్తూ “నాడబ్బూ నాబతుకూ నీవి” అంటూ తాళాలు నాకొడుకు చేతిలో పడేసిం దంట అది”

ఆదృశ్యం భావించుకుంటూ తలవూపింది గోవిందమ్మ.

“వెంటనే దాని తాళాలు దాని చేతిలో పెట్టేశా డంట నాకొడుకు!”

“పెట్టేసి?”

“నన్ను డబ్బుతో కాదు స్వాధీన పరుచుకోడం. నామనన్సు పుచ్చుకో. నీమన స్సిచ్చెయ్యి, చాలు –”

తిరపతమ్మని రెండువే లడగడం జ్ఞాపకం వచ్చింది; కాని బతుకు మాట యేమన్నాడో విందా మన్న ఆదుర్దాతో మాట కడ్డువచ్చి “అని?” అనడిగింది గోవిందమ్మ.

“అంటే నాకు రెండు కోరిక లున్నా” యందంట అది”

“ఏమి టవీ?”

“నాకొడుకూ నీలాగే అడిగా డంట. అడిగితే, తీరుస్తా నని ముందు చేతిలో చెయ్యి –”

" వేళాడా? "

ఇలా అడిగినప్పుడు గోవిందమ్మ కంఠస్వరంలో చాలా ఆదుర్దా కనపడింది.

" ఏమిా వెయ్యకా? "

" ఎటొచ్చి – "

" అంత నమ్మక మైన మనిషి కొంపలు కూలిపోయే కోరికలు కోరుతుందంటే వెర్రిపిల్లా !"

గోవిందమ్మకి కొంత ఆందోళన తీరింది.

" మరి ఆకోరిక లేమిటీ? " అనడిగింది, తాపీగా.

" ఒకటి – నాబతుకు నీచేతిలో కడ తేరిపోవాలి అనంట "

" దాని కేమన్నాడూ?"

" ఒప్పుకున్నా డంట "

గోవిందమ్మ కొయ్య అయిపోయింది.

అది గుర్తించి, అయినా వొక్క క్షణం వూరుకుని, గంభీరంగా నున్నూ చూసి " ఇక రెండోది – " అంది మెల్లిగా నారమ్మ.

నిద్రలో వుండి వులిక్కిపడి లేచినట్టు " యేమి టత్తా అదీ? " అనడిగింది గోవిందమ్మ.

" మంచి పిల్లని చూసుకుని పెళ్ళాడ మనంట"

" పెళ్ళాడ మనా? "

"అంత విస్తుపోతావేం తల్లీ? నిజమైన సంసారి అది. కనక, తన సుఖమే చూసుకుంటుంది; గాని తిమ్మన్న పాడయిపోవా లని యెందుకు కోరుకుంటుంది?"

మిడుతూ మిడుతూ చూసి "మరి ఆడతా నన్నాడా?" అనడిగింది గోవిందమ్మ.

"మళ్లీ పెళ్ళిచేసుకోగూడ దని చుక్కపోయినప్పుడే-"

"అవునంట, విన్నాను"

"ఇక పెళ్ళివూ సెక్కడిదీ?"

"మరి చేతిలో చెయ్యి వేశాడు?"

"కష్టసుఖా లన్నీ వివరించి చెప్పి పెళ్ళిమాట మాని పించా డంట"

"మానిపించి?"

"పెళ్ళాడతగ్గ పిల్ల కంటే యెక్కువ దనుకో. మా కులంమనిషే వొకామె వుంది, దానిమీదకూడా నాకు భ్రమ –"

"అందుకు గొల్లది ఒప్పుకుందా?......పోనీ, తిర పతమ్మేనా ఆ మనిషి?"

"నడే" అంటూ గోవిందమ్మ బుజంమీద కొట్టి అందు కుంది నారమ్మ.

"దానిమీద నిరాశ చేసుకునే కాదంటే –"

"అవు నవును. మరి ఆ మనిషెవరమ్మా?"

పెదిమలు బిగించుకుని, తల అడ్డంగా వూపుకుని, తన తొడ మీద చరుచుకుంటూ "అదే చెప్పాడు కాదు నా కొడుకు" అంది నారమ్మ.

నడుస్తూ నడుస్తూ వుండిన ఫిలిము ఫటుక్కున తెగి పోయినట్టయి "ఆ" అంటూ నిర్విణ్ణ అయింది గోవిందమ్మ.

"అనేకవిధాల అడిగాను. నేను పరాయిదాన్నా?" అని నిష్ఠురా లాడాను. "నన్ను చంపుకుతిన్నట్టే" అని వొట్టు కూడా పెట్టుకున్నాను. అయినా గిజా అన్నాడు గాని చెప్పలేదు"

"పోనీ, ఆ మనిషి వొప్పుకుం దటనా ?"

"గొల్లభామని వొప్పించగలిగా డంట గాని ఆ మనిషి లొంగలేదంట"

"ఏవూరో ?"

"ఈ వూ రేనంట"

"గుర్తు లేమయినా చెప్పాడా ?" అనడిగింది గోవిం దమ్మ, ఆరా తీద్దాం అన్నట్టు చూస్తూ.

"చెప్పాడు"

"ఏవీధి?"

"చెప్ప నన్నాడు"

"పోనీ యేవైపు ?"

"అదీ చెప్పనన్నాడు"

"మరేమి చెప్పా డమ్మా?......పోనీగాని పొట్టా పొడుగా?"

"అదడగలేదు నేను"

"లావా సన్నమా?"

"అదీ అడిగలేదు"

"రంగు —"

"పా — చ్ఛని దబ్బవం డంట"

ఉలిక్కి పడింది గోవిందమ్మ. దాన్నిబట్టి ఆ మనిషి తానే అని నారమ్మ అనుకుంటుం దేమో అని మొగం పక్కకి తిప్పేసుకుని, కొంతసే పయినాక "ఈడు?" అనడిగింది.

"చెప్ప నన్నాడు"

"పోనీ —"

"మొగుడు లేని మని షంట"

ఎవరో "నువ్వేనోయ్" అన్నట్టయి గతుక్కుమంది గోవిందమ్మ.

సిగ్గుపడి అటుచూసింది.

ఆ అవస్థ గుర్తించి "గుట్టుగా కాలం గడుపుకుంటోం దంట. మర్మం యెరగని మన సంట. లేడిచూపు లంట. హంసనడక లంట. మొగం కలకల్లాడుతూ వుంటుం దంట; కాని చూద్దా మంటే మాత్రం యెప్పుడో కాని దొరక

దంట. సాధారణంగా వీధి మొగమే చూడ దంట" అని దండకం విడేసింది నారమ్మ.

దీంతో తేరుకుంది గోవిందమ్మ.

దిటవున్నా తెచ్చుకుంది.

"నారమ్మత్తకి తెలియ లేదు" అనిన్నీ ధృడపరుచుకుంది.

"అయినా వొక యుక్తి చేసి చూద్దాం" అనుకుని "ఎవరంటా వమ్మా?" అనడిగింది, తల మొగర వేసుకుంటూ.

"దేవుడికి తెలియాలి" అంటూ ప్రారంభించింది నారమ్మ, అంజలిబంధంతో ఆకాశం చూపిస్తూ.

"అలాంటి వగలాడి వొక్కర్తైనా యేమిటి, చాలా మందే వున్నా రీవూళ్ళో. నారాయణమ్మ అలాంటిది కాదూ? కల్యాణమ్మ, దుర్గమ్మ —"

"అది మొగుడు లేనిది కాదుగా!"

"ఆ మొగు డుండీ లేనివాడేగా!"

చూసిచూసి "అదిమాత్రం కాదమ్మా! గుట్టుగా పడి వుందా యేమి టది!" అనడిగింది గోవిందమ్మ.

"పోనీ, కృష్ణవేణమ్మ —"

"ఛా, మరగుజ్జు మనిషి"

"అచ్యుతమ్మ —"

"ఛూ, కొల్లేటికొంగ"

"పాపమ్మ —"

"వయసు మళ్ళిపోలేదుటమ్మా ?"

"ఇక ఫలానా అని యెలా చెప్పగలం!" అన్నట్టు నిరాశ కనపరచింది నారమ్మ.

నారమ్మ దృష్టి తనమీాద పడలే దని నిశ్చయించుకుంది గోవిందమ్మ.

ఆమె అమాయికత్వానికి జాలిపడింది.

తన గుట్టుకి గర్వమూ తెచ్చుకుంది.

ఇలాగ నిశ్శంక అయి, పక్కకి చూసి, తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు మధ్యమధ్య తల పంకించుకుని, అప్పుడు సావధానంగా నారమ్మ కేసి తిరిగి "మరేమిా చెప్ప లేదూ?" అనడిగిం దామె, తెలుసుకోవచ్చునన్నట్టూ, కాని గుర్తులు చాల వన్నట్టూ చూస్తూ.

ఇదంతా కనిపెడుతూనే వుండి "యిక రంగు మారుద్దాం" అనుకుని నారమ్మ మళ్ళీ అందుకుంది.

"అంత చక్కని కళ్ళు తా నెక్కడా చూడలే దన్నాడు నా కొడుకు, ఎప్పుడూ తాంబూలం వేసుకుంటున్నట్టే వుంటా యంట పెదిమలు —"

"తెలిసిపోయిం" 'దంటూ అవ్యవధానంగా యెగిసి పడింది గోవిందమ్మ "నారమ్మత్తని ఒకమాటాడిద్దాం" అనుకుంటూ.

"ఎవరు చెప్పారో చూస్తాను" అంది నారమ్మ అంతకంటే

పై మెట్టుకు వెళ్ళి.

"సుబ్బలక్ష్మి"

"ఊ"

"ఏమమ్మా!"

"చదువుకుం దంట మరి!"

"అయ్యో" అని చేతులు వేలవేసుకుంది గోవిందమ్మ.

తరవాత యిద్దరూ వొక్క క్షణం వూరుకున్నారు.

ఉండుండి "చెప్పవమ్మా" అంది గోవిందమ్మ.

"అది శరీరం కాదంట, కరిగించిన మేలిమిబంగారం గాని. అది మనిషి కాదంట, దేవకన్యక గాని"

"ఎవరమ్మా!" అనడిగింది గోవిందమ్మ, సంతోషం అణుచుకుంటూ.

చూసిచూసి ముందు "ఇలా వుందా నీవని!" అనుకుంది నారమ్మ.

"ఇక చూసుకో" అన్నట్టు తరవాత చురుగ్గా చూస్తూ "నా మీద దయలేకపోతే పోయింది, వొక్క మాటు ముద్దుపెట్టుకుంటా నంతే, ఆపాదా లివ్వకూడదూ పిన్నమ్మా?" అంటూ మహా యిదయిపోయాడు నా కొడుకు, చూడలేకపోయాను నే' 'నంది, పరితాపం నటిస్తూ.

సంతోషం పట్టలేకపోయింది గోవిందమ్మ; కాని అతి కష్టంమీద సమాళించుకుని, దగ్గు నటిస్తూ గర్భ మైని

పమిటికొంగుతో నోరుకప్పుకుంది ముందు.

వుబలాటం పట్టలేక, తరవాత, అలాగాఇలాగా చూస్తు న్నట్టు నటిస్తూ తన చక్కదనం అంతా చూసుకుంది.

కిందికి చూస్తూ ఆలోచిస్తున్నట్టు నటిస్తూ పాదాల చక్కదనం కూడా చూసుకుంది, చివరికి.

ముద్దుమాట జ్ఞాపకం రాగా గుటకలు మింగింది.

ఆమె యింకా యీ స్థితిలోనే వుండగా, తానదేమీ యెరగనట్టు "పెదవి దాటితే పృథివి దాటుతుం దన్నాడు; నా మీాద దయలేదే అనుకో, అయినా, ఆ మనిషి బతుకు నవ్వులుపాలు చేస్తే పుట్టగతు లుంటాయా!" అని కూడా అన్నాడు నా కొడుకు" అంది నారమ్మ.

అని పరీక్షగా చూసింది.

చూస్తుండగా గోవిందమ్మ కళ్ళు గి – ర్ – రున నిండి పోయాయి.

అది నారమ్మ చూసిపోతుం దేమో అని మళ్ళీ మొగం తిప్పేసుకుంది.

తిమ్మన్న యెడల గాఢ మైన ప్రేమా భక్తీ అంకు రించి అతని పాదాలు తలుచుకుని మొక్కుతున్నట్టు శిరస్సు వంచుకుంది.

అలాంటి తిమ్మన్నని చెట్టబడితే కలిగే సుఖాతిరేకం వూహించు కుంటూ కళ్ళు మూసుకుంది.

దానివల్ల కలిగే ఆనందాతిశయం అనుభవానికే వచ్చి నట్టు కాగా "నా తిమ్మన్న. నా రాజు" అనుకుంటూ పరవశ అయిపోయింది, చివరికి.

# 19

తాను వచ్చిన పని కిక అడ్డులే దని నిశ్చయించుకుంది నారమ్మ.

మొత్తానికి గోవిందమ్మ అమాయికురా లని తెలుసు కుని స్నిగ్ధ కూడా అయింది.

అయి "గొల్లదాన్ని మించింది గోవిందమ్మా, గోవిం దమ్మని మించింది గొల్లదీని" అనుకుని, గొల్లదానితో పాటు గోవిందమ్మ కూడా స్వాధీనపడితే తిమ్మన్నకి కలిగే ఆనందమూ, అందువల్ల తిమ్మన్నకి తన యెడల కలిగే ఆదరగౌరవాలూ వూహించుకుని పొంగిపోయింది.

అప్పటికి ప్రకృతిలో పడి, నారమ్మ తన గుట్టు కని పెట్టేసిం దేమో అని బెదరిబెదరి చూసింది గోవిందమ్మ.

అది గ్రహించి, తానింకా తిమ్మన్న మాటలే జ్ఞాపకం చేసుకుంటున్నట్టూ, అవే చెబుతున్నట్టూ, గోవిందమ్మ కూడా అవి వింటూ మాత్రమే వున్నట్టూ, మరే వికృతీ యెరగనట్టూ నటిస్తూ "నా కొడు కింకే మన్నాడో విన్నావా?" అంటూ ప్రారంభించింది నారమ్మ.

"ముసలిదానికి తన ధోరణే తనది" అనుకొని, ఎదురు తీరి "యేమన్నా" డనడిగింది గోవిందమ్మ.

"నేనేం పాపం చేసుకున్నానో నాకేసి చూడ్డమే మాను కుందా బంగారు బొమ్మ. వెనకజన్మలో యెవర్ని విడతీశానో యీా జన్మలో మన సిచ్చిన పెళ్ళాం చచ్చిపోయింది. ఎంతబతుకు బతికి తేయేమి లాభమూ? నా జన్మకీ రెండూ తీరని దుఃఖా" లని గోలపెట్టేశాడు నాకొడుకు"

అంతకితమే తనతో మాట్లాడి వుండడం జ్ఞాపకం చేసుకుని "యెప్పుడమ్మా" అనడిగింది గోవిందమ్మ.

"నిన్న మధ్యాహ్నం నాలుగ్గంటల వేళ తిరుపతమ్మ పంపిన పాయసం కోళ్ళకి పడేసి"

"మాయతిరపతమ్మ మూలాన చుక్కమ్మ జ్ఞాపకం వచ్చింది కామోను. ఆమనిషి కూడా అంచేతనే జ్ఞాపకం వచ్చిం దేమో?"

"ఆమని షెవరో, దాని వుద్దేశ మేమిటో గాని, చుక్కని లాగే దాన్నికూడా నెత్తిమీద పెట్టుకోక పోయాడా నాకొడుకు?"

"చుక్కమ్మని నే నెరగనూ? ఒకమాటు చెన్నాపట్నం వెళ్ళాడంట తిమ్మన్న. నాలుగు రోజుల్లో వస్తా నని చెప్పి పది రోజులదాకా రాలేకపోయా డంట. అప్పుడు చుక్క యెంత తపించిపోయిం దనీ?"

" అది బతికున్నంతకాలమూ మరో ఆడదాన్ని కన్నెత్తిచూా సెగునా నాకొడుకు? "

" దేవుడు చూడలేకపోయాడు."

" అది బతికున్నప్పుడు నాకొడుకోసం యెలాంటి మిటారికత్తెలు దారికాశా రని? ఎలాంటి పెద్దింటి కోడళ్లు రాయబారా లంపారనీ? "

" ఆ " అంది గోవిందమ్మ, చకిత అయి.

మొగంమీద మొగం పెట్టి, కంఠం కూడా నొక్కుకుని "ఇది విన్నావా మరీ? " అనడిగింది నారమ్మ.

" ఏమిటదీ? " అని గోవిందమ్మ కూడా అలాగే అడిగింది.

" మహారాణీలు దాని యెదట దాసీలకన్నా హీనం కాదూ? ఆ అందం, ఆవయ్యారం, ఆదర్జా, ఆసాహసం, చివరికి ఆసుఖం — "

" ఎవరమ్మా అదీ? "

" కింద నడవనిచ్చిందా నాకొడుకుని? అన్నవేళకి నాకొడుకు వెళ్ళకపోతే — "

" ఎవరో చెప్పవూ? " అంటూ గుంజేసింది గోవిందమ్మ.

" మొగుడు చచ్చి యేడా దయినా తిరక్కముందే — పెంచులయ్యగారి కోడలు — "

"కోదండమ్మా?"

"అవును"

"కోదండమ్మా!"

"ఏం, అంత అబ్బురపోతా వేం?"

"ఎప్పు డేనా విన్నా మా?"

"అవునా? అది మహారాణీల కందని యెత్తులు వేసింది. అంతఃపురంకంటే యెక్కువ సుఖా లనుభవించింది. మళ్ళీ మూడో కంటివాడికి —"

"దాని కా చూపున్నట్టే యెరగ మమ్మా. మొగు డుండగా —"

"మొగుడు సరిగా చూడకపోయినా అది పరాయి మొగాణ్ణి చూడ లేదుగదా? కాని, మొగుడు చచ్చిన ఆరుమాసాలకు తెగించింది. తరవాత బతికింది రెండు సంవత్సరాలే గాని దేవకన్యలకంటే యెక్కువగా అనుభవించింది.

"ఏమి చేసిం దమ్మా?"

"ఓః! ఓః!"

నారమ్మ వూగిపోయింది. గోవిందమ్మ కూచోలేక పోయింది.

"చెప్పవూ? చూశావా? చెప్పవుటమ్మా?"

"చెబుతానమ్మా, చేతులు విడిచిపెట్టు"

"మరి తొ౦రగా చెప్పు"

"ఊరుమాటుమణిగింది, అంతే. ఒక్కమాటు వచ్చి మాట్లాడివెళ్ళ మని — అయిదు పచ్చకాగితాలు — "

"అయిదు వందల రూపాయులే! " అంటూ గుండెల మీద చెయ్యేసుకుంది గోవిందమ్మ.

"చచ్చయిదు వందలు దాని కొక లెక్కంటే! నూరెకరాల మాగాణి, పాతికయకరాల కొబ్బరితోట, యిరవైయకరాల అంటుమామిడితోట, పదెకరాల బత్తాయితోట — చేతిలో రెండులక్షలు కరుకులు — ఇంటికి తానే పెద్ద — పిల్లా పీచా, మనిషి నచ్చాక యిక వెనకా ముందూ — "

"సరే, వెళ్ళాడా తిమ్మన్న? "

"దణ్ణం దణ్ణం అన్నా డంట "

గోవిందమ్మ నిశ్చేష్ట అయిపోయింది.

"నాచుక్కని మోసం చెయ్యలే నన్నా డంట"

గోవిందమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి.

"తరవాత సంవత్సరం తిరక్కుండానే పోయింది చుక్క. ఆసంవత్సరం అంతా నిద్రాహారాలు మానేసి మంచం పట్టాడు నాకొడుకు "

"పా — పం"

"కొడుకున్నాడా యేమయిపోతాడో అని అంజమ్మప్ప

వాళ్ళకేం గోల"

"అబ్బాయా? ఒక్కగా నొక్క కొడుకు. రాచ కుమారుడికంటే ఎక్కువ"

"భూములు పాడయిపోతున్నా యనీ, కుర్రాళ్ళు బెంగపెట్టుకున్నా రనీ కావలసినవాళ్ళు నలుగురూ పోరగా పోరగా, చివరికి మా అంజమ్మప్ప వస్తూవుండుకోగా-"

"ఎంత చిక్కిపోయాడో?"

"కంప అయిపోలేదూ?"

"ఎన్నాళ్ళకి కోలుకున్నాడో మళ్ళీ?"

"అయితే మాత్రం, ఆ అందం — "

"పోలేదేం?"

"పొలం వెడుతున్నా డని తెలియగానే మళ్ళీ వెంట పడలేదూ కోదండమ్మ?"

"మరిచిపోలేదు చూశావా?"

"మరెవరి నయినా చూసుకుందా పోనీ?"

"ఎవరూ చెప్పలేదే దత్తా"

"చూసుకుంటేనా చెప్పడానికి? అసలు, తిమ్మన్నని చూసిన కళ్ళకి నచ్చే మొగా డెవడే మన వూళ్ళో?"

"మళ్ళీ నోట్లు పంపిందా?"

"తానే బయలుదేరింది, మరి పంపడం ఎందుకూ?"

"అయ్యో, నలుగురికీ తెలిస్తే — "

"తెలుస్తుందేం? మరి తెలిసిందా?"

"లేదత్తా"

"మహా గుట్టయిన మనిషి. చేసిన వన్నీ దేవతా పనులే; కాని రుద్రుడి కేనా తెలవనిచ్చేది కాదు"

"నిజమే, కోరిక వుండగానే సరికాదు, నేర్పూ వుండాలి"

"మరి, నేర్పులేనివాళ్లు?"

మిడుతూ మిడుతూ చూసింది గోవిందమ్మ.

"కోరిక వుండీ నేర్పు లేనివాళ్లు — ?" అని మళ్ళీ రెట్టించింది నారమ్మ.

"లోపల్లోపల కుమిలి — "

"తప్పమ్మా, తప్పు. ఇక్కడ కుళ్ళి చచ్చినవాళ్లకి అక్కడా పురుగుల గుంటలేనే"

జలదరించుకుంది గోవిందమ్మ.

"ఈలోకంలో పుట్టడం — "

"మరి పురాణాలు వింటాం గదా!"

"అన్ని పురాణాలు చెబుతారు గదా, మరి అయ్యవార్లంగారు — "

"పనిమనిషికి కాళ్లు పిసుకుతాడంటమ్మా"

"తేలిపోయింది గదా?"

"లేకపోతే, వయస్సులో యిన్ని అంతసులేమిటీ మరి!"

"కనక, మరి చెప్పు. కోరిక వుండీ నేర్పు లేనివాళ్లు!"

"నువ్వే చెప్పవమ్మా" అంటూ గునిసింది గోవిందమ్మ.

"నమ్మి, నేర్పున్నవాళ్ళ నాశ్రయించాలి"

ఇలా అని, చూసిచూసి "అవునా?" అనడిగింది నారమ్మ.

"అవు" నంది గోవిందమ్మ, అప్రయత్నంగా.

"కోదండమ్మ, తానే నేర్పు కలది కనక — దానికున్నంతనే ర్పివుళ్ళో మరెవరి కుంది తల్లీ?"

"అలాగేం?"

"ఆవేళ, జట్కాబళ్లకోసం పదిహేను రూపాయలు వెదజల్లేసింది, మరి చూసుకో"

"ఊళ్ళో కాదుటమ్మా?"

"తిమ్మన్నతో మాట్లాడ్డం వూళ్లోనే; కాని రాజమహేంద్రవరంనుంచి వచ్చేది"

"వివరంగా చెప్పవమ్మా"

"పుష్కరాల పేరుచెప్పి ముందు రాజమహేంద్రవరంలో మకాంపెట్టింది"

"అలా చెప్పవమ్మా" అని తలపంకించుకుంటూ వూపిరి తీసుకుంది గోవిందమ్మ.

"ఆయేడు యిరవైరోజు లున్నాయంట పుష్కరాలు"

"అవు, నవును"

"బసు వేసి వుండమని, వొక జట్కా అప్పగించి వూళ్లో

వుంచిందంట చాకలిమల్లిని"

"మల్లినా!"

చకిత అయి, ముక్కుమీద వేలేసుకుని యిలా అడిగింది గోవిందమ్మ, తల తాటించుకుంటూ.

"పైకెంత వెర్రిదో లోపల అంత మైప అది రొమ్ము తెరుగుదురూ!"

"చి – త్రం"

"అయ్యవార్లంగారికి ఆపనిమనిషిని – "

"మల్లే!"

"కాపుమీద వుండేటప్పుడు తోటలో వుండడానికి ముద్దులు మూటకట్టే ఆశాలా వేయించుకున్నాడు కాదూ నాకొడుకూ?"

"అవునంట"

"ఆమేకు విరక్కాసేసిం దంట తోట. వంట తయారయేటప్పటికి పుస్తకాలు వచ్చి ముంచి ధర పలికిందంట. రాత్రీ పగలూ తోటలోనే ఉంటుంది అంట తిమ్మన్న"

"ఇదంతా కనిపెట్టి వెళ్ళి గోదండమ్మని తీసుకు వచ్చిం దన్నమాట నాల్లి"

"నిసిరాత్రంట. అమావాస్యచీకటికి వానాకుం ముసురంట"

"చూశావా, మొగాడేనా యిల్లు కదలగలడా!"

"మొగా డేమిటి ఆడ దేమిటి, ధైర్య సాహసా

లుండాలి గాని"

"నిజమే"

"నిద్రపట్టక యేదో ఆలోచించుకుంటూ పడుకుని వున్నా డంట తిమ్మన్న. "తిమ్మన్నదొరగారూ" అని పిలుస్తూ మెల్లిగా తలుపు కొట్టిం దంట మల్లి"

"మళ్ళీ పచ్చకాగితాలు మీద పడెయ్యడమేగా దాని పని?"

"కాదంట"

"మరేం చేసిందీ?" అనడిగింది గోవిందమ్మ, అలస్యం చెయ్యకన్నట్టు చూస్తూ.

"ఉలిక్కిపడి, లేచి దీపం పెద్దది చేసి, తలుపు తీశా టప్పటికి, పట్టుచీర కట్టుకుని, వొంటెడు నగలూ పెట్టుకుని, మేలి ముసుగువేసుకుని కోదండమ్మ-"

ఇంతమాత్రమే చెప్పి పెదిమలు బిగించుకుని "తెలిసిందా?" అన్నట్టు చూసింది నారమ్మ.

గోవిందమ్మ చకిత అయింది.

వివశ అయింది.

చివరి కామె చూపుల్లో ఈర్ష్య పొటమరించింది.

అది గుర్తించి "కోదండమ్మ అచ్చంగా దేవకన్య. దాని అందం వెథవరికం వచ్చినా -"

అని నారమ్మ మాట సగంలో వుండగా "చెడలేదు.

ఎక్కువకూడా అయింది" అంది గోవిందమ్మ.

అన్యవధానంగా "మరి నీ సొగసు?" అని నిపలతీసింది నారమ్మ.

గోవిందమ్మ కళ్లు తళుక్కుమన్నాయి.

"మరి నీ సొగసు మాత్రం తక్కువదా తల్లీ? ఇప్పటి సొగసే సొగసు కాని, పెనిమిటి వుండినప్పటి సొగసేం సొగసు తల్లీ నీదీ? నువ్వప్పుడు లేత తామర మొగ్గవి"

సిగ్గుపడి అయినా పొంగుపోతూనే మొగం వంచుకుంది గోవిందమ్మ.

"నువ్విప్పుడు అరవిచ్చిన తామరపువ్వానివి కావుటమ్మా తల్లీ?"

ఇలా అని బుగ్గలు నిమురుతూ నారమ్మ మెప్పుగా చూడగా "ఏమి లాభం అత్తా? ఎందుకట్టె నయిపోయి వున్నా నిప్పుడు" అంది గోవిందమ్మ, మొగం వేలవేసుకుని.

"లాభమూ నష్టమూ అలా వుంచు. ప్రయోజనం లేకపోతే మాత్రం వున్న సొగ సేమయిపోతుందీ? ప్రయోజనం కలిగించుకోలేకపోతే అది నీ తప్పు గాని, నీ సొగసు తప్పేమి వుందీ అందులో? కాకపోయినా మా తిమ్మన్న వంటివాడు కనిపెట్టగలడు గాని నీ సొగసూ, నీ వయ్యారమూ నీ కేమి తెలుస్తాయీ!"

దంతక్షతం లాగ మురుపూ మరుపూకూడా కలిగించిం

దీ మాట గోవిందమ్మకి.

దాంతో, ఆ దైన్యం పోయి, టార్చిలైటు గప్పు మన్నట్టా మె మొగం మళ్ళీ విప్పారింది.

అది చూసి "యింతెందుకూ? నన్ను వెళ్ళిపోనియ్యి. సిగ్గుపడిపోతున్నావు గనక యీ రాత్రి యెలాగో గడుపు. రేపు మధ్యాహ్నం దాకా వూరుకోక పొద్దున్నే చక్కగా బర్మ్మముడి వేసుకో. కంఠస్నానం చేసుకో. పట్టుచీర కట్టుకో. మొగం దిద్దుకో. తరవాత అద్దం యెదుట నుంచో. నా మాట అబద్ధమో నిజమో అప్పుడే నీకు తెలుస్తుంది" అంది నారమ్మ.

చిరునవ్వు నవ్వుకుంది గోవిందమ్మ మొగం వంచుకుని.

మళ్ళీ అవ్యవధానంగా అందుకుని "వెర్రిపిల్లా, తిమ్మన్న యెదట నుంచోలే నని నువ్వు బెదురుతున్నావు గాని, యిలాగే చిరునవ్వుతో అరగంట చూస్తూ నువ్వు నుంచుంటే నీయెదట నుంచోలేక తిమ్మన్నే సిగ్గుపడి పోతాడు తెలుసా!" అనడిగింది నారమ్మ, కవ్విస్తూ.

నారమ్మ వొక్కటొక్కటే చెయ్యమన్నప్పుడా వొక్కటొక్కటీ తాను చేస్తున్నట్టే అనుకుని, నారమ్మ చెప్పినట్టు తిమ్మన్న తనయెదట నుంచుని వున్నట్టున్నూ భా[illegible] [illegible], యీ భావన యింకో మెట్టు పైకి వెళ్ళగా లజ్జావివశ అయిపోయింది గోవిందమ్మ.

# 20

ఉండుండి పయ్యెర వొక్క విసురు విసిరింది.

ఆ విసురుకి రాచపురిసిరికొమ్మ లూగిపోయాయి.

ఆ వూపుతో పండుటాకులు గోవిందమ్మమీదా నారమ్మమీదా వొత్తుగా పడ్డాయి.

దాంతో గోవిందమ్మ ప్రకృతిలో పడింది.

అందుకోసం యెదురుచూస్తున్న నారమ్మ గభీమని అందుకుని "తరవాత దేవుళ్ళాడ్డం తప్ప, బుద్ధి పుట్టాక ఆలస్యం చేసుకోడం యేమి తెలివి తల్లీ!" అనడిగి, కళ్ళల్లోకి చూస్తూ వొక్కక్షణం ఆగి, దాంతో గోవిందమ్మ కంగారుపడిపోకుండా పూర్వాపరాలు కలుపుకుంటూ "అంచేత యిక పుష్కరాలు వస్తా యనగానే పతకాలు వేసుకొక్కచుం దంట కోదండమ్మ. రాజమహేంద్రవరం ప్రవేశించిన రాత్రే మొదలంట యిది. ఆ యిరవై దినాలూ వూరు మాటుమణిగాటప్పటికి తోటకి రావడ మంట. మళ్ళీ కోళ్ళు కూస్తా యనగా రాజమహేంద్ర వరం చేరుకోడ మంట" అంది నారమ్మ.

మొదటి మాటతో అధీర అయి, వెంటనే తరవాతి మాటలతో ధీర అయి, చివరికి ధీరాధీర అయి "సరమాన వుడు కనిపెట్టగలడా?" అనడిగింది గోవిందమ్మ, వింత

కనపరుస్తూ.

ఆ వింతమాటుక, గోవిందమ్మ చూపుల్లో, అలాంటి సుఖానికి ఎదురుచూపు కనపడింది నారమ్మకి.

చూసిచూసి అంకుకుందామె.

"ఏమిటేమిటో ఫలహారా లంట, సర్బత్తులంట, సర్బత్తులు. రకరకాల పళ్ళంట. పువ్వులంట. గంధా లంట. అత్తరు లంట. అగరొత్తు లంట —"

"తాంబూలా లంట. అవునా?" అనడిగింది గోవిందమ్మ, సిగ్గుపడుతూ.

"అదిగదీ. చూశావా? సొగసులాడివి నీకు తెలియందేముందీ? నాకది జ్ఞాపకమే లేకపోయింది. అన్నీ వుండీ అవి లేకపోతే యేమి సుఖమూ? కనక, అవీ నంట. మళ్ళీ తెల్లవారు జామున వేన్నీళ్లు కాపించుకుని నబ్బులతో స్నానం చేసి, చాకింటి మడతలు కట్టుకుని —"

"గంధపుష్పాలు కనపడకుండానూ, అత్తరు పరిమళం వుండకుండానూ, కదూ?"

"అవు నమ్మా అవును. కాని యింతేనా?"

"ఇంకేమి చేసే దత్తా!"

"జట్కా దిగి రాజమహేంద్రవరంలో దొడ్డికుమ్మాన తన బసలో ప్రవేశించడ మంట. ఒక్కక్షణం అయినా నడుము వాల్చకుండా, అరటిపళ్లూ కొబ్బరికాయలూ,

బత్తాయిపళ్లూ, పసుపుకుంకుమలూ, హారతికర్పూరమూ, పువ్వులూ — ఇలాంటి వన్నీ బుట్టలతోనూ పళ్ళేలతోనూ పుచ్చుకుని, వీధిగుమ్మాన మళ్ళీ జట్కా యెక్కి, గోదావరి రేవురేవునా స్నానాలు చేసుకుని ప్రతీ గుడికీ వెళ్ళి మొక్కులు చెల్లించుకుని, తూర్పు తెల్లవారుతోందనగా మళ్ళీ బసకి చేరుకోడమంట ''

''ఏమి మనిషమ్మా కోదండమ్మా! ఒక్క రాత్రి నిద్ర తక్కువయితే — ''

''నిద్ర తక్కువ యేమిటీ? బసకి చేరీ చేరడంతోనే తలకి సాంబ్రాణి పొగవేసుకుని వేడివేడి కాఫీ పుచ్చుకుని కమ్మగా నిద్రపోవడం. ఏ వొంటిగంటకో లేచి రాజా భోజనం చేసి, మళ్ళీ నిద్ర. చీకటి పడీపడగానే భోజనం చేసి రాత్రి తెల్లవార్లూ — ''

''ఆనందంలో తేలిపోవడ మంట'' అంది గోవిందమ్మ, కులుకుతూ.

''కాక దాని కేమి తల్లీ! ''

''నిజమే'' అనుకుంది గోవిందమ్మ, మొగంవంచుకుని.

''ఇంతకీ: దానిపుణ్యం యెలాంటిదో చూశావా?''

గోవిందమ్మ మొగం పైకెత్తుకుని చూసింది.

''ఆ యిరవై దినాలూ రాత్రిళ్ళంతా మునుగ్లంట. పగలంతా యెండ లంట''

"శాబాసు" అంది గోవిందమ్మ, చమత్కృత అయి.

"ఇదే మంత గొప్ప సంగతే మాతల్లీ!"

"ఇంకేమి చేసిం దమ్మా?"

"ఇంకో నెల్లాళ్ళు పోయాక, కాశీయాత్ర పేరు చెప్పి వెళ్ళి రెండు మాసాలు కలకత్తాలో మకాం పెట్టిందంట"

"మరి తిమ్మనో?" అనడిగింది గోవిందమ్మ, సిగ్గు తెమల్చుకుంటూ.

"సడే"

"ఏం?"

"శాస్త్రం చెప్పినట్టుంది నీప్రశ్న"

"ఏమమ్మా?"

"పెళ్లికి వెడుతూ పెళ్ళికొడుకుని మరిచిపోతారా ఎవరైనా?"

"వెంటబెట్టుకునే వెళ్ళిందా?"

"వారంరోజులుకి ముందే పంపివేసిం దంట, నిమ్మ కాయల వ్యాపారం పేరు చెప్పి, బసా గట్రా కుదిర్చి వుంచడానికి"

"ఎంత మెళుకువో చూశావా?"

"కాక?"

గోవిందమ్మ మిడుతూ మిడుతూ చూడగా, నారమ్మ ప్రశ్నార్థకంగా చూసింది.

గోవిందమ్మ ఆచూపులు భరించలేకపోగా, నారమ్మ చూస్తూ వూరుకోలేకపోయింది.

"ఆనెలరోజులూ పార్టీ లంట మొవళ్ళో పార్టీలు. వాళ్ళ వేషం వేసి దాని వాలకమే మార్చేశా డంట నాకొడుకు"

"పార్టీ వేషం అంటే?" అనడిగింది గోవిందమ్మ, తానూ ఆసరదా తీర్చుకోవచ్చు ననుకుంటూ.

"రంగురంగుల చీరలంట. జాకెట్లంట. అన్నీ పట్టువీ జరీ ముద్దలూ నంట నెత్తిమీద, సగానికి, వయ్యారంగా ముసుగంట. కాళ్ళకి దొరసాన్ల జోళ్లంట"

"ఎంత సొగసు వచ్చిందో?"

"వేషం పూర్తిచేసి చూసి, అది కోదండమ్మ అని నాకొడుకే నమ్మలేకపోయా డంట"

ఓరచూపులు చూస్తూ ఆ వేషం భావించుకుని, ఆవేషంలో తాను తిమ్మన్న యెదట వుండినట్టు భావించు కుంది గోవిందమ్మ.

భావించుకుని సిగ్గుపడింది.

అదేమీ యెరగనట్టు నటిస్తూ "అయిదు వంద లిచ్చి ఆనెల్లాళ్లూ షోకైన మోటారు కుదుర్చుకున్నా రంట. మేడ అద్దె నెలకి నాలుగు వందలంట. అందులో పడుకునే కుర్చీలంట. వాలుడు కుర్చీలంట. వూగుడు కుర్చీలంట.

తిరుగుడు కుర్చీలంట — వింతవింత బల్లలంట. వాటికి కనీవినీ ఎరగని పరుపు లంట. మంచం పూలవిమానమే నంట. చంద్రబింబా లంట దీపాలు. చక్రాల వినసకర్ర లంట. ఓలమ్మో, స్నానాలగదంటా — "

ఇలా అంటూ ఆగిపోయి, కళ్లు తేలవేసుకుంటూ వూగిపోయింది నారమ్మ.

అంతమాత్రం వినే దాని స్వరూపం భావించుకుని గోవిందమ్మ ముగ్ధురా లైపోయింది.

"తెల్లవారా టప్పటికి ఘుమఘుమలాడుతూ టీ అంట రాజాటీ. తరవాత కమ్మగా నిద్రంట. పదకొండు గంటల ప్రొద్దెక్కాక లేచి స్నానా లంట. హోటేలునుంచి వచ్చే దంట భోజనం. పూటకి అయిదు రూపాయ లంట మనిషికి.

"అమ్మ బాబో!" అంటూ గుండెలు కొట్టుకుని "వొక్క-భోజనాని కిద్దరికీ యిరవై రూపాయలే రోజుకి?" అనడిగింది గోవిందమ్మ.

"కప్పు పావలా అంట టీ. పళ్ళెం అర్ధరూపా యంట ఫలహారం. అది రకరకా లంట. పుచ్చుకున్న రకం మళ్ళీ ఎరగిరంట"

గోవిందమ్మ నోరూరింది.

పైటకొంగుతో నోరు తుడుచుకునే అందుకుంది నారమ్మ.

"భోజనా లయినాక మళ్లీ నిద్రంట. మూడుగంటలకు ఫలహారా లంట. ఆపళంగా మోటూ రెక్కడం అంట. అవి బజార్లు కావంట. అవి వీధులు కావంట. అవి తోటలూ దొడ్లూ కావంట. మూజియా లంట. నాటకా లంట. సినీమాలంట. పాటసభ లంట–"

"ఎన్ని వింతలు చూశారో?"

"ఎన్ని వింతలు చేశారో!"

కళ్లు తిప్పుకుంటూ నారమ్మ యిలా అడగ్గా, మొగం తిప్పుకుని గోవిందమ్మ గుటకలు మింగింది.

"రాత్రి తొమ్మిదింటికి బసకి రావడం అంట. అప్పుడు స్నానా లంట. భోజనా లంట –"

ఇలా చెప్పి తల ఆడించుకుంటూ ప్రశ్నార్థకంగా చూసింది నారమ్మ.

భావనలో పడి గోవిందమ్మా, ఆమె యింగితం కని పెడుతూ నారమ్మా వొక్క క్షణం మౌనం వహించారు.

## 21

ఊరుకుని వూరుకుని, తటాలున యిద్దరూ వొక్క మాటే చూసుకున్నారు.

చూసుకుని చూసుకునిన్నీ "తరవాతా–" అంటూ యిద్దరూ వొక్కమాటే అందుకున్నారు.

ఆ ప్రథమవేగం యిద్దరూ కూడా నిగ్రహించుకోలేకే పోయారు; గాని "అయితే యేమిజరిగిం "దీ" అని గోవిందమ్మ ముందుకి వెళ్ళగా "యేమి జరిగిం" దా" అని నారమ్మ వెనక్కి- నచ్చింది.

"తెల్లవారాక యిక కాశీ వెళ్ళిపోడం—"

"అప్పుడే?"

ఎంతో బాధగా అడిగింది గోవిందమ్మ, యీప్రశ్న.

అది చూసి నారమ్మ "అదిగో, అదీ వరస. నేను చెప్పలేదూ? వయస్సే తల్లీ, వయస్సే. "కాశీ వెళ్ళి చక్కగా యాత్రలు చేసుకోక కలకత్తాలో యింకా యెన్నాళ్లూ?" అనిపిస్తోంది నాకు. "అలాంటి సుఖం విడిచిపెట్టి కాశీవెళ్ళడం అప్పుడేనా?" అనిపిస్తోంది నీకు. ఎంత వ్యత్యాసమో చూశావా?", అనడిగింది నారమ్మ.

"మరేం లేదమ్మా! వెళ్ళడాని కెన్నాళ్ళుబలాటపడ్డారో, వెళ్ళాక యెన్ని ప్రయత్నాలు చేసుకున్నారో, చేసుకున్నవి నాలుగో వంతయినా అనుభవించారో లేదో—"

"ధర్మమే నే తల్లీ! ఈ వయసులో నాకెందుకూ అవీ? ఆ వయస్సులో నీకు లేకపోతే యెలాగా అవీ? ఈ భేదం చూపించడాని కన్నాను గాని — ఇంతకీ: యాత్ర పేరు చెప్పుకుని యిందుకోసం వెళ్ళారు గాని —"

"మరే, మరే, అదీ నే ననడం"

"ఎవరన్నా అదే, నేను మాత్రం మొగనూ తల్లీ! అలాంటప్పుడు విడిపోవడం యెంత కష్టమో? కనకనే తెల్లవారితే కాశీ వెళ్ళిపోవడ మనగా, రాత్రంతా వొకటే యేడుపంట కోదండమ్మ"

"ఏమనో?"

"బతుకున్నన్నాళ్ళూ యిక్కడే వుండిపోదా మని వొక మాటంట. "నాతో బాటు కాశీ వస్తే గాని వొప్పుకో" నని వొకమా టంట." "నీ చేతుల్లో పీక పిసికి చంపెయ్యి" మని వొకమాటంట. "కాశీ వెళ్ళాక గంగలో దిగనారిపోతాను గాని మరి యింటికి రా" నని వొకమాటంట. "పోనీ, మరో నెల అయినా యిక్కడ వుండి పోదాం" అని వొకమాటంట. వొక నెలరోజులు బొంబాయిలో కూడా వుండాంవస్తావా మరి!" అని —"

"బొంబాయి కూడా వెళ్ళారటనా!"

"అనుకున్నారు గాని సాగలేదు"

"పాపం"

"చివరికి, వారాని కోరాత్రి తన మేడకి వస్తా నని తిన్నన్న చేత చేతిలో చెయ్యి వేయించుకని, అప్పటికి మనస్సు సరిపెట్టుకుం దంట"

"ఊహూ"

"గుడికి మేక వెళ్ళినట్టు వెళ్లిం దంట కాశీ"

"డబ్బేమాత్రం —"

"కలకత్తాలో యెనిమిది సంచులు —"

"తిరుస్తున్నాకి — "

"సరే, కలకత్తానుంచి వచ్చాకే కాదూ, పాత యిల్లు పడగొట్టించి బుల్లి బుల్లాలి మేడ వేయించుకు న్నాడూ నా కొడుకు?"

"చూశాను, చూశాను, ముద్దులు మూటకడుతోంది"

"లోపలికి వెళ్ళావా?"

"ఏం పనీ నాకు?" అనడిగి "యిక వెళ్ళకుండా వుంటానా?" అని మనస్సులో అనుకుంది గోవిందమ్మ.

అనుకుని, మొగమున్నా పక్కకి తిప్పుకుని "ఇప్పటికి నా బతుకంతకీ మూడు సంచుతే వున్నాయి. నెలకే నాలుగు సంచులు గుమ్మరించిన కోదండమ్మతో సుఖం చిం తీర్చుకున్నాకి మన సిచ్చెయ్యడం తప్ప నే నేమి ముచ్చటలు తీర్చగలనూ?" అనిన్నీ కించపడింది.

దీంతో, ఆమె మొగం చిన్నబోయింది.

అది గ్రహించింది నారమ్మ.

"నా కొడుకు గుణం కనిపెట్టావా?" అంటూ వెంటనే బుజుకొట్టి గోవిందమ్మ దృష్టి ఆకర్షించుకుని "అంత డబ్బిస్తున్న కోదండమ్మ నెలా చూశాడో, సామాన్య సంసారి గొల్లదాన్నీ అలాగే చూస్తున్నాడు నా కొడుకు.

వాళ్లు మన సిచ్చారు, నా కొడుకూ మన సిచ్చేశాడు. ప్రేమ వుంటే డబ్బెందుకూ? ప్రేమ కనపడకే గాదూ తిరపతమ్మని పోపొమ్మన్నాడూ? మనసు ప్రధానం కాని డబ్బు కాదమ్మా నా కొడుక్కి" అంది కళ్ళు తిప్పుకుంటూ.

"సరే గాని, యింటికి వచ్చాక, అన్నప్రకారం కోదండమ్మ యింటికి —"

"దాని మేడకి నా కొడుకూ వెళ్ళేవాడు, నా కొడుకు మేడ కదీ వచ్చేది"

"తిమ్మన్న మేడకే?" అనడిగింది గోవిందమ్మ చకిత అయి.

"కాకేం?" అంటూ అందుకుంది నారమ్మ.

"ఊళ్ళో యెక్కడయినా హరికథ చెప్తారంటే — భాగవతం ఆడారంటే — బొమ్మలాట జరిగిం దంటే అది నా కొడుకు మేడకి వచ్చిందన్నమాటే. రాజమహేంద్రవరంలో నాటకం ఆడా రంటే, సినీమాల్లో ఆటలు, మూరాయంటే అది నా కొడుకు బత్తాయితోటలో మకాం వేసిందన్నమాటే"

"అవెక్కడి ధైర్యసాహసాలమ్మా!" అంటూ బుగ్గలు నొక్కుకుంది గోవిందమ్మ.

"నా కొడుకు 'మేడలో దిగిననా డేమి చేశెంచో —"

"పీటలమీద కూచుంటా నందా?"

"తోచలేదేమో కాని అంతపనీ చేసేదే అది. ఏమి చేసినా ఎవరికీ తెలియకూడదంటే. దాని వ్యూహాలూ, దాని పన్నాగాలూ, దాని తెగింపూ, దాని సరదాలూ, దాని అనుభవాలూ – వోః!"

ఇలా అంటూ వూగిపోయింది నారమ్మ.

ఇదంతా విని గోవిందమ్మ తాదాత్మ్యం పొందింది.

ఆమె మనస్సు ఏ అనంతపథాల్లోనో విహరించింది.

ఆమె ఆశలు ఏ ఉన్నతోన్నతశిఖరాలమీదనో పాకిపోయాయి.

ఆమె ఆత్మ యే దుర్లభపదార్థంలోనో లీనం అయిపోయింది.

అది గ్రహించి "విన్నావా?" అంది నారమ్మ.

ఉలిక్కిపడి "యేమిటి" అనడిగింది గోవిందమ్మ.

"ముహూర్తం రెండుదినాలుండనగా పానకాల నరసన్నకి మొక్కుబడి చెల్లించుకుంటానంటూ మంగళగిరి వెళ్ళిపోయింది కోదండమ్మ"

"వెళ్ళి?"

"ముహూర్తంనాటి రాత్రి పదకొండు గంటలికి రాజమహేంద్రవరంలో రైలు దిగింది"

"దిగి?"

"కలకత్తా వేషం వేసుకుని వన్నెం డయాటప్పటికి

అద్దెకారుమీద వూళ్ళోకి వచ్చింది''

"వచ్చి?''

అంతకంత కుద్వేగం యెక్కువ కాగా, సకలమూ మరిచి నెమిలిపిట్ట కేక వేసిన ట్టడిగింది, గోవిందమ్మ.

"మేడ యెక్కేసింది''

గోవిందమ్మ స్తబ్ధ అయిపోయింది.

"జనం'' అని మాత్రమే అనగలిగింది, అవ్యవధానంగా.

"మేడమీద ఒక్కపిట్ట అయినా వుండకుండా మొదటే యేర్పాటుచేశాడంట నా కొడుకు. "ఇదిగో నీ మేడ పరీక్ష చేసుకో'' అన్నాడంట నా కొడుకు. "నేను నీదాన్ని కానూ'' అందంట కో —''

"నీకో —''

"అవును నా కోడలే, కాకేం? దేవుడి కింకా దయ రాలేదు గాని —''

"వచ్చివుంటే తిరపతమ్మ మాత్రం నీ కోడ లయి వుండకపోవునా ?''

"వెర్రిపిల్లా'' అంటూ గోవిందమ్మ నిట్టే కౌగలించుకుని "మాట యిట్టే తిప్పేస్తావు దాని మీదికి'' అని వాకమాటు ఔల్లిన్తూ చూసి "కావలిసిందే పెంకిలంజెకి'' అని వళ్లుకూడా వాకమాటు పటపట్లాడించి "దాని అడ్డు యెప్పుడో వదలిపోయిందిగా? అయితే, కోదండమ్మ

యేమందో యెరుగుదువా?" అనడిగింది నారమ్మ.

"ఏమందీ?"

"పునను పుట్టిన వెంటనే మేలుకున్నాను గాని లేక పోతే —"

"అదీ నిజమే నమ్మా"

అంటూనే పక్కకి చూసి ఏమిటో అనుకుంటూ తల వంకించుకుంది గోవిందమ్మ.

ఆమె భావన పూర్తి అయేదాకా వూరుకుని "తర వాత, కోళ్లుకూస్తా యనగా తిమ్మన్నని తీసుకుని బత్తాయి తోటకి వెళ్ళిపోయిం దంట" అంది నారమ్మ.

చకితై అయి "అక్కడి కెందుకమ్మా!" అనడిగింది గోవిందమ్మ, ఉద్వేగంతో.

"అక్కడ వేషం మార్చేసుకుని ఆ కారే యెక్కి —"

"తెల్లవారుజామున రెయిలు దిగి రాజమహేంద్రవరం నుంచి వచ్చినట్టు —"

"కాకులు కూశాటప్పు డింటికి చేరుకుం దంట"

గుండెలు కొట్టుకుని "యెంత నేర్పో చూశావా!" అంది గోవిందమ్మ.

"కనకనే అనుభవించింది" అంది నారమ్మ.

చూస్తూండగా, దీపం దిగతీసేసిన ట్టయిపోయింది గోవిందమ్మ మొగం.

నారమ్మ అది గుర్తించి పోతుందేమో అని "ఎందుకూ? నడమంతరం చావయిపోయింది పాపం" అంది గోవిందమ్మ, కోదండమ్మ అకాలమరణానికి పరితపిస్తున్నట్టు.

"అవునవును, మరి మూణ్ణెల్లకే గాదూ, వద్దు మొర్రోమని తల్లి యెంత మొత్తుకుంటున్నా వినక, వుండంటి చలికాలంలో భద్రాచలం వెళ్ళి మన్యంజ్వరం తెచ్చుకుని మొగిరిపోయిందీ, పువ్వులాగా?" అంటూ నారమ్మ కూడా అంతకంటే యెక్కువ విచారం నటించింది.

నటించి, వొక్క క్షణం వూరుకుని "అయితే, పెత్తనం వచ్చాక బతికింది రెండేళ్ళే అయినా మహారాణీలాగ బతికింది" అందామె తృప్తి కనపరుస్తూ.

"లేకపోతే దాని ప్రాణం యెంత కొట్టుకునోన్?" అంది గోవిందమ్మ.

"కొట్టుకోదూ, నిండుప్రాణం?"

ఇద్దరూ మళ్ళీ వొక్క క్షణం మౌనం వహించారు.

ఉన్నట్టుండి "యేమయితే యేమి? కులంమనిషితో స్నేహం చెయ్యడానికి నాకొడుక్కి సెలవిచ్చింది గొల్లపిల్ల. కాని ఆమనిషి యెవరో మాత్రం తెలియడం లేదు" అంది నారమ్మ, నిరాశలో ఆశా, ఆశలో మళ్ళీ నిరాశా కనపరుస్తూ.

"అదే వచ్చింది చిక్కు" అని గోవిందమ్మ, ఆవుకోసం

పాకవైపు చూస్తున్నట్టు నటిస్తూ "కనిపెట్టలేకపోయిందె నారమ్మత్త" అని సగర్వంగా నవ్వుకుంది, లోపల్లోపల.

చూసి చూసి "మరి పోతా" నంటూ లేచింది నారమ్మ.

"వెడతా నంటావా?" అనడుగుతూ తానుకూడా లేచి "భోజనాని కున్నావు గాదు......పోనీ, రేపు మాత్రం తప్పదు సుమా" అంటూ నారమ్మని పొదువుకుంది గోవిందమ్మ.

"తప్పకుండా వస్తా నమ్మా" అని గోవిందమ్మ మొగం నిమిరింది నారమ్మ.

ఇద్దరూ అడుగు వేశారు.

## 22

"రేపు తప్పదు" అనుకుంది నారమ్మ.

"నారమ్మత్త రాయబారమే తెచ్చివుంటేనా!" అనుకుంది గోవిందమ్మ.

ఊహూహాలకు తగ్గ కల్పనలతో యిద్దరూ ముందుకి నడిచారు.

వసారా గుమ్మం దగ్గిరికి వచ్చాటప్పటికి "దాటిపోతోంది, నారమ్మ కాళ్లు పట్టుకో" మని మనస్సు తొందరపెట్టగా "అత్తోయ్" అంటూ ముందు తాను నిలిచిపోయి, తరవాత రెక్కపట్టుకుని నారమ్మనికూడా

నిలిపేసింది గోవిందమ్మ; కాని "నిదానించుకో. ఆమనిషి నువ్వేట అని ముందు నారమ్మచేత అనిపించుకో. ఇవాళ కాకపోతే రేపయినా అని తీరుతుంది, తొందరపడిపోకు" అని బుద్ధి మందలించగా, అదే బాగుం దనుకుని నాలుక చివరికి వచ్చిన మాట మార్చేసి "మనం అనుకున్న మాటలు మనస్సులో వుంచుకోవాలి సుమా" అని బతిమాలుకుంది.

"శాంతతల్లీ, నువ్వు చెప్పాలా వేరే?"

"ఇంకొకళ్లో వాళ్ళమాట బయటికి వచ్చినా నేను నుహా గొచ్చో –"

"తప్పమ్మా తప్పు, అలా అనుకోకు" అంటూ గోవిందమ్మని పొదివిపట్టుకుని, నారమ్మ "నాకూ తెలుసునమ్మా యీమాట లెంత తియ్యనివో అంత చేదువి. ఎంత సుఖపెడతాయో, వీలుతప్పితే అంతా దుఃఖం కట్టికుడుపుతాయి. హృదయాని కెంత తృప్తి కలిగిస్తాయో బయటపడ్డామంటే బతుకంతఅపకీర్తి కలిగిస్తాయి"అంది.

"సుఖం లేకపోయినా బతకవచ్చు గాని మచ్చ పడ్డ దంటే –"

"అదే నమ్మా తల్లీ! సంసార ఘు యినా సుఖ మయినా గుట్టుగా వున్నంతసేపే కాదూ?"

"కావలసినంత సుఖమూ అనుభవించింది కోదండమ్మ-"

"అందుకే నా తాపత్రయమూను. విన్నావా? ఇక్కడా అక్కడాకూడా పిలుకాక తిమ్మన్న మతిపోగొట్టుకునేవాడు. కోదండమ్మ నిద్రాహారాలు మానుకూర్చునేది. అలాంటప్పుడు వాళ్ళని నేనెంతచమత్కారంగా కలిపేదాన్నని?"

"మరి మళ్ళి?"

"మల్లి కాదు పిల్లి! గుట్టు బయటపెట్టకుండా వుండడానికప్పుడో నాలుగూ, అప్పుడోపదీ రూపాయలనీ, కట్టి విడిచిన బట్టలనీ – అంతే గాని తరవాత్తరవాత కోదండమ్మ దాన్ని తప్పించెయ్యలేదూ? మరి కలకత్తా సంగతి దానికి తెలుసా? నాకొడుకు మేడకి రావడం అదెరుగునా?"

"అలాగేం?"

గోవిందమ్మ వింతగా చూడగా, నారమ్మ సగర్వంగా చూసింది.

ఏకకాలంలో యిద్దరూ వసారా గుమ్మం దాటారు.

హాల్లో మెల్లిగా నడిచారు.

వీధిగుమ్మం సమీపించారు.

తలుపు గడియమీద చెయ్యి వేసింది గోవిందమ్మ; కాని తియ్యలేక పోయింది.

"తనువులు శాశ్వతాలు కావు. కోదండమ్మ సాహసించిందో అనుభవించిందో? తరవాత గింజుకుంటావు

దేవుడల్లే వచ్చింది నారమ్మ, బతిమాలుకో" అంటూ మనస్సు మళ్ళీ అడావుడి చేసింది; గాని "వద్దు – వద్దు. ఒక్కపూట తాళు, బేలపోకు" అని బుద్ధి మళ్ళీ మందలించింది.

సాహసించలేకపోయింది.

ఊరుకోనూలేకపోయింది.

కళ్లు చెదరిపోయాయి.

చివరికి "అత్తోయ్" అంటూ మళ్ళీ నారమ్మ చెయ్యి పట్టుకుంది; గాని అంతలో మళ్ళీవస్తాయించుకుంది.

"రాత్రి నిద్రలో గడిచిపోతుంది. కళ్లు మూసి తెరిచాటప్పటికి తెల్లవారుతుంది. తరవాత నారమ్మ రానే వస్తుంది" అని దిటవు తెచ్చుకుంది.

"ఏమి తల్లీ!" అనడిగింది నారమ్మ, ఏమీ తెలియనట్టు.

"ఆమనిషి పేరెవరమ్మా?" అంటూ గారాం కుడిచింది గోవిందమ్మ, నారమ్మని కౌగిలించుకుని.

"చెబుతా డని నాకు నమ్మకం లేదే తల్లీ"

"అలా కాదు, నువ్వు మళ్ళీ కాదూకూడ దంటే చెప్పేస్తా డమ్మా, నీకొడుకు"

"నాకొడుకు నాకు చెబితే, నేను నీకు చెప్పే మరో పని చేసుకుంటాను, సరా?"

మాట్లాకుండా గోవిందమ్మ చెయ్యి చాపింది.

నారమ్మ కూడా మాట్లాడకుండానే ఆచేతిలో చెయ్యివేసింది.

## 23

ఎలా వేసిందో వీధి తలుపు గడియ వేసిం దంతే, మరి నుంచోలేక వాకిట్లో అంగలో వెళ్లి గవాచీబల్లమీద కూలబడింది గోవిందమ్మ.

కూచోనూ లేక వాలిపోయింది.

ఒక్కమాటుగా చెరువు నిండిపోతే గట్లు జవజవలాడి పోయేటట్టు నారమ్మ వుండినంతసేపూ వాదిగివాదిగి వుండిన భావోద్రేకం అంతా వొక్కమాటుగా వుబికి ఆమె హృదయం దడా దడా కొట్టుకుంది.

బాహిరదృష్టి మందగించింది; గాని అంతరదృష్టి నిశితం అయింది.

రుసరుసలాడుతూ తాను తిరస్కరించడంవల్ల కుసిల్లి పోయి, అప్పటికీ తనమీది చూపు మళ్ళించుకోలేక, తిమ్మన్న, గొల్లభామ మొగాన తన మొగం రూపించుకునీ, ఆమె నడకల్లో తన నడకలు భావించుకునీ, ఆమె మాటల్లో తనమాటలు వూహించుకునీ తృప్తి పడుతున్నట్టు తోచి, కళ్లు మూసుకుని మరింత మథన

పడిపోయిం దామె.

ఒక్క క్షణం అలా వుండి మళ్ళీ కళ్లు తెరిచాటప్పటికి బాగా చీకటిపడింది.

చూడగా, యిటు కళ్ళల్లోనూ అటు జగత్తంతటాను గూడా అంధకారం.

దీంతో, హృదయం నిండానూ అంధకారం.

పోనీ, భవిష్యత్తో అంటే అదో గాఢాంధకారం.

ఈస్థితిలో "అమ్మో" అంటూ లేగదూడా "అంబే" అంటూ ఆవూ వొక్కమాటే అరిచాయి.

ఉలిక్కిపడి, మెల్లిగా లేచి, తడుముకుంటూ వెళ్లి దీపం వెలిగించిం దామె.

ఆ వెలుక్కి, ఘనీభవించి వుండిన చీకట్లు చెల్లాచెదరయిపోగా, స్తంభంచాటునతిమ్మన్న నక్కినుంచునట్టయి గజగజలాడి, యెడమచేత దీపంపైకెత్తిపట్టుకుని ఆ వెలుక్కి కుడిచెయ్యి అడ్డుపెట్టుకుని బాగా పరకాయించి అప్పుడు స్తిమితపడింది.

నిప్పు రాజెయ్యాలని పొయిదగ్గిర కూచుంది.

పిడకముక్కమీద పోసిన కిరసనాయిలు భగ్గుమనగా, పుంజీభవించి చీకట్లో దూకే పొగ మాటున, తిమ్మన్న, తన కళ్లు ముయ్యడానికి వెనకవాటుగా పొంచివస్తున్నట్టయి, బెదిరి, వెనక్కి విరగబడిచూసింది.

175

శ్రీ ప్రేమన గ్రంథాలయము
శైలపోలు. (కృష్ణా జిల్లా)

చిట్టు కలపడానికి పెరట్లో కూచుంది.

అది చూసి, పడుకుని వున్న ఆవు చురచుర చూస్తూ గభీ మని లేచి నుంచోగా, తిమ్మన్న లేవగొట్టిన ట్టనుకుని, చురుగ్గా చూస్తూ "అప్పుడే యెందుకూ!" అనబోయి తెల్లపోయింది.

దూడని కట్టేసి, ఆవుకాళ్ళకి బందంవేసి, పొదుగు కడిగి, పాలు పితకడం ప్రారంభించింది.

గొల్లభామ, ఎడమచేత్తో తిమ్మన్న తల కొంచెం ముందుకి వంచి కుడిచేత్తో గుమ్మపాలగిన్నె అతనినోటి కందిస్తున్నట్టూ, వొకమా టాగిన్నె తన నోట గూడా వుంచుకుంటున్నట్టూ, సుఖపారవశ్యంతో ఆమె మళ్ళీమళ్ళీ అలా చెయ్యగా, ఆముచ్చట వుభయులకూ మొదట వుల్లాసమై, తరవాత వుత్సాహమై, తుదకు ఉద్రేకం అవుతున్నట్టూ తోచి, విభ్రాంత అయిపోయింది.

ఎలా అయితేం, చివరికి పాలు పితికేసింది.

ఆవు బందం విప్పేసింద.

కాలితో ముక్కాలిపీట వొక పక్కకి తోసేసింది.

వెంటనే వొకచేత పాలతప్పేలా, వొకచేత లాంతరూ పుచ్చుకుని, అవతల యేదో మించిపోతున్నట్టు గబగబా బయలుదేరింది; కాని పదడుగులు వేశాటప్పటికి గదుముతున్నట్టు ఆవు అతి ఝూంకారంగా అరిచింది.

లేగదూడ పరవళ్లు తొక్కి గగ్గోలుపెట్టేసింది.

అది చూసి "అయ్యో" అనుకుంటూ వెళ్ళి వెళ్ళి లాంతరు కింద వుంచి దూడను విప్పింది.

అయితే, అప్పుడే పాలు పితకడానికి వచ్చినట్టుగుకుని, ఆవుకి బందం వెయ్యబోయి, అంతలో నాలుక కరుచుకుంటూ యింటోకి చక్కాపోయింది.

నిప్పంటించి, పొయ్యిమీద మెనకుపడేసి, బియ్యం కడిగివుంచి, అప్పుడు పాలు పితకడం దినమ్మూ ఆమె కలవాటు.

ఇవాళ మెసరు పడెయ్యడం మరిచిపోయి, యింటోకి వచ్చాటప్పటికి కాగడా లాగ పొయ్యి తెగ మండి పోతూ వుండడం చూసి కంగారుపడిపోయి పాలతప్పేలా దాని మీాద పెట్టేసింది.

ఒకటేమిటి ఇలాగ, అప్పుడు, ప్రతీపనీ ఆమె అస్త వ్యస్తంగానే చేసింది.

ఎప్పటి కప్పుడు "ఏమిటిదీ!" అనుకుంటూనే తరవాతి పని కూడా యిలాగే చేస్తూ వచ్చింది.

ఈ కంగారులో వంట అయింది; గాని అన్నం చిమిడి ముద్ద అయిపోయింది.

"ఇప్పటికే పొద్దుపోయింది, మళ్ళీ వంట యేమి" టను కుని అన్నీ వడ్డించుకుంది ; గాని పెరుగుతప్పేలా దగ్గిర

పెట్టుకోడం మరిచిపోయింది.

"పటం చూడ్డం నగనే అయిపోయిం" దనుకుంటూ గబగబా భోజనం ప్రారంభించింది; గాని ఆకలీ కనపడలేదు, సయించనూ లేదు.

"మీగడపెరుగుతోనైనా నాలుగు ముద్దలు తినలేక పోతామా!" అనుకుంది; గాని దానికోసం అలమారు దగ్గిరికి వెళ్ళి, ముందు పాలతప్పేలా కనపడగా "దాలి మీాద పడెయ్యనే లేదు" అనుకుంటూ తీసుకువచ్చి, అప్పటి కప్పుడే అది పాలున్నమాట మరిచిపోయి, బిళ్ళకి బిళ్ళ అంతా బాళుక్కున పడిపోతుం దేమో అని తప్పేలా మెల్లిగా వంచి వచ్చిపాలే వడ్డించుకుని తెల్లపోయింది.

కంచం కడగడానికి పెరట్లోకి బయలుదేరింది. అయితే, కడుపునిండా పాలుతాగి, ఆవుల్లాసంతో చెంగుచెంగున దూకుతూ వచ్చి లేగదూడ కాళ్ళంలో పడగా కంగారు పడి, కట్టివేదా మని పాకలోకి తీసుకువెళ్ళి ఆవుముందు పచ్చిగడ్డి పడేసి చక్కావచ్చింది.

కొంతసేపటి కీ గొడవ లన్నీ మెలాగో పూర్తిచేసు కుని మళ్ళీ వచ్చి పటం దగ్గిర కూచుంది.

చూడగా, కృష్ణు డప్పటికీ రాధ పమిటికొంగు లాగు తూనే వున్నాడు.

రాధ కూడా కృష్ణునిమీాద కోప్పడుతూనే వుంది.

దానిమీాద "అయ్యో, మీా యిల్లు బంగారం గానూ, యింకా యెంతసేపర్రా యీా జెట్టుసరీలూ యీా బతి మాలడాలూను!" అనుకుంది గోవిందమ్మ; గాని "మరి నువ్వేమి చేస్తున్నావు తిమ్మన్ననీ?" అని యెవరో అడిగిన ట్టయి సిగ్గుపడిపోయింది.

తరవాత వొక్క క్షణం వుండి మళ్ళీ పటం చూసింది.

మళ్ళీ విభ్రాంతురా లయింది.

కోదండమ్మనీ గొల్లభామనీ మళ్ళీమళ్ళీ తలుచుకుని మళ్ళీమళ్ళీ గుటకలు మింగింది.

మళ్ళీమళ్ళీ తిరపతమ్మని తలుచుకుని మళ్ళీమళ్ళీ యీాసడించుకుంది.

మళ్ళీమళ్ళీ నారమ్మ ధోరణి విమర్శించుకుని, మళ్ళీ మళ్ళీ కల్పనల మీాద కల్పనలు చేసుకుంది.

ఇలాగ సతమత మయిపోతూవుండగా, ఆమెకి, ఆవు లింతలమీాద ఆవులింతలు వచ్చాయి.

కళ్లు మండాయి.

కనురెప్పలు బరువెక్కాయి.

ఇక ఆగలేక దీపం తగ్గించెయ్యకుండానే వెళ్ళి, పక్క దులుపుకోకుండానే పడుకుంది; కాని నిద్రాపట్టను, కళ్ళూ తెరవలేదు, తోచనూ తోచదు, తెల్లా వారదు.

ఇలా కూడా మరికొంతసేపు బాధపడగా బాధపడగా,

అటు కోళ్లు కూస్తూ యునగా యిటు కోడికూసుకు పట్టింది.

ఉందులో కల.

గంధపుగిన్నే, పన్నీరుబుడ్డీ, సెంటుసీసాలూ, అగరు వత్తుల కూజా, తాంబూలసామగ్రీ వున్న పళ్ళెం పట్టుకుని చాకలి మల్లి ముందూ, ఫలహారాలూ కాఫీ ఫ్లాస్కూ వున్న పళ్ళెం పట్టుకుని తాను వెనకా బయలు దేరినట్టు — మల్లి భూమి మీాదా భూమికి గజం యెత్తున తాను ఆకాశానా నడుస్తున్నట్టు — "కోదండమ్మగారు బయలుదేరి నప్పుడు చిమ్మచీకటీ ముసురూను. మీాపుణ్యాం మంచిగిరకనక, యివాళ పుచ్చపువ్వులాగ వెన్నెల. మరి నాచి అడుగు వెయ్యరేం!" అని మల్లి తొందరపెడుతు న్నట్టు—ఊరికి మైలుదూరాన వుండిన తిమ్మన్న బత్తాయి తోట, వూరు దాటాటప్పటికి తన కెనుసువచ్చినట్టు—తన మీాద ఎర్రఅక్షింతలూ పచ్చఅక్షింతలూ దిష్టితీసి అటూ యిటూ చల్లేసి, కాళ్ళమీాద నీళ్ళు పోసి, చెయ్యిపట్టుకుని తనని లోపలికి తీసుకువెళ్ళడానికి ముసిమూసినవ్వులు నవ్వు కుంటూ తోట గుమ్మాన నుంచుని గొల్లభామ నిరీక్షిస్తు న్నట్టు — "నేను కులంమనిషి, నేమనుకున్నానో మరి" అంటూ తానామెని పక్కకి తప్పుకోమని చేసన్న చేసి నట్టు — తిరా తోట ద్వారందగ్గిరికి వెళ్ళాటప్పటిక్కీ

తోటకూ కొండకూ మధ్య వుండిన బోదెకాలవ అమాం తంగా అరఫర్లాంగు వెడల్పయిన కొండవాగయి, నుర గలు కక్కుకుంటూ పొర్లిపోతూ తాచుపా మంత వడిగా ప్రవహిస్తున్నట్టు — అది చూసి తాను నిలువునా నీరయి పోగా "అడుగు వెయ్యండి" అని నాల్లి తొందరపెడుతు న్నట్టు — "భయంలేదమ్మా చెల్లీ! ఇది మనుష్యులు కల్పించింది. చూసినకొద్దీ పొంగిపోతుంది. భయపడ్డకొద్దీ కెరటాలు విరిగి మీద పడతాయి. దేవుడిచ్చిన ప్రేమ ఆరాధిస్తున్నవాళ్లం, మన కిదొక అడ్డా? సాహసించి వురకవమ్మా" అంటూ పొదవిపట్టుకుని తనని కోదండమ్మ ముందుకి నడిపిస్తున్నట్టు — చూసి చూసి, నమ్మలేక నమ్మ లేక నమ్మి, చివరి "కేమయినా కానీ" అని తాను వాగులో వురికినట్టు —

దీంతో గోవిందమ్మకి మెళుకువ వచ్చింది.

చూడగా దీపం బంతిపువ్వులాగే వుంది; కాని వెల వెలపోయింది.

తలుపు కొడుతూ పాలికాపు తెగ అరుస్తున్నాడు.

ఆవు వొకటే గోలచేస్తోంది.

ఊరఫస అంతా విని, తూల్తూ తూల్తూ వెళ్లి పెరటి తలుపు తెరచి చూడగా భళ్లున తెల్లవారిపోయి వుంది.

# 24

బిందె బుజాన వేసుకుని గోవిందమ్మ చెరువుగట్టెక్కే టప్పటికి నిండు బిందె బుజాన పెట్టుకుని చెరువుకేసి తిరిగి వుండిన గొల్లభామ "కాఫీకి పొద్దెక్కిపోతోంది, పోవాలి" అంటోంది వొక యువతితో.

అది విని "కాఫీట కాఫీ" అనుకుంటూ మొగం చిట్లించుకుంది గోవిందమ్మ.

"చీకటుండగా నువ్వు బయలుదేరవు. సావకాశంగా చెరువులో స్నానం చేస్తూ కూచోడానికి అన్నయ్యగా రొప్పుగోరు. గట్టిచిక్కే" అంది యువతి.

"ఇక్కడ చెలికత్తెతో డిసంతులు కొడుతూ కూచున్నావా!" అనుకుంటూ కొంచెం కోపంగా చూసింది గోవిందమ్మ.

"నేనయితే, నారాజుని, అయిదుగంటలకే కాఫీ యిచ్చి పంపెయ్యనూ!" అని కూడా అనుకుందామె.

"మా అన్నయ్యగారు కూడా పొద్దున్న స్నానం చేస్తారా?" అనడిగింది యువతి.

"అయ్యో, వదినా, చీకటి వుండగానే వారు స్నానం చేస్తాగు. చలవ మడత లిచ్చి, అద్దమూ దువ్వెనా యెదటవుంచి –"

"నువ్వు కాదూ తల దువ్వడం?"

"నేనే అనుకో, నీకంత సరదాగా వున్నప్పుడు కాదనడం —"

మాట సగంలో వెనక్కి తిరిగి, గోవిందమ్మని చూసి గతుక్కు మని, అటు తిరిగి పావంచా లెక్కి కంగారు పడుతూ వెళ్లిపోయింది గొల్లభామ.

యౌవనమదానికి తోడయి తడిబట్ట ఆమె నడక మరింత మందగింపజేసింది.

తెల్లని గ్లాస్గోచీరా, లేతాకుపచ్చ వాయల్ రైకా ఆపిలు పండుకి చుట్టిన టిస్యూ కాగితం లాగ పా — చ్ఛని ఆమె శరీరం అంటుకుపోయి వున్నాయి.

ఆదరాబాదరా సద్దుకుని వచ్చివున్నట్టు బర్మాముడి యింకా కొంచెం శిథిలశిథిలంగానే వుంది.

బుజంమీాది బిందె అప్పుడే తోమివుండడంవల్ల బంగారపు కుండలాగ మిలమిల్లాడుతోంది.

పక్కవాటుగా ఆమె వయ్యారం చూసి, నుతారంగా తల పంకించుకుని, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ పావంచాలు దిగింది గోవిందమ్మ.

"ఏమి వదినా, పొద్దెక్కివచ్చావ్?" అనడిగింది, యువతి.

"రాత్రి తెల్లవార్లూ దోమలు చంపేశాయి. నెల

గుంకాక కసింత నిద్రపట్టి పొద్దుపొడిచాక మెళుకువ వచ్చింది" అని బదులుచెప్పింది గోవిందమ్మ, దోమకాట్ల కోసం అన్నట్టు అజబ్బా యిాజబ్బా చూసుకుంటూ.

"చూశావా?"

"చూడనూ చూశాను, వినకూ విన్నాను"

"తిమ్మన్న అన్నయ్యగారి చెట్టబట్టాక బావనమ్మా రయిపోయింది బొత్తిగా"

"ఇద్దరూ కలిసి అత్తెసరూ పచ్చిపులుసూ తింటున్నా రటనా"

"అదెక్కడలే?"

"మరింకేం? పొద్దుటిపూట స్నానం చెయ్యడానికి బావనశాస్త్రులే కావాలా!"

"ఇంతవరకూ మనవా ళ్ళెరగరుగా!"

"నువ్వేం చూశావ్?"

ఇలా అడుగుతూనే చెరువులో దిగేసింది గోవిందమ్మ అప్రయత్నంగా.

"నువ్వూనా?" అనడిగింది యువతి, చకిత అయి.

"లేకపోతే, మీ తిమ్మన్న అన్నయ్యగారికి పనికి వస్తానా ఏమిటి?" అని మనస్సులో అనుకుని "నువ్వూనా అంటే?" అని మొను గడిగింది గోవిందమ్మ, నిలవతీసి.

"నువ్వు చెరువులో దిగి స్నానం చెయ్యడం మొర

గమే'' అని గట్టుమీదనుంచి మాట వినవచ్చింది.

ఉలిక్కిపడి చూడగా, తిరపతమ్మ.

ఆమె కట్టిన చీరా, తొడిగిన రవికా కనుమాసి వున్నాయి.

సగ్గుబియ్యపు పరమాన్నంలో బెల్లం వెయ్యడమూ, కూతుర్ని పెళ్ళాడ మనడమూ కూడా జ్ఞాపకం వచ్చాయి.

దాంతో ''నీబతుకే చెడ్డదిగదే'' అనుకుంటూ వులుకూ పులుకూ చూసింది గోవిందమ్మ.

ఆచూపులకు ''వినపడలేదు, ఏమన్నావూ?'' అనడుగుతున్న ట్టర్థంచేసుకునీ, ఆలస్యం సహించలేకా ఆమాట మళ్ళీ అడిగింది తిరపతమ్మ.

''శివరాత్రి వెళ్ళాక నువ్వూ నేనూ కలుసుకుంటేగా? ''

''అవునవును, అమాసనాడు కూడా నువ్వు చెరువులో స్నానం చేశావ్, చూశా'' నంది యువతి.

''ఏం?'' అని ముదలకిస్తున్నట్టు చూసింది గోవిందమ్మ.

''ఏమో నే నెరగను, ఈమధ్య మొదలుపెట్టావు కామోసు నువ్వు'' అంటూ మూతి ముడుచుకుని, భడీమని బిందె పావంచాలమీద వుంచింది తిరపతమ్మ.

''పొద్దుటిపూట నీళ్ళలో దిగి స్నానం చేస్తే యెంతో సుఖంగా వుంటుం దంది మాచిన్నవదిన. చలి బాగా తగ్గిపోయాక నెల్లాళ్ళపాటు నేనుకూడా చేసి చూడా లెలా

వుంటుందో? ” అంది యువతి.

“ఇప్పుడు మాత్రం చలేదీ? ” అనడిగింది తిరపతమ్మ.

“రాత్రిళ్లు ఉక్కబోసేస్తూ వుంటే చలి అంటా వేమిటి చలి ? ” అనడుగుతూ సావకాశంగా వాళ్లు తోముకోసాగింది గోవిందమ్మ.

ఇంతలో “గోవిందమ్మగారూనా ? ” అంటూ కుండ పట్టుకుని చాకలి మల్లి వచ్చింది.

ఉలిక్కిపడి చూసింది గోవిందమ్మ.

కల జ్ఞాపకంవచ్చిం దామెకి.

కొండవాగులో పురికిన పురకడం, యిప్పుడు చెర్లో తేలినట్లున్నా అనిపించిం దామెకి.

చూపులు చెదిరి, అప్పటి ఆదృశ్యమూ యిప్పటి యీాసన్ని వేశమూ కలగాపులగంగానూ, మసకమసక గానూ కనపడి “మల్లి ఆసంగతులు చెప్పేస్తుం దేమో? ” అన్నట్టు గజగజలాడిపోయిం దామె.

ఈస్థితిలో “గోవిందమ్మగారూనా అన్నా వేమిటే? ఇంకెవ రెవర్ని చూశావూ నువ్వూ? ” అనడిగింది తిరపతమ్మ, మల్లిని.

ఆసంగతి వినడానికి యువతి చెవు లొరజేసుకుంది.

“పుష్కరాలు వెళ్ళిన దగ్గిర్నుంచీ కోదండమ్మగారు వెలుగు రాకుండానే స్నానం చేసి వెళ్ళేవారు. వారి

తరవాత మళ్ళీ గోవిందమ్మగారిని చూస్తున్నా” నంది మల్లి, పావంచాలు దిగుతూ.

ఇది విని నిర్విణ్ణ అయిపోయింది గోవిందమ్మ.

అంత పూళ్ళోనూ కోదండమ్మా, గొల్లభామా, తానూ మాత్రమే పొద్దిటిపూట చెరువులో దిగి స్నానం చెయ్యడమూ, తన విషయం యింకా ఆలోచనలోనే వున్నా, తిమ్మన్నతో సంబంధం యేర్పడ్డ తరవాతనే యిది ప్రారంభం కావడమూ — మల్లి మాటమీద యిదంతా జ్ఞాపకంవచ్చి, గుండెలు కొట్టుకోగా, మొగం పక్కకి తిప్పేసుకుంది గోవిందమ్మ.

“మనం కూడా స్నానం చేస్తే?” అని ఆలోచనలో పడింది తిరపతమ్మ.

“ఇంత పూళ్ళోనూ, యజ్ఞంచేశారు కనక, వెంకట సోమయాజులుబాబయ్యగారు మాత్రం వెలుగు రాకుండా స్నానం చేసేవారు. తక్కిన బాపనోరంతా భోజనాల వేళే స్నానాలు. సోమయాజులుగారి తరవాత మళ్ళీ తిమ్మన్నదొరగారు చేస్తున్నారలాగ” అంది మల్లి.

దీనిమీద యేదో అనబోయిన్నీ గోవిందమ్మకేసి చూసి వూరుకుంది యువతి.

దీంతో, గోవిందమ్మ మన నంతా కలిగిపోయింది.

చెవుల్లో హోరు పుట్టింది.

"మీరంతా వొక జట్టులా వుందే" అని యువతి అనేస్తుం దేమో అని పితపితలాడిపోయిం దామె.

తిరపతమ్మ యిక ఆగలేకపోయింది.

"తన లాగ పొద్దుటి పూట మనం కూడా స్నాన మాడితే అన్నీ మరిచిపోయి తిమ్మనన్న వొప్పుకుంటా" డనుకుం దామె.

అనుకుంటూనే గభీమని చెరువులోకి దిగజారింది.

చకిత అయి గోవిందమ్మ కేసి చూసింది యువతి.

"ఇవాళే మొదలా మీరు?" అనడిగింది మల్లి.

"జట్టు పూర్తి అయింది" అని యెవరో డెకారించిన ట్టయింది గోవిందమ్మకి.

తానింకా అక్కడే వుంటే, మల్లి "స్నానాలు చేసే యీ ఆడవాళ్ళందరూ యేరాళ్లు" అనేస్తుం దేమో అని భయపడి "నేనూ వస్తున్నా నుండువదినా" అంటూ యువతి యెంత పిలుస్తున్నా వినిపించుకోక, చరచరా గట్టెక్కి పదడుగులు వేసి, తరవాత గొల్లభామకంటేనూ యెక్కువగా వయ్యారినడకలు ప్రారంభించిం దామె.

# 25

పదడుగులు వేశాటప్పటి కెమ్మరై "స్నాన మేమే?" అనడిగింది. సుభద్రమ్మ.

"దినమ్మా అలవా టయిపోయింది పిన్నమ్మా" అంటూనే ముందుకు సాగిపోయింది గోవిందమ్మ.

మళ్ళువు తిరిగా టప్పటి కెదురుపడి "యేకాదశంటే?" అనడిగింది, భద్రమ్మగారి చంద్రమ్మ.

"కాదత్తా, దినమ్మా చేస్తున్నాను" అంటూనే అడుగు వేసింది గోవిందమ్మ.

నందు మొగలో యెదురై "మాఘం వెళ్ళిపోయి చాలా దినా లయిందే? " అంది కొండమ్మ.

" అది కాదు పెద్దమ్మా ! రాత్రి నిద్రచాలక కళ్లు మండిపోతున్నాయి, అందుకోసం " అంది గోవిందమ్మ.

" అదేం ? "

" ఆవు తెగఅరిచింది "

మాట చెబుతూనే బయలుదేరింది గోవిందమ్మ; కాని రెండడుగులు వేసి నిలిచిపోయి " తాడు తప్పించుకుని పెర డంతటా గంతులేసింది లేగదూడ. అసలే ముమ్మారం తగ్గిపోయి వుంది, ఆవున్న కిసిన్ని పాలూ యెక్కడ తాగే స్తుందో అని దాంతో సత మత మయిపోయాను. దాన్ని కట్టేదాకా వొకటే అరవడం ఆవు " అని వివరించి చెప్పి కొండమ్మ అది వినకుండానే వెళ్ళిపోయినా అప్పుడు మళ్లీ బయలుదేరింది గోవిందమ్మ.

సందు మధ్యకి వచ్చాటప్పటికి, వేళాకోళా లాడుకుం

టూనూ వెక్కిరించుకుంటూనూ అయివారుగురు పడుచు లెదు రయివారు.

అందరూ ఆవ్వూరి ఆడవడుచులే.

అందరూ పెళ్లికాని కన్యలే.

అందరూ వయసువచ్చినవాళ్లే.

అందరూ కొంటెపిల్లలే.

అందరూ సరదాగా చెరువుకి బయలుదేరినవాళ్లే.

అందరూ గోవిందమ్మకి వర సయినవాళ్లే.

వాళ్లని చూడగానే "నోపట్టాన వదలరు" అనుకుంది గోవిందమ్మ.

అందుకు తగ్గట్టు అంతదూరాన చూసే అందరూ ఆగి పోయారు.

ఆగి, గుసగుస లాడుకున్నారు.

ఆడుకుని, అర్ధచంద్రాకారంగా బయలుదేరారు.

వ్యూహం పన్నుకునే వస్తున్నా రని గుర్తించుకుని మొగం వంచుకునిన్నీ కీగంట చూస్తూ, తానదేమీ యెరగనట్టు మెల్లిగా నడవసాగింది గోవిందమ్మ.

వాళ్లూ అలాగే నడిచారు.

ఒకళ్లకొకళ్లకి సంబంధం లేనట్టు అలాగా యిలాగా చూస్తూ నడిచారు.

సమీపించారు.

ముట్టడించేశారు.

"షాలో" మంటూ చుట్టేసుకున్నారు.

సిద్ధపడే వుంది కనక, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ నిలిచిపోయింది గోవిందమ్మ.

"నీళ్లాడింది గోవిందమ్మత్త" అంది బంగారమ్మ.

"అశుంఛా, అశుంఛా" అంటూ మెత్తెత్తి కాళ్లేసుకుంటూ గోవిందమ్మ చుట్టూ తిరిగింది నీలమ్మ.

"ముట్టేసుకుంటా, ముట్టేసుకుంటా" నంటూ మీదిమీదికి వచ్చింది ముత్యాలమ్మ.

"అయ్యో, పెద్దదాని వయిపోయావు, చూపు తగ్గిపోయింది, చుట్టపీక తాక్కావు, నీళ్లు మైలపడిపోయాయి నాబిందెలో వొంచేసి మళ్లీ మునిగి మళ్లీ తెచ్చుకో మన మరాలా" అంటూ బిందె పట్టింది రత్తమ్మ.

"ఏదో పిండివంట చేసి యేదేవుడికో ఆరగింపు చేస్తుంది గోవిందమ్మత్త, ఆనక వెళ్లి మంచిమాట చేసుకోవా" లంది మాణిక్యాలమ్మ.

"ఆ, రమ్మన్నారు మిమ్మల్నందర్నీ తిమ్మన్న బంతికి" నిలచేతులు తిప్పుకుంటూ దగ్గిరసా వచ్చి, ఆమె చెవిదగ్గిర నోరుపెట్టి "వీధి తలుపు బిగించేసి, దొడ్డితలుపు దగ్గిరసా వేసి వుంచు వదినా" అంటూ కిలకిల్లాడింది సుందరమ్మ.

కాని యెవరేమి చేసినా, ఏమన్నా మారుచెప్పక వింటూనూ చూస్తూనూ, బిందె బరువుకి వూగిసలాడి పోతూనూ వుండిపోయింది గోవిందమ్మ.

ఒక్కొక్క మాటతో దరస్మిత అయింది.

ఒక్కొక్క మాటతో పులకిత అయింది.

ఒక్కొక్క మాటతో చకిత అయింది.

ఒక్కొక్క మాటతో ఆందోళిత అయింది.

ఏకకాలంలో యిన్ని మనోవికారాలూ తట్టుకోలేక చివరికి నిమీలిత అయిపోయింది.

వెంటనే ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వచ్చి, తిమ్మన్న "ఏదీ పాయసం" అనడిగినట్టయి కంపిత అయిపోయింది.

దాంతో, బుజంమీది బిందె వూగిసలాడింది.

నీళ్లు తొణికాయి.

ప్రథమోదబిందువుల్లాగ వడగళ్లంతలేసి నీటిచుక్కలు విసురుగా వీపునా అక్కనా చిందగా అప్పుడు ప్రకృతిలో పడిందామె.

ఈలోపాయికారీ వ్యవహారం యెరగని వదుచులున్నూ అప్పటికి పక్రిమ విడిచి "ఎందుకూ, పొద్దున్నే స్నానం చేశా, వేంపసీ?" అనడిగారు, ఏకగ్రీవంగా.

మొదట యేదో అనేద్దామనుకుంది గాని, అంతలో,

యీావక్రగ్రీవత, ఒకానొక ఐకకంఠ్య నిర్ణయం స్మృతికి తేగా "పొద్దు పొడిచాటప్పటికి కంఠ స్నానం చెయ్యకుండా యేపనీ ముట్టకూడ" దని చదువుకున్న మన కులం ఆడవాళ్లు సభచేసి తీరుమానించా రంటగా, నెల దినాల కిందట బందరుపట్టంలో?" అని యెకు రడిగింది గోవిందమ్మ, వెంటనే.

ఇది విని పడుచు లందరూ మొదట ముగమొగాలు చూసుకున్నారు.

ఉత్తరక్షణంలో "ఔనంట, మా అన్నయ్య చెప్పా" డంది బంగారమ్మ.

"మరి నీచు తినవచ్చు నటనా?" అనడిగింది నీలమ్మ.

"బావనోళ్లే చెయ్యడం లేదుగా?" అని ముదఱ కించింది ముత్యాలమ్మ.

"చేస్తేమాత్రం బావనోళ్ళ యెక్కువేమిటి? కాకపోయినా, ఇంటో నుయ్యి లేకపోతే వాక్కు చెంబెడు నీళ్ళతో చెల్లిపోతుంది స్నానం. నుయ్యుంటే వాక్కుచేద. చెరువుకి వస్తే మాత్రం చాకిరేవు పెట్టేస్తారు, సీత్" అంది రత్తమ్మ.

"అదంతా బందరు బడాయి ఫోన్" అంటూ నీలమ్మని గెంటుకుపోయింది సుందరమ్మ.

కల్లీబొల్లీ మంటూా తక్కిన పిల్లలు వాళ్ళ ననుఙ

రించగా, వూపిరితీసుకుని మెల్లిగా బయలుదేరింది, అప్పుడు గోవిందమ్మ.

## 26

ఎవరెవరో యెదురైనారు.

ఒకరిద్దరు పలకరించారు.

ఒకామె అడగబోయి, మన కెందు కని వూరుకుని, అయినా కారణాలమీద కారణా లూహించుకుంటూ చక్కాపోయింది.

గోవిందమ్మ యేమీ గమనించలేదు.

పదుచులు విడిచిపెట్టగానే మొగం వంచుకుని నడక సాగించిం దామె.

మళ్ళీ మొగం యెత్తుకునేటప్పటికి నారమ్మ యిల్లు తగిలింది.

గుమ్మంలో, చివరి చీడీమీద నుంచుని వుంది నారమ్మ.

చూసి యిద్దరూ చిరునవ్వు నవ్వుకున్నారు.

నారమ్మ చీడీ దిగగా గోవిందమ్మ దగ్గిరికి చేరింది.

"ఇదేమిటి చిట్టీ!" అనడిగింది నారమ్మ, వాత్సల్యం గుమ్మరిస్తూ.

మొదట మళ్ళీ ఒక్క చిరునవ్వు నవ్వేసి వూరుకుంది గోవిందమ్మ.

తరవాత, వొకమాటటూ — వొకమా టిటూ పారజూచి, "గొల్లభామ కనపడింది చెరువు దగ్గిర" అంది మెల్లిగా.

"పలకరించిందా?"

"లేదు"

"నువ్వో?"

"నేనూ పలకరించలేదు; గాని సిగ్గుపడిపోయింది"

"ఎందుకూ?"

"తిమ్మన్నకి తనే నంట తెలుదుప్వడం"

"నువ్వా చేస్తా వా పని, తొందరపడకు" అని మనస్సులో అనుకుని, నారమ్మ "ఆ మాట యెందుకు వచ్చింది తల్లీ?" అనడగ్గా, జరిగిం దంతా చెప్పేసింది గోవిందమ్మ.

"అవునుమరి" అంటూ వొకమాటు తల వంకించుకుని "అందచందాలు తెలిసిన పిల్ల. సరసస్లాపాలు చేతయిన భామ. వలచి వలపించగల జాణ. దీనికి సాయం సుఖమూ, ఆనందమూ — ఇవే చూసుకుంటాం దడ్, అబ్బరమా తల్లీ!" అంది నారమ్మ.

గోవిందమ్మ కళ్ళు మెరిశాయి.

"అదివర కెలా వుండినా, తనతో స్నేహం చేశాక నిమిషంలో దిద్దెయ్యడూ నా కొడుకు?"

"తిరపతమ్మనీ దిద్దగలడా?"

పకా పకా నవ్వుకున్నా రిద్దరూ.

తిరపతమ్మని ఆడిపోసుకున్నా రొక్క క్షణం.

"నువ్వెందుకు చేశావూ స్నానం?"

"కోదండమ్మా చేసే దంటగా?"

"లేకపోతే, నా కొడుక్కి పనికిరానద్దూ?"

"అందుకే" అన్నట్టు చూసింది గోవిందమ్మ.

చూసి "నీళ్ళకి వచ్చి మళ్లి చెప్పింది. గొల్లభామ కూడా స్నానం చేసి వుండడం చూడగా ముచ్చట అయి, అనుకోకుండానే — మాట్టాడుతూ మాట్టాడుతూనే — అంతకి ముందే చెరువులో దిగేశాను నేను"

"నాకూనా, మంచిపని చేశావు నువ్వు. దేవుడు చూడలేకపోయాడు; గాని అసలే రంభవు నువ్వు. ఆపైని నీకు శుచీ శుభ్రమూ మెక్కువ. స్నానం కూడా యిలాగ పొద్దుటె పూటే చేస్తూ వుంటే నీచక్కదనానికిక పరిమితి వుంటుందా? పొంగిపోడూ నా కొడుకు?"

ఇలా అడిగి నారమ్మ సాకూతంగాచూడగా, మురిసి పోయింది, ముడుచుకునిపోయింది గోవిందమ్మ.

ఈ సమయాన, యెదటింటి ముసలమ్మ, బిందె పుచ్చుకుని చెరువుకి వెడుతూ "గోవిందమ్మ స్నానం చేసిందేమిటే?" . అనడుగుతూనే గబగబా వెళ్ళిపోయింది, గుళ్ళూ కుళ్ళూ దగ్గుకుంటూ.

దానిమీద జ్ఞాపకం రాగా "తిరపతమ్మా స్నానం చేసిం దట్తోయ్" అంది గోవిందమ్మ.

"తిరపతమ్మా?"

"అవు, నదలా చెరువులో దిగింది, నే నిలా వచ్చే శాను, నుంచోలేదు"

"దానికీ నీకూ సాపత్యం యేమిటి, మంచిపని చేశావు"

"మురికి వోదుకుంటూ వచ్చిం దది"

"దాని బతుకే అలాంటిదీ, పోనిస్తూ చిట్టీ"

"స్నానం చేస్తే శరీరం శుభ్రపడుతుంది గాని మనస్సో?"

"మహా బాగా చెప్పా వమ్మా"

"స్నానం చేస్తే మాత్రం? ఎద్దె మనిషి, క్షణంలో—"

"ఇంతకీ: స్నాన మాడేది, వుపవాసాలు చేసేది, దాన్ని నా కొడుకు చేరనివ్వడు. వాడు చేరనిచ్చినా నేను —"

"నీ కాళ్ళమీద పడుతుందనుకో"

"ఇదివరకే పడకపోతేనా? ఏమయినా, నీకాలిగోటికి పోల దది, ఛీ"

ఇలా అంటూ మొగం పక్కకి తిప్పుకుని నారమ్మ రుంజుకుంది.

తానున్నా మొగం పక్కకి తిప్పుకుని, మళ్ళీ వులికి మళ్ళీ కులికింది గోవిందమ్మ.

ఒక్క క్షణం తెరపిమరపుల్లో వుండిపోయిందామె.

ఆమె మళ్ళీ ప్రకృతిలో పడేదాకా వోరకంట చూసి, యేదో చెప్పడానికి తన కేసి తిరిగాటప్పటికి "బరువెత్తు కున్నావు, పాపం" అంది నారమ్మ, జాలి కనపరుస్తూ.

దానికి బయలు చెప్పకుండానే "వొప్పావా?" అనడిగింది గోవిందమ్మ, బెల్లిస్తూ.

"ఆమనిషి పేరా?".

"ఊ"

"నన్ను బలవంతపెట్టకు పిన్నమ్మా" అంటూ చేతులు పట్టుకున్నాడు నాకొడుకు. నే నిక మాట్లాడలేకపోయాను"

ఇది వినీవినడంతోనే "అబద్ధం" అంటూ ముందు మూతి ముడుచుకుంది గోవిందమ్మ.

తరవాత "నేను నమ్మ" నంటూ మొగం తిప్పేసుకుంది, విసురుగా.

అంతలో "నే నొప్పుకోను" అంటూ మళ్ళీ నారమ్మ కేసి తిరిగి "నువ్వు గట్టిగా పట్టుపడితే చెప్పకుండా వుండ గలడా, నీకొడుకు? నాకు తెలవ దనుకున్నావా నీసంగతి? అసలు, నువ్వే దాచేస్తున్నావు. ఇదివర కేనుయినా, నువ్వు భోజనానికి వచ్చాటప్పటికి తెలుసుకుని రావాలి. ఫలహారానికి వచ్చినప్పుడైనా ఆమని షెవరో నాకు చెప్పి తీరాలి. లేకపోతే నామీద నీకు దయలే దనుకుంటాను.

నన్ను మోసం చేస్తున్నా వనుకుంటాను. నీ మాట లిం కెప్పుడూ నమ్మనే నమ్మను. నీతో మాటే ఆడను" అంది చివరికి, బుంగమూతి పెట్టుకుని.

"ముందు ఫలహారం పెడతావుగదా నాకు?"

బెల్లించి చూస్తూ నారమ్మ యిలా అడగ్గా, పకాల్ పకాల్ మనేసింది గోవిందమ్మ.

కాని, తేరుకుని, ముందు మాట అందుకోకుండానే ఆమె చెయ్యి పట్టుకుని "వెర్రితల్లీ, నువ్వింత పట్టుపట్టాలా నాకు చేతనయితే? రాచకుమారుణ్ణి మించినమాతిమ్మన్న మతి పోగొట్టిన మనిషి వుందంటే మన వూరి కెంత గొప్ప? అదెవరో తెలుసుకోవా లని నా కెంత సరదా వుండదూ?"

"నీకు కోడ లవుతుం దాయె."

"ఇంకేం? అంత అంద మయిన నాకోడల్ని చూసు కుందా మని నా కుబలాటం వుండదూ?"

"ఉంటుంది కసకసే –"

"ఉంది కసకసే నా కీ తిప్పలు. తెలిసిందా? ఇంత వూళ్ళో – వొక్క నాకూ నీకూ – నీ కే మమ్మా? గువ్వపిట్టలాగ మప్పికెంగా తిని యింటో కూచున్నావు "తెలుసుకురా" అంటూ నన్ను వూళ్లోకి తరిమికొడు తున్నావు–"

"కరుముతున్నా నంటే నీకు నామీద దయ –"

"అయ్యో, వెర్రితల్లీ, నామీద మాత్రం నీకు దయ లేకపోతే యీ భారం నా మీద పెడతావ్రటమ్మా? నామీద యెంత నమ్మకమూ –"

"అత్తోయ్, నిన్నే నమ్మాను. నాగుట్టు –"

గోవిందమ్మ కంఠం గద్గదిక మయిపోయింది.

అది గ్రహించి, తటాలున ఆమె చెయ్యి పట్టుకుని "వద్దు, అనుమానపడకు. ఎప్పటికీ నీగుట్టు చెడకుండా నాదీ పూచీ. సంపార్లంకామూ? నేను బతికి వున్నంత కాలమూ నీ కేలోటూ రాదు, కోదండమ్మ లాగ నన్ను నమ్మి నిశ్చింతగా వుండు" అంది నారమ్మ.

"కోదండమ్మ లాగంటే –"

"కోదండమ్మ కూడా నీలాగే "అదేమిటీ? ఇదేమిటీ?" అనడిగేది. తపస్సు చేసి అయినా తెలుసుకుని వచ్చి నేను దానికి చెప్పేదాన్ని. నీకూ –"

"వుబలాటం తప్ప నా కేమీ లేదమ్మా!"

"అదేనే వెర్రితల్లీ! నేను మాటలమనిషిని కాను. ఇదిగో చెబుతున్నాను విను." "ఫలానా" అని తెలిసిందంటే వెంటనే పరుగెత్తుకుని పోయి గుచ్చికౌగలించేసు కుంటాను, ఆ సూర్యారిభానుని చూసుకో"

చూస్తూనూ వింటూనూ మాత్రం వున్నట్టు నటిస్తూ

గోవిందమ్మ, యీమాట నల్లగుండెలో దాచుకుంది.

అదిగ్రహించి "నాకొడుకుని దానిచేతిలో కీలుబొమ్మని చేసేస్తాను కూడా" అంది నారమ్మ.

"నువ్వు చెబితే అలా అయిపోయేవాడు, నువ్వడిగింది చెప్పకుండా యెలా వుండగలిగాడూ నీ కొడుకు?" అనడిగింది గోవిందమ్మ, చురుగ్గా చూస్తూనూ, తల యెగరవేసుకుంటూనూ.

నారమ్మ మాట్టాడలేకపోయింది.

అయితే, యెన్నో ధక్కా-మొక్కీలు తీరిన మనిషి కనక "ఎంత వెర్రిబాగులదానవే తల్లీ!" అంటూ జాలి నటించి, యీలోపున వొక తన్నా ఆలోచించుకుని "అయితే, వొక్కటి ఆలోచించు పిల్లా" అంటూ అందుకుంది, గోవిందమ్మ బుజం తట్టుతూ.

"ఆమనిషెవరో తిమ్మన్న నాకు చెబుతా డనుకో"

"అనుకో యేమిటి, తప్పకుండా చెబుతాడు"

"సరే, నేను నీకు చెప్పేస్తా ననుకో"

"అనుకోడం కాదు, చెప్పెయ్యాలి"

"అలాగే నమ్మా; కాని ఆ మనిషి తిమ్మన్నని వొప్పుకోడనుకో"

"ఒప్పుకోకపోతే దాని ఖర్మం మనకేం?" అనడిగింది గోవిందమ్మ, చేతులు విసురుతూ — మనసులో మాత్రం

"ఒప్పుకోకపోవడం కూడానా!" అనుకుంటూ.

నోటిలో మాట నోటిలోనే వుండగా "అలా అన్నావు గదా!" అంటూ మళ్ళీ అందుకుంది నారమ్మ.

"నేనూ యిలాగే అన్నాను నా కొడుకుతో; కాని నా వెర్రితండ్రి "నీకు తెలియదు పిన్నమ్మా" అన్నాడు. కోదండమ్మనీ ఆ మనిషినీ యెదట నుంచోబెట్టి యెవరైనా యేరుకో మంటే, కోదండమ్మని కళ్ళతో నయినా చూస్తానా – "

"అయ్యో, ప్రేమకి ప్రేమ – సరదాకి సరదా – అందాని కందం – వయసుకి వయసు – డబ్బుకి డబ్బు –"

"అదిగో అదే వద్దు. డబ్బా ప్రధానం, కన్నే తల్లీ, కన్నే. ప్రపంచకం అంతా కంటిలో వుందే. పోనీ, నాకొడుకే ఇంకేమన్నాడో – "

"ఏమన్నా డమ్మా?"

"ఇవాళ గొల్లపిల్లతో స్నేహం చేస్తున్నా నంటే, నిజమే; కాని మన సాని మనిషిమీదా, కట్టె మాత్రం గొల్లదాని దగ్గిరాను" అన్నాడు, మొగం వేలవేసుకుని. నేను చూడలేకపోయాను"

ఇది విని పొంగిపోయింది గోవిందమ్మ; కాని అలాంటి దేమీ లేనట్టు నటిస్తూ "పేరు చెప్ప మంటే యివన్నీ యెందు కమ్మా!" అనడిగింది.

"అడిగాను. ఈ గొడవ అంతా నా కెందు కన్నాను. ఇంకోటి కూడా అన్నానే"

"ఏమిటదీ?"

"నీకు చెప్పి నేను దాని కాళ్లు పట్టుకుంటా నన్నాను. నీ మీాదే యిష్టం లేదో, దాని కా చూపే లేదో –"

"అవును, తేల్చేస్తావుగా!"

"ఊ – హూ"

పెదిమలు బిగించుకుని ఇలా అంటూ ముందు తల అడ్డంగా వూపుకుంది, నారమ్మ.

"తరవాత "లాభం లేదు, ఇక ఆ వూసెత్తకు" అనే శాడు" అంది గంభీరంగా చూస్తూ.

"వింతగానే వుంది"

"వింత అంటావా, విచిత్రం అంటావా, ఎక్కడయినా చూశామా? ఎప్పు డయినా వుందా!"

"ఇంతకీ: అదెంత అందమైన మనిషో!" అంది గోవిం దమ్మ, గర్వ రేఖలు కళ్ళల్లో దిద్దుకుంటూ.

"ఎంత నాజూ కైన మనిషో! ఎంత కనికరం లేని మనిషో! దాని కళ్ళల్లో యెలాంటి మత్తుమం దుందో!" అంది నారమ్మ.

మొగం పక్కకి తిప్పుకుని కులికింది గోవిందమ్మ.

అది కనిపెట్టి "దానికోసం యింకా యెంతమంది నలిగి

పోతున్నారో? అసలు దానిక న్నవడిమీద వుందో!"
అంది నారమ్మ, మరి కులుకు అన్నట్టు చురుగ్గా చూస్తూ.

అరవిచ్చి వుండిన తామర మొగ్గ గభీ మని ముకుచు పోయిన ట్టయింది గోవిందమ్మ మొగం.

"బాబోయ్, తిమ్మన్న కూడా యిలా అనుకుంటు న్నాడు కామోసు నేమిదారీ? ఇన్ని విధాల సూచించినా నేనే అనువిషి నని నారమ్మత్త గుర్తించలేకపోయిం దేమి చేతునూ!" అంటూ తహతహలాడిపోయిం దామె.

దానిమీద "ఇప్పు డయినా మించిపోయిం దేమీ లేదు. బాగా పరకాయించుకో. బెట్టుసరికి పోయే యింత పరకూ చెడ్డా వింకానా? ఆ మనిషి నువ్వు కావనుకో. నువ్వు సాహసించే లోపున అది వొప్పేసుకుంటుం దనుకో. అప్పుడు తిమ్మన్న నీకేసి చూస్తాడా! గొల్లభాను మూడో మనిషిని చేరనిస్తుందా? నారమ్మ కాళ్ళమీద పడవేం?" అంటూ మనస్సు మళ్లీ తొందరపెట్టింది; కాని "వద్దూ — వద్దూ — లోకువయిపోతావ్? నువ్వే ఆ మనిషివి కాకపోతే నారమ్మ కాళ్ళమీద పడేది, గొల్ల భాను కాళ్ళమీద పడేది, తిమ్మన్న మెలాగా వొప్పు కోడు, ఆలోచించుకో. నీ మీద నిరాశ చేసుకున్నాక, గొల్లభానూ తిరపతమ్మా — యిద్ద రయినా రింకా యెంతమందిమీద కన్ను వేశాడో తిమ్మన్న? కనక,

నువ్వే ఆ మనిషి వయినా అక్కణ్ణుంచే రానీ రాయ బారం" అని బుద్ధి అంతకంటే గట్టిగా మళ్ళీ మందలించింది.

దీంతో, సాహసించలేక గోవిందమ్మ మళ్ళీ గుటకలు మింగి వూరుకుంది.

ఈ తపన కూడా గ్రహించేసింది నారమ్మ; కాని యేమీ యెరగనట్టు చూస్తూ "ఇంకొక్క వుపాయం వుండే కోడలా" అంది యెంతో బుర్ర చించుకుని ఆలోచించినట్టు.

"ఏమిటదీ?" అనడిగింది గోవిందమ్మ, ఆశగా.

"ఆమని షెవరో అదే గాని ఆ వుపాయం యేమయితే నీకేం?" అని తిరగవేసి కొట్టింది నారమ్మ, వెంటనే.

కొట్టి "మరి యిప్పుడు వెయ్యి చూతాం, యేమి అడ్డు ప్రశ్న వేస్తావో?" అన్నట్టు డెకారిస్తూ కూడా చూసిందామె.

ఇది సబబుగానే కనపడింది గోవిందమ్మకి.

డెకారిస్తున్నట్టనుమానమే కలగలేదామెకి.

"ఎన్ని వుపాయా లయినా పన్ను కోనీ, యెన్ని మాట్లయినా తిరగనీ, చివరికి ఆమనిషి మనమే అని నారమ్మత్తకి తెలియడం" అని గర్వించింది కూడా ఆమె.

"ఓః! అప్పు డెంత గమత్తుగా వుంటుందీ?"

కనక "అవును లే" అని వూరుకుం దామె.

# 27

తన ప్రజ్ఞకి గర్వం రాకపోలేదు; గాని గోవిందమ్మ అమాయికత్వాని కంత కంటే జాలి కలిగింది నారమ్మకి.

అయితే, తిమ్మన్న కార్యం నిర్వహించ వలసిన బాధ్యత, ఆబాధ్యత కంటేనూ యెక్కువయిం దామెకి.

దీంతో, చూస్తూ చూస్తూ వుండగా ఆమె ముఖం ప్రసన్నం అయింది.

"కథ ఎలా వచ్చిందో చూశావా!" అంటూ మళ్ళీ అందుకుం దామె.

"ఎప్పుడూ లేనిది నవ్వు ముచ్చటపడడం, ఎలా చెబితే అలా వినే నాకొడుకు ముక్కుటపడడం —"

"ప్రణయకలహం లా వుందంటావా యేమిటి?" అనడిగింది గోవిందమ్మ, చిరునవ్వు నవ్వుతూ.

"అదయితే లేని దేమిటీ! మనిషికి అంతకంటే మధుర మైనది మ రేం వుంది? తీర్పించుకునేవాళ్ళ కెంత రుచో, తీర్చేవాళ్ళకీ అంత రుచే అది; కాని యిదేమిటీ!"

"పోనీ, మానేస్తే?" అనడిగింది గోవిందమ్మ, కొంటె చూపులు చూస్తూ.

"ఎవరూ మానెయ్యడం?"

"మనమే"

"అదేమన్న మాటా?" అని బదులడిగింది నారమ్మ, "నిన్ను విడిచి పెడతానా?" అనుకుంటూ.

"దీనివల్ల యెవరికీ కూడా వచ్చేదీ పోయేదీ యేమీ లేదు కదా—విందా మని పూరికే సరదా మాత్రమే కదా –"

"నీపట్టుదల యేమయినా కానీ, నేను మాత్రం సాధించి తీరుతా నిది"

"నీపట్టుదల అలాంటిదే, నే నెరగనూ?"

"కాకపోతే నువ్వూ నువ్వూ బాగానే వుంటారు, మధ్య నారమ్మకా గండకత్తెర?"

"అదేమిటమ్మా?"

"అదేమిటమ్మా అంటే? ఇన్నాళ్లూ బతికి ఇంటి వెనకాల –"

"నేను చిక్కుల్లో దింపాను పాపం నిన్ను"

"చిక్కుల్లో దింపలేదు, పెద్దదాన్ని చేసి నెత్తిమీద పెట్టుకున్నావు. కాకపోతే, నన్నే యెందుకు కోరతావూ?"

నారమ్మ అభిమానంచూసి గోవిందమ్మ పొంగిపోయింది.

"కనక, భోజనానికి వచ్చా టప్పటికే లాగేస్తా నా రహస్యం. లేదూ, సాయంత్రం–"

"మూడుగంటలకు ఫలహారాని కెలాగా వస్తావుగా?"

"అవునవును, కనక వోపికపట్టు వదో బిత్తిరిచేసి

ఆ టక్కులాడి యెవరో తెలుసుకుని నీకు చెప్పకపోతే నే నివాళ నారమ్మనికాను చూసుకో ”

పళ్లు బిగించుకుని, గుడ్లురుముతూ నారమ్మ యిలా అనేటప్పటికి తృప్తి అయినట్టు పైకి సరే అని, మొగం వక్కకి తిప్పుకుని “ గంటకో మరో గంటకో ఆమనిషి మనమే అని తెలిసిపోతుంది నారమ్మత్తకి. తెలిశాక పరుగు పరుగున వచ్చి “ ఎంత నంగనాచివే మాఁవమ్మా ” అంటూ బుగ్గపొడిచి—కాదుకాదు, గాట్టిగా కౌగలించుకుని దీపాలు పెట్టాటప్పటికే తిమ్మన్నని తెచ్చి మనకాళ్లమీద పడే స్తుంది, మహా మంచి యెత్తు వేశాం కాదూ! ” అనుకుంటూ మురిసిపోయింది గోవిందమ్మ.

ఆవాలకం కనిపెట్టి “బాగానే నడిపిస్తావు గ్రంథం. ఎలాగయినా పోలీసుపెళ్ళానివి గదా! ” అనుకుని “యిక వెళ్లమ్మా ” అని మమకారం కనపరుస్తూ గోవిందమ్మని బయలుదేర తీసింది నారమ్మ.

“పెందలాడే వస్తావు కాదూ ” అంటూ అడుగు సాగించింది గోవిందమ్మ.

“ పడయాటప్పటి కల్లా రానూ ? ” అంది నారమ్మ, అక్కడే వుండి.

పదడుగులు వేసి తిరిగిచూసి “ అప్పుడే యేమి చూశావు నావయ్యారం? ” అనుకుంటూ అతివిలాసంగా

అడుగు సాగించి "నేనొస్తానో — లేకపోతే — నే రాజమహేంద్రవరం వెళ్ళి వుంటాను కనక, తిన్నగా యీ పూటకి దొరక్కపోవచ్చు. ఎంత పొద్దెక్కినా భోజనానికింటికి వస్తాడు కనక, ఫలహారాల వేళకి మాత్రం యిద్దరూ కలుసుకుంటాడు. అప్పుడు కూడా తిన్నగా చెప్పకపోతే గొల్లభామ నడుగుతుంది నారమ్మత్త. దానికి తెలవకుండా వుండదు. నారమ్మత్త చెప్ప నన్న వుపాయం యిదీ" అని వూహించుకుని "నేను మాటల మనిషినికా, యిదిగో చెబుతున్నాను విను. "ఫలానా" అని తెలియగానే వెళ్ళి అమాంతంగా ఆబంగారుబొమ్మని గుచ్చి కౌగిలించేసుకుంటూ" నన్న నారమ్మ మాట జపించుకుంటూ, నారమ్మని విడిచి వెళ్ళలేకుండా సందు మళుపు తిరిగేదాకా పదడుగుల కోమాటు తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళిపోయింది గోవిందమ్మ.

కనపడ్డంతవరకూ ఆమె కేసే చూస్తూ "నీయిష్టం వచ్చినట్టాడు నా అభ్యంతరం లేదు. అయితే, ఫలహారాల వేళ దాకా నువ్వూ, తరవాత నేనూనూ" అనుకుంటూ నారమ్మ యింటోకి వెళ్ళిపోయింది.

సందు తిరిగి, తన వీధిలో అడుగుపెట్టేటప్పటికి గోవిందమ్మ కొక బ్రాహ్మణపిల్ల కనపడింది.

"ఎక్కడికమ్మాయిగారూ!" అనడిగింది గోవిందమ్మ.

"మా విశాలక్ష్మమ్మత్తగారింటికి పిన్ని"

"ఎందుకూ!"

"పువ్వులకోసం"

"పువ్వు లెందుకూ!"

"అమ్మవారికి పూజచేస్తుంది మా అమ్మ"

ఇది వినగానే గోవిందమ్మకొక కొత్తవూహ పుట్టింది.

ఇంటికి వెళ్ళి కళ్లెదుటనే బిందె డంపేసి, నూతికి వెళ్ళి కాళ్లు కడుక్కుని, [illegible] పూసవుండిన బంతి పువ్వులు నాలుగు కోసుకువచ్చి [illegible] దగ్గిర కూచుని "అక్కా! ప్రేమ అంటే యేమిటో నువ్వే యెరుగుదువు ప్రేమించడం కూడా నువ్వే యెరుగుదువు. ప్రేమించి తపించడమూ, అవతలి మనిషిని తపింపచెయ్యడమూ కూడా నువ్వే యెరుగుదువు. ప్రేమకోసం సకలమూ విడిచిపెట్టెయ్యడమూ, ప్రియుని అకలుషప్రేమ సాధించుకోడమూ నీకే చేతవును. ప్రేమ అనుభవించడమూ అనుభవింపచెయ్యడమూ, సుఖించడమూ సుఖింపచెయ్యడమూ, ఆనందించడమూ ఆనందింపచెయ్యడమూ నీకు లీలావిలాసాలు. నీప్రేమా నీతృష్ణా, నీదీక్షా నీసాధనా, నీచాతుర్యమూ నీప్రాగల్భ్యమూ, నీఅనుభవమూ నీఆనందమూ దైవోపహారాలు [illegible] వరవళ్ళు. ఇవాళ్ళకి మళ్ళీ

యీ వొండుకట్టులో జీవప్రసారం ప్రారంభం అయింది. మాధుర్యావృత్తి విడివిన ప్రేమకి ఈజీవితంలో యిదే మొదలు. ఇది దావాగ్ని అయిపోకుండా అమృతంగా మార్చి నన్ను కటాక్షించు. నాజీవననిర్వృతి అను గ్రహించు" అని ప్రార్థించి, అశ్రువుల్ని రాధపాదాల మీద వుంచి, భక్త్యావేశంతో సాకరించిందామె.

# 28

"ఇప్పుడే పది అయిందంటే కోడలా" అంటూ వచ్చింది నారమ్మ.

"పొద్దెక్కిపోయింది పాపం. ఈపాటి కప్పుడే తిన్నది సగం జీర్ణ మయిపోయి వుండేది నీకు" అని పగస్తూ, మహారాణికి చేసినట్టు సకలలోపాచారాలూ చేసిందామెకి గోవిందమ్మ.

అదే లోకంగా వుండినట్టు కాకుండా "చెప్పాడా?" అని జెల్లిస్తూ గోవిందమ్మ అడగడమూ "కనబడందే?" అంటూ నారమ్మ చేతులు వేలవేసుకోడమూ యీలోపునే అయిపోయాయి.

అయినా, యింకో వాయిదా వుండనే వుంది కనక, నారమ్మ వొట్టుకూడా పెట్టుకుంది కనక, సుఖమయ కల్పనలే చేసుకుంటూ "యిదొక్కటే – యీాకసింతే"

వుండలేకపోయావు నువ్వు. రాకుండా వుండలేకపోయాను నేను. చెప్పొద్దూ? లోకంలో – మన వూళ్ళోనే గుట్టలు గుట్టలు అడగొచ్చు; కాని నీవంటి కోడ లెక్కడ దొరుకుతుంది నాకు? నేను వాకిట్లో అడుగుపెట్టేటప్పటికి, అంత దూరాన్నుంచే యెదురువచ్చి "వచ్చావా అత్తయ్యా?'' అంటూ రెక్క పట్టుకుని గదిలోకి తీసుకు వెళ్ళేది కోదండమ్మ. తాను జమీందారురా లయినా పేదదాన్నని కసింతైనా భేదం కనపరిచేదా యెప్పుడైనా? తన పక్కని కూచోబెట్టుకుని నీలాగే మీద చెయ్యేసి మాట్లాడేది. అక్కడికీ వొకనాడు గారెలు చేయించింది; గాని అవి నువ్విప్పుడు చేసినట్టు నురగల్లా వున్నయా, నీలాగ వెన్నా పంచదారా వేయించగలిగిందా మరి? అయినా, తిన్నమన్న స్నేహంచేశాక చాలా మారి పోయిందిలే. మీది వుద్యోగస్థుల సంప్రదాయం కనక, మొదణ్ణుంచీ యెరుగుదు నమ్మా నువ్వన్నీని'' అంటూ ఆకాశాని కెత్తేసింది దామెని నారమ్మ.

ఇది విన్నంతసేపూ కులుకుల్లాడుతూ వుండిన గోవిందమ్మ మొగం, స్విచ్ ఆఫ్ చేశాటప్పటికి బల్బు వెలవెలపోయే టట్టు, మాట పూర్తి అయేటప్పటికి చిన్నబోయింది.

దాంతో, అన్యమనస్కంగా అందుకుని "నువ్విలా చేస్తా వనుకోలే దమ్మా! కోదండమ్మ గొడవలు విన్నాక

ఆమని ఎవరో తెలిస్తే గాని తోచడంలే దమ్మా! మాయబేరగా ళ్లీపూటే రావాలా బత్తాయిపళ్ళకోసం!” అని అనేకవిధాల దేవుళ్ళాడిం దామె.

“కబురు మీద కబురు నాలుగు కబుర్లు పంపాను. ఇంటో లే రంటే నమ్మలేక — యెన్నడూ యెరగను — అయినా, చిట్టితల్లివి నీ కోసం పనికట్టుకుని వెళ్ళాను గొల్ల దాస యింటికి. “నేనేం కుండలో దాచి ఏంతవేళా నను కున్నారా అత్తయ్యగారూ!” అంటూ చాలా చాలా నొచ్చుకుంది పాపం అది. ఎందుకూ! చివరి కాపేగా! గట్టుపనీ, భోజనానికంటికి రాదూ! నీ దపు కూడలేకుండా వున్నా నివాళ తేల్చేస్తా సహస్రా వ్యవహారం, తప్ప” దంటూ గోవిందమ్మ చేతులు పట్టుకుంది నారమ్మ.

అంతటితో ఆ మమకారం ఆపుకోలేనట్టు గోవిందమ్మ బుజం తట్టింది, గడ్డం పుణికింది, ముంగర్లు కూడా సవ రించిం దామె.

మూర్ధాఘ్రాణం కూడా చేసిం దామె చివరికి.

అంతసేపూ నారమ్మ నానుకుని పరవశ అయి వుండి పోయింది గోవిందమ్మ.

“పదిమా ట్లయినా వెళ్ళా నీమధ్య తిరపతమ్మ యింటికి; కాని వొక్కమా టయినా దా న్నిలాగ దగ్గిరికి తీసుకో గలిగానా నేను! నా కోడు కయినా కులంమనిషి. అని

భ్రమపడ్డాడు గానీ, మొదటే నాతో చెబితే గట్టిగా కూక లేసి వుండనూ వాణ్ణి?" అనడిగింది నారమ్మ.

"అవునమ్మ, కోదండమ్మతో స్నేహం చేసిన మనిషికి తిరపతమ్మతో స్నేహం యేమిటి, దౌర్భాగ్యం కాక పోతే!" అంది గోవిందమ్మ.

తరవాత గొల్లభామ మాట వచ్చింది.

నారమ్మ చెప్పినకొద్దీ ముచ్చటపడుతూ ఆలకించింది గోవిందమ్మ.

గోవిందమ్మ విన్నకొద్దీ మరీమరీ, చమత్కరించి చెప్పింది నారమ్మ.

మొత్తాని కిలాగ వొంటిగంట దాకా అదీ యిదీ చెప్పి గోవిందమ్మని లాలించి లాలించి, బుజ్జగించి బుజ్జగించి, బులిపించి బులిపించి, వూరించి వూరించి, కవ్వించి కవ్వించి చివరికి గాలిమేడలో కూడా ప్రవేశపెట్టి "మరి పోతా...... అలాగే అలాగే మూడు కొట్టకుండానే వస్తాను, నాకేం పనీ? ...... తేసుతేదు మరిచిపోతానా, యెంతమాటా? . ... నోరు విప్పి యెన్నడూ యేమీ అడిగి యెరగని నా కోడవు, వస్తా కాదూ, చెబుతా — చెప్పితీరతా నన్నాను కాదూ? ... .. తలుపు వేసుకో అమ్మా" అంటూ బయటికెళ్ళి తేప్పమీద తేన్పు గర్రున తేన్చుకుంటూ వెళ్ళిపోయింది నారమ్మ.

## 29

ఇల్లంతా సవరించుకుని, అద్దంముందట నుంచుని అలకలూ బర్నాముడీ సద్దుకుని మరో పావుగంటలో వాకిట్లోకి వచ్చింది గోవిందమ్మ.

"బల్లమీద కూచుందా" మనుకుంటూనే వీధితలుపు తెరిచింది.

"ఎండలు ముదిరిపోయా" యనుకుంటూనే గడప దాటి చివరి చీకిమీదికి వెళ్ళినుంచుంది.

"ఆకాశం కానిర్లు కమ్మేసిం దేంచెప్మా!" అనుకుంటూనే వీధిపొడూగునా అటూ యిటూ చూసింది.

తూర్పువేపున, రెండు ఫర్లాంగుల దూరాన సంత చావళ్ళ దగ్గిర బస్సొకటి నిలిచివున్నట్టూ, కొందరు దిగుతూనూ కొంద రెక్కుతూనూ అడావడిపడుతున్నట్టూ, వొక మనిషి పై కెక్కి దింపే సామాను దింపుతూనూ ఎక్కించే సామాను ఎక్కిస్తూనూ వున్నట్టూ, ఇంతలో బస్సు వెళ్ళిపోతున్నట్టూ, పోలో మాటూ కొంటెపిల్ల కాయలు దానివెంట పడ్డట్టూ, కనబడింది.

"ఏమి ప్రయాణాలు వచ్చాయి మనుష్యుల్కి!" అనుకుంది గోవిందమ్మ.

ఇటు చూడగా, పడమటివేపున, శాస్త్రిగారి కండువా

వేనుకని అరఫర్లాంగు దూరాన వొక పురుషుడు వస్తు న్నట్టు కనపడింది.

"వెన్నెట్లో లాగ ఎంత ఠీవిగా నడుస్తున్నాడో" అను కుంది గోవిందమ్మ.

ఎదటి పాడుదొడ్డిలో గండుపిల్లులు కొట్లాడుకుంటున్న ట్టయి అటు చూసింది.

మళ్ళీ అటూ యిటూ చూసింది.

పురుషుడు సమీపించాడు.

నెత్తిమీది కండువా అత్తాకోడళ్ళంచులు మిలమిలా మెరస్తున్నాయి.

చేతిలో బత్తాయివళ్ళ చిక్కం దిగలాగుతోంది.

శంకించి పరకాయించగా చెమటలు కక్కుకుంటూ తిమ్మన్న.

"బా — బోయ్" అనుకుంటూ బేజా రయిపోయింది గోవిందమ్మ.

ఆమె గుండెలు కొట్టుకున్నాయి.

ఎగిరివెళ్ళి యింటో పడదా మనుకుంది; గాని కాళ్ళలో వొణుకు పుట్టి కదలలేకపోయింది.

వెనక్కి తిరిగయినా నుంచుందా మనుకుంది; గాని తిమ్మన్నకి కంటేయెక్కువ చెమటలు పట్టి కాళ్ళు జారి పోతున్నట్టయి, పక్కవాటుగా అరుగుమీదికి వాలి

పోయి మొగం మాత్రం వంచుకోగలిగింది.

కళ్లు మూసుకుందా మని చూసింది; గాని కిం గంట చూడకుండా వుండలేకపోయింది.

తన అవస్థ అతనికి తెలియకుండా జాగ్రత్తపడదా మను కుని శరీరం కుంచించుకుంది; గాని వొళ్లు ఝల్లు మని ఆపాదమస్తకమూ పులకలు పేటెత్తాయి.

"విన్నటిలాగ నేనే పలకరించేస్తా నేమో కొంపతీసి" అనుకుని అంగుళిసంవృతాధరంగా నోరునొక్కుకుంది; గాని "అల్లుడా" అని పిలిచినట్టే అయి గాభరాపడి పోయింది.

అప్పటికి సరిగా ఆమె యెదటికి వచ్చాడు తిమ్మన్న.

ఆమె గుండెలు మళ్ళీ దుడుకూ దుడుకూ కొట్టు కున్నాయి.

ఆమె నుంచుని వుండిన చివరి చీడీకీ అతను నడుస్తూ వుండిన వీధిరేఖకూ రెండుమూడు గజాలే యెడం వుంది.

చుట్టువట్ల యెక్కడా నరసంచారం లేదు సరికదా, యెదటి దొడ్లో పిల్లుల కొట్లాట కూడా తగ్గిపోయింది.

దాంతో, ఆనడివీధి అంతఃపురం లాగా, ఆమిడియెండ, కలకత్తాలో కోదండమ్మ అనుభవించిన మెరుపుదీపాల వెలుగు లాగా తోచిం దామెకి.

కళ్ళల్లో వత్తులు వేసుకుని తాను కాచుక్కూచుకుని వుండినట్టూ, ఉండగా వుండగా, తక్కుతూ తారుతూ

తిమ్మన్న వచ్చినట్టూ కూడా తోచిం దామెకి.

మొదట ఆనందం పురకలు వేసింది; గాని, అంతలో వచ్చి సిగ్గు ముంచేసింది.

"వొక్కదూకున దగ్గిరికి వచ్చి, మీద చెయ్యివేసి, మొగంమీద మొగంపెట్టి కువకువలాడతా డేమో?"

"ప్రియా" అని పిలిచేస్తా డేమో?"

"తెలిసిపోయింది లే" అన్నట్టు నన్నని యీలవేస్తా డేమో?"

"వోస్! అదంతా సిగ్గు కామోసు" అంటూ వోర చూపులు చూస్తా డేమో?"

"సగం బత్తాయిపళ్ళు అరుగుమీదికి గిరవేస్తా డేమో?"

"చివరికి, మొగ మయినా వొకమా టిలా తిప్పు కుంటా డేమో?"

ఇలా అనుకుంటూ ముక్కటపడుతూ బెంకీపోయింది, ముచ్చటపడుతూ యెదురూ చూసిం దామె.

కాని, తిమ్మన్న, అడుగు ముందుకే వేశాడు.

పెదిమలు బిగించుకునే వున్నాడు.

ఊపిరి బిగపట్టుకునే వున్నాడు.

చూపులు దారిమీదే లగ్నం చేసుకుని వున్నాడు.

మొగం వంచుకునే వున్నాడు.

...లెరికి, అక్కడిదాకా యెలా వచ్చాడో, అక్కణ్ణుంచీ అలాగే వెళ్ళిపోయాడు.

ప్రాణాలుగ్గబెట్టుకుని, బలవంతాన మెడ తిప్పుకుని, వుసూరుమంటూ ఆమె కడకంట చూశాటప్పటికాయిల్లే దాటేశాడు.

# 30

పిడుగుపడ్డట్టయిపోయింది గోవిందమ్మ.

మొదట చు – ర్ – రు మన్న కళ్లు తరవాత గి – ర్ – రున నిండిపోయాయి.

"ఏం, నొప్పిగా వుందా చిట్టితల్లీ? నా రాజా తిమ్మన్న ముద్దులు గులుకుతూ చూస్తే, నువ్వు నిప్పులుకక్కుతూ చూశావలా లేదేం యిప్పుడు?" అని కళ్ళు వటవట్టాడిస్తూ వెనకాలేవచ్చి "కోదండమ్మ వో – క్క చరుపు చరిచినట్టు కాగా తల దిమ్మెక్కి, వాకట్లోకి తూలిపోయి కవాచీబల్లమీద కూలబడిపోయిందామె.

ఉక్రోశమూ ఆక్రోశమూ, యీర్ష్య, క్రోధమూ, రోషమూ, దుఃఖమూ, ఉద్వేగమూ ముప్పిరిగొని వూపేశాయామెని.

దాంతో, చెయ్యిపెట్టి దేవేస్తున్నట్టయి గుండె బదిమేసుకుంది.

అంధకారం ఆవరిస్తున్నట్టయి కళ్లు గుచ్చేస్తూంది.

గాలిలో ఎగిరిపోతున్నట్టయి శరీరం తూగిపోతుంది.

అయినా, రెండుమూడు నిమిషాల దాకా ప్రపంచం తెలియలే దామెకి.

అప్పుడయినా వెర్రిచూపులు చూస్తూ లేచి కూచోబోయింది; గాని నిలవరించుకోలేక మోచేతులమీదికి వాలిపోయింది.

ఈదౌర్బల్యానికి సాయం, వీధిలో జరిగిందంతా మళ్ళీ కళ్ళకు కట్టినట్టు తోచి హృదయం మండుకుపోయింది.

ఆమనిషి తానే అనుకుంటూ మురిసిన మురిపెం అంతానూ — "ఆమని షెవరో నాకే చెప్పావు కాను చూశావా?" అంటూ నారమ్మ దేవుళ్ళాడినకొద్దీ తా ననుభవించిన నిభృతానందం అంతానూ — తనమాట నారమ్మనోట అనిపించుకుందా మని తాను చేసిన టక్కులన్నీనీ — ఆమనిషి తానే అని తిమ్మన్న నారమ్మకి చెబితే, బుగ్గలు నొక్కుకుంటూ వచ్చి నారమ్మ తనని నిష్ఠురా లాడితే "యేమో నే నే మెరుగుదునూ? నీమాట మరీ బాగుంది" అంటూ ఆమె నాడించడానికి తాను వేసుకున్న యెత్తంతానూ ఆమంటలో బుగ్గి అయిపోగా కుతకుతలాడిపోయిం దామె.

ఈస్థితిలో "ఏం, అయిందా! నామాట విని పస్తా యించావు కనక సరిపోయింది; గాని లేకపోతే సొమ్మ పోయి ఒమ్మ్నాపట్టిం దన్నట్టు నష్టాపడి నవ్వులపాలూ అయిపోయి వుందువు, చూశావా?" అని బుద్ధి టోకా యించగా "ఏమో. యిలాంటి విడ్డూరం యెక్కడేనా వుందా! ఈమాయ యుద్ధం వచ్చి సృష్టిధర్మాలే మారి పోయేటట్టున్నాయి. మొగాడు కదా, — ఇప్పుడు కాకపోతే మానె యిదివర కయినా మనసుపడివున్నాడు గదా, — నువ్వే ఆమసిషివి కాకపోయినా కులం మనిషివే కదా, — యీవూళ్లో కల్లా చక్కని చుక్కవు కూడా కదా, — పైగా, నారమ్మ రాయబారం కదా, — వినక పోతాడా అనుకున్నాను; గాని యింత కటికగుండెలవా డని యెవరెరుగుదురూ? కాకపోయినా, యిలా కసిన్ని కాఫీనీళ్లు గొంతుకులో పోసుకుని అలా పొలం వెళ్ళాడు కామోసు, తీరా వచ్చాటప్పటికటు నెత్తి మాడా, యిటు కడుపు మాడానూ. దీనికి సాయం, కారు చెమటలతో చూపు మందగించి, — ఇంతకీ: అసలు, నిన్ను చూశాడో లేదో పాపం, యీమాత్రం దానికే అప్పుడే బేలపోతావేం పసిపిల్లలాగా, చాల్చాలు, శాబాసు" అని మనస్సు సాగతీసుకుంది.

దీంతో నలుసంత ఆశ కనబడి కసింత తేరుకుందామె.

ఈ తేరుదలతో "గడుసుపోకడలకు పోక తానే కభు రంపి మనసిచ్చి మసలుకుంది కనక, తిమ్మన్న చేతిలో పూలబంతి అయిపోయింది కోదండమ్మ. లేనిపోని వేషాలు వెయ్యక తానే కోరి, పాదసేవకురాలయిపోయింది కనక, తిమ్మన్న చేతిలో వెన్నముద్ద అయి వుంది గొల్లభామ. మన కలాంటి యోగ్యత యేదీ? మనకి మనమే కోలక పోవడం అలా వుండగా, అతి నాశపడ్డం తెలుసుకు నయినా దూరం ఆలోచించగలిగామా మనం? కనకనే మనకీ యాతన" అని గుర్తుకి వచ్చిం దామెకి.

అహంభావం కరిగిపోయింది.

ప్రసన్నే అయిపోయిం దామె.

వెంటనే పమిటి సర్దుకుంటూ లేచి కూచుంది; గాని వీధిగుమ్మాన రివ్వున గాలివిసురు వచ్చి ఉక్కిరిబిక్కిరి కాగా మొగం పక్కకి తిప్పుకుంది.

అప్రయత్నంగా, వీధిగుమ్మాని కొక పక్కగా వుండీన పటంమీాద పడిం దామె చూపు.

అది యిదివర కెన్నోమాట్లు చూసిందే అయినా యీా ఆకస్మికసన్నివేశంతో అందులో కొత్త పిశిష్టత స్ఫురించగా చకితి అయిం దామె.

మధురానగరం వెళ్ళడాని కప్పుడే రథం యెక్కి కూచున్నాడు కృష్ణుడు.

రెండుచేతులా పగ్గా లెత్తిపట్టుకుని "సెలవా?" అన్నట్టు వెనక్కి విరగబడి చూస్తున్నాడు సారథి.

మోరలు పైకెత్తుకునీ, చెవులు రిక్కించుకునీ, యెప్పు డెప్పు డన్నట్టు చురుగ్గా చూస్తున్నాయి గుర్రాలు.

కాని, కృష్ణుణ్ణి విడవలేక, యెందరో గోపికలు వచ్చి చుట్టుకుని వున్నారు.

ఇసక వేస్తే రాలకుండా వీథంతా నిండిపోయి వున్నారు గొల్లభామలు.

సందిటపట్టుకుని వొక గోపిక దిగలాగుతోంది.

కాళ్ళు పట్టుకుని మరో గోపిక రథంమీదే యీడిగిల పడిపోయి వుంది.

నలుగురు గోపికలు రథాని కడ్డంగా నుంచోగా, గుర్రాలు కదలకుండా మరో నలుగురు గోపికలు పగ్గాలు పట్టుకునుంచుని వున్నారు.

చుట్టూ మూగియున్న గోపికలలో — ప్రయాణం సాగనివ్వడానికి వీల్లే దన్నట్టు తీక్ష్ణంగా కొందరూ, జాలిగా కొందరూ, దిగాలు పడిపోయి కొందరూ, ఆత్రంగా కొందరూ చూస్తున్నారు.

ఇంతసాగి జనరా ళ్ళింతింత చేస్తున్నా కృష్ణుడు చలించటంలేదు.

అతని చూపుల్లో నిశ్చలదీక్ష కనపడుతోంది.

వేణుగానం చేసి యిళ్ళల్లో గృహకృత్యాల్లో మునిగి వుండిన గోపికలను యమున వొడ్డు కాకర్షించిన కృష్ణు డేనా యిత నన్నట్టున్నా డతగాడు.

అది చూసి ధర్మమే అనుకుంది గోవిందమ్మ.

"ఎంత ప్రేమ వుండినా — ఎంత రసికు డైనా — లోలుడున్నా అయినా, బతుకంతా గోపికలతో విలాస క్రీడలలో గడిపివెయ్యడమేనా కృష్ణుని పని?". అని ప్రశ్నించుకుం దామె.

"అయితే, మరి తిమ్మన్న మాట?"

ఎవరో అడిగిన ట్టుంది యీ ప్రశ్న.

ఉలిక్కిపడిం దామె.

విలాసవతులకోసం, — తోటా దొడ్డీ, డబ్బూ దస్కమూ వదులుకునీ, పిల్లలను పాడుచేసుకునీ బికారి అయిపోలసిం దేనా అతను?

తాను తిరస్కరిస్తే కుక్కన పే నయిపోయివుండి — మళ్ళీ తాను కావా లనుకుంటే చేతులు కట్టుకు వచ్చి "దాసోహం" అనవలసిం దేనా అతను?

తన యింగితం గుర్తించుకుంటూ పడిగాపులు పడి కూచో వలసిం దేనా అతను?

గోవిందమ్మకే అసంభావ్యంగా కనపడిం దిది.

"తోచినప్పు డల్లా అతను నీ యింటికి వస్తే నువ్వా

మాత్రం భరించగలవా? చేని కయినా వేళా పాళా వుండవద్దూ?" అని ఎవరో అడిగిన ట్టయిం దామెకి.

"అయ్యో, కాదూ?" అనుకుం దామె.

దీంతో ఆమె గాఢా[illegible]నికి వచ్చేసింది.

వెంటనే ఆ సునుగారం ప్రణయంగా పరిణమించింది.

నారమ్మ శంభుం జ్ఞాపకం వచ్చి, గుచ్చి కౌగిలించుకోడాని కామె మీాది మీాదికి వస్తున్నట్టున్నా తోచింది.

పొంగిపోయింది గోవిందమ్మ.

"తాన కోరి [illegible] కనక, తిమ్మన్నని అనుసరించి తిరిగింది కోరగండనక [illegible] శ్లాఘాపు కూడా పడిగాపులు పడి వుండి అతని దయ సంపాదించుకుంది కనక అలాగే మసులుకుంటోంది.

కాని "తానే మనసుపడి, తానే కోరి, తానే తపస్సు చేసి మన అనుగ్రహం సంపాదించుకోడం కనక, తిమ్మన్నే మన కనుసన్నల్లో వుండిపోతా" డనుకుని గర్వించిందామె.

ఆమె మొగం యింతయింది.

తా నెప్పుడేనా కాస్త బెట్టుసరీ చూపిస్తే తిమ్మన్న కాళ్లా వేళ్లా పడ తాడు.

కాళ్లూ కడుపూ పట్టుకుని నారమ్మ కూడా ప్రాధేయ పడుతూ వుంటుంది.

ఓః! ఏమి సొగసూ!

ఏమి దర్జా !

ఏమి సుఖమూ !

నారమ్మ యెలాంటి గొడవలు చెప్పిం దనీ? అవి తన కెంత వుపయోగిస్తా యనీ?

"కనక" నారమ్మత్తని చెయ్యి జారిపోకుండా చూసు కోవా" లనుకుం దామె.

రకరకకాల వుపాయాలు తోచాయి.

ఎన్నో విధాల ఫలితాలు స్ఫురించాయి.

వెంటనే వుద్వేగంగా లేచి, వీధి తలుపు వేసేసి వాటిం టోకి వెళ్లిపోయిం దామె.

# 31

"వేడి చల్లారిపోకుండా తానే వస్తుందా, మనం వెళ్లి తీసుకురావాలా?" అనుకుంటూ గోవిందమ్మ వీధి తలుపు తెరిచా టప్పటికి "తలుపు తట్టడమా, కనిపెట్టుకుని వుండడమా?" అనుకుంటూ గడప దగ్గిరిగా నుంచుని వుంది నారమ్మ.

ఇద్దరి కళ్లూ మెరిశాయి.

"నీకోసం రావా లనుకుంటున్నానత్తా" అంది గోవిందమ్మ, వయ్యారంగా పక్కకి తప్పుకుంటూ.

"అయ్యో, ముసిలిదాన్ని చేసి తిప్పితిప్పి కొట్టావుగా నా లెనుకోవూ మరి!" అంటూ ముసలకించి, అమాంతంగా ఆమెని గుచ్చి కౌగలించుకుంది నారమ్మ.

దాంతో, కళ్లు దరముకుళితాలూ, మొగం వికాసోజ్జ్వలమూ, హృదయం ఆనందవిహ్వాలమూ కాగా నిలువుగా కరిగిపోయింది గోవిందమ్మ.

తాను తిరస్కరిస్తే కిక్కురుమనకుండా తిమన్న తప్పించుకు తిరగడమూ, యాదాలాభంగా తాను పిలిస్తే నవినయంగా వచ్చి సాదరంగా పటం చూపించి వెళ్లిపోవడమూ బత్తాయిపళ్లు పట్టుకువెడుతూ తనని కన్నెత్తి చూడకపోవడమూ, అటు బంగారబ్బాయమ్మ గొల్లభామ యెంత సుఖిస్తూ వుండినా యిటు తనకోసం కుసిల్లిపోతూ వుండడమూ — ఇదంతా తన కళ్ల యెదట ఫిలిం నడిచినట్టు కనబడగా, పరవశ అయి నారమ్మ మీాద వాలిన్నీపోయిందామె.

అది గ్రహించి తాడుబారి నిష్ఠురాలారంభించింది నారమ్మ.

"ఎంత నంగనాచివే మాతల్లీ! గుట్టుగా పడివున్నా, వహూయికురాల వనుకున్నా, నెన్ని టక్కులు నేర్చావే మాయమ్మా"

గోవిందమ్మ మాట్లాడలేదు.

మొగమెత్తి చూడనూ లేదు.

"పదిమంది వగలాళ్ల నాడిస్తున్నాను నేను, నువ్వే నన్నాడించావు గదే చిత్రాంగీ! కోదండమ్మ జంత అను కుంటే దాన్ని మించి నువ్వు జగజ్జంత ఎయిపోయావుగదే మాయలాడీ"

"నన్నే అంటావా అత్తా?" అనడిగింది గోవిందమ్మ చిరునవ్వు నవ్వుతూ.

"అనక? ఆమని షెవరో చెప్పాడు కా డని నా కొడుకు నాడిపోసుకున్నాను నేను, మరి నువ్వు? బెల్లించి బెల్లించి నాచేత వాగించావు గానీ "ఇలా జరిగిం దమ్మా" అని కసింతయినా నాకు చెప్పావా నువ్వు?"

ముసిముసి నవ్వులు నవ్వుకుంది గోవిందమ్మ.

ఆమె మొగాన విజయగర్వం గప్పు మంది.

"అదెవరో చెబుతావా, అభోజనం కూచోనా!" అని హాతం చేశాటప్పటికి గుడ్ల నీళ్లు కుక్కుకున్నాడు నాచిట్టి తండ్రి. దస్గుత్తిక పట్టుకోగా నువ్వని సరిగా పల కనే లేకపోయాడు వెర్రినాయన. వాడి దీనముఖం చూశా టప్పటికి నాకడుపు చెరువయిపోయింది.

గోవిందమ్మ హృదయఫలకంమీద ధన్ను మని దెబ్బ పడ్డటయింది"

బాష్పప్లుతా లయి వుండిన ఆమె చూపులు ఝళిత్తా

లయిపోయాయి.

అది గుర్తించి "ఎంత వేదన కలిగించావే కటికిగుండెల దానా! నీకోసం నిద్రాహారాలు మానుకుని, చిక్కి కంప అయిపోయాడు గదే నాకొడుకు, పత్తిగింజల చూపుల దానా!" అంటూ మళ్లీ వొక్క విసురు విసిరింది నారమ్మ.

గోవిందమ్మ లోపల్లోపల కుములుతూ అలాగే వ్రాడిపోయింది.

"నిన్న సాయంత్రం నువ్వన్ని విధాల బెల్లించడం చూసి తిరస్కారని మాటలు వినడాని కుబలాటపడుతున్నా వనుకున్నాను; గాని నీకష్టమాత్రం తెలిసినా నాకొడుకుని తీసుకు వచ్చి—"

మాట సగంలో అడ్డువచ్చి "జరిగిపోయినదానికి నవ్వేమన్నా పడతాను; గాని నన్ను నీకడుపులో పెట్టుకోవ్రా అత్తా" అంటూ నారమ్మ మీద వాలి పోయింది గోవిందమ్మ.

"అమ్మయ్యా" అనుకుంది నారమ్మ.

దరిలేని సముద్రంలో పడి కొట్టుకొట్టుకుని వొడ్డు చేరుకున్నంత ఆనందం అనుభవించిం దామె.

దాంతో "నాతల్లీ, భయపడకు" అని వల్లమాలిన మమకారం కనపరుస్తూ, ముందు, మెల్లిగా గోవిందమ్మ వీపు తట్టింది.

"నేను బతికివున్నంతకాలమూ దేవుడు కూడా నీకు అడ్డురాలేడు, బెంగపెట్టుకోకు" అంటూ, ఆరవాత, ఆమె మొగం నిసుంది.

చిన్న కామిని పొంగిపట్టుకుని ప్రారంభించింది.

"ఇలాంటి పనులు సాధారణంగా తప్పుదారిని పడతాయి. ఎంతో సుందరికి — మొగాళ్ళ కేమిటి ఆడవాళ్ళ కేమిటి సరయిన మనిషి దొరకడం కష్టం. నా కొడుకు, ఆ మనిషి నువ్వే అని చెప్పటప్పటికి నాకు ప్రాణాలు లేచివచ్చాయి. నువ్వు చేసిన టక్కు లన్నీ మరిచిపోయాను. దానికేం, నీవంటి వయసు పిల్లలకు కాక పోతే నావంటి ముసలిదానికి వస్తాయా తల్లీ, టక్కులు? కనక చెప్పొద్దూ? అడకపడక, బంగారుకొండవు నీచూపు మనుమన్మథునిమీద పడ్డందుకెంతో పొంగి పోయాను నేను. నీ వయసూ, నీరూపమూ, నీ హొయలూ, నీవయ్యారమూ చూసినప్పుడల్లా "దేవుడా, నీకు కళ్లు లేవూ?" అనుకుంటూవచ్చా నెన్నోమాట్లు. కోదండమ్మ పోయినప్పట్నుంచీ "యేమిరా భగవంతుడా, నాకొడుక్కి ఇలాంటి మంచిమనిషిని కూర్చా లని నీకు తోచలేదూ?" అనినన్ని అనుకుంటూవచ్చాను. కానయితే ఆలస్యమే అయిందనుకో, అయినా, చివరికి నా తపస్సు ఫలించింది"

"తప్పో ఒప్పో —"

"తప్పా? ఇది తప్పని నామొహట యెవ డనగలడో అనమను"

ఇలా అంటూ నారమ్మ కళ్ళగ్గా చూశాటప్పటికి గోవిందమ్మ స్తిమితపడింది.

"కళ్ళు తెరవని వయస్సులో మోడయిపోతే "అయ్యో" అన లేనివాళ్ళు వచ్చి, ఇవాళ, యే మొగం పెట్టుకుని చక్కట్లు దిద్దగలరూ?"

"అదీ నాకూ" అనుకుంది గోవిందమ్మ.

"కానయితే తిరపతమ్మా కోరింది నాకొడుకుని. అయినా నేను సంతోషించానా మరీ!"

గోవిందమ్మ చూపుల్లో గర్వం ప్రతిఫలించింది.

"ఇంతకీ:— గొల్లది చక్కని చుక్క. సరసురాలే. అయినా, నామనస్సు పీకుతూనే వుంది కులంమనిషి కాదని. ఇంకెందుకూ? నిమిషంలో గొల్లగాన్ని — "

ఇలా అంటూ గోవిందమ్మని విడిచి వాక్క అడుగు వెనక్కి వేసింది నారమ్మ; కాని "వద్దువ" ద్దంటూ ఆమె నాపుచేసి గోవిందమ్మ "కులంమనిషితో స్నేహం చెయ్యడానికి — "

"ఒప్పుకోక? అబ్బో, కులం కూడా సరిది — "

"అది కాదమ్మా, తిమ్మన్న కావాలంటే అదేమీ చెయ్యలేదనుకో. అయినా, అమాయికురాలు పాపం —

దాని సుఖం నే నెందుకు పడగొట్టాలి? మొగుడూ పెళ్లాలకంటే యెక్కువగా వున్నారు పాపం, దాని వుసురు నాకెందుకూ?"

"అలా అంటావా?" అని పస్తాయించినట్టు నటిస్తూ మళ్ళీ గోవిందమ్మను పొదువుకుంది నారమ్మ.

"కాకపోయినా, దాని యింటో లాగ రాత్రీ పగలూ నాయింటో – "

"అమ్మమ్మా" అంటూ ముందు నాలుక కరుచుకుంది నారమ్మ.

"నాకొడుకు బాహాటంగా నీయింటికి రావడానికి వల్లా? ఎంత ప్రేమవుండినా మర్యాద పాడుచేసుకుంటామా? ఎప్పుడో వూరు మాటుమణిగాక – అదయినా మూడో కంటివాడికి తెలియకుండా – "

"అదయినా, వారాని కోమాటో, తప్పితే రెండు మాట్లో, విన్నావా? వీలయితే యాత్ర పేరుచెప్పి – "

"అది బాగుంది. దక్షిణాది యాత్రలు పేరు చెప్పి చెన్నాపట్నం చేర్చేస్తాను, సరా?"

"చెప్పానుగా? నువ్వు నన్ను కడుపులో పెట్టుకుంటేనే. లేకపోతే ముందే చెప్పెయ్యి"

"ఎంతమాటా? నీ ప్రాణాలకు నా ప్రాణా లడ్డు పడెయ్యనూ తల్లీ?"

"ఊళ్లో వున్నప్పుడు నీకొడుకు నాయింటికే వస్తాడా, కాళ్లు కడిగి శిరస్సున చల్లుకుంటూను. తన మీదకే – "

"కోదండమ్మా అంతేగా! నీ కొడుకు డెలా సరదా పుడితే – బత్తాయిలోటకి వెడదా మని వుంట సమకో. మూడో నిమిషానికి – "

"నన్నేమీ అడగనక్కరలేదు, నీకొడుకు దే యిష్టం"

"అలాగే నమ్మా అలాగే. నిన్ను కనిపెట్టుకునే వుంటానుగా!"

గోవిందమ్మకి, దేవి ప్రత్యక్షమై వర ప్రసాదించిన ట్టనిపించింది. దాంతో, ఆర్ద్రకంఠ అ... ... ఋణం తీర్చుకోగలనా అత్తా!" అంటూ నారమ్మ చేతులు పట్టుకుంది.

"ఋణమా" అంటూ యెగిసిపడింది నారమ్మ.

"కితం జన్మలో యేమి పాపం చేసుకున్నానో, యిప్పుడు నీకు సేవచేసుకు నయినా – "

"అంతమాట అనకమ్మా అత్తా" అంటూ గునిసింది గోవిందమ్మ.

"నీదయముందు ఇదెంతమాట తల్లీ! తప్పు లేదమ్మా మొగమాట పడకు. కాకపోయినా, పడుచుపిల్లలు ముసిలాళ్ళని కనిపెడుతూ వుండాలి. అలాగే ముసిలాళ్లు పడుచుపిల్లలకు ఆసరా – "

"నీఆసరా చూసుకునే సుమా? విన్నావా అత్తా!" అంది గోవిందమ్మ, గద్గదికతో.

"అలాగే, నీకు లోటు రానిస్తానా నేను!"

"నిమ్మళన్న చూపులకు బదులు చూపులు చెల్లించ లేకపోయానే గాని — అప్పణ్ణుంచీ అటా ఇటా అని గుంజాటనపడుతూనే వున్నాను. సరే, నిన్న మధ్యాహ్నం మొదలు వేగే పోతున్నాను"

"నాతో చెప్పావు కాదేం తల్లీ!"

"తెగించలేకపోయా నమ్మా"

"ఇదిగో, అక్కడే వుంది మనిషికీ మనిషికీ తేడా" అంటూ అవ్యవధానంగా అందుకుని, గోవిందమ్మ కణతలమీద మెటికలు విరిచి, ప్రారంభించింది నారమ్మ.

"తల విలవ నోరు చెబుతుంది"

"అవు" నంది గోవిందమ్మ.

"బాగా జ్ఞాపకంచేసుకో. నవ్వు రుసరుసలాడాక — నీకు నువ్వే పలకరించే. ఇంకా మళ్ళీ నీ కేసి చూశాడా మరి నా కొడుకు!"

"లేదత్తా!"

"నీకు నువ్వో పిలిచి — ఏకాంతంగా — దగ్గిరసా నుంచుని—వీధిలో నే అనుకో, అయినా యెవరూ లేరుగా, అంతసేపు మాట్లాడినా యీ పూసు తెచ్చాడా వాడు!"

"లేదమ్మా పాపం, లేదు."

"నిన్న సాయంత్రమూ యివాళ పొద్దున్నా అన్ని పోకడలు పోయావు గాని నువ్వయినా చెప్పావా నాకొక్క మాట?"

సిగ్గుపడి గోవిందమ్మ మొగం వంచుకుంది.

"[illegible] చెప్పెట్టడాని కొద్దమ్మా నేననేది. నువ్వెంత నాజూకుమనిషివో నా కొడుకంత సరసుడు. అంచేతే, తెగించలేక యింతగా నలిగిపోయారు మీ రిద్దరూ"

మిడుతూ మిడుతూ చూసింది గోవిందమ్మ.

"నిన్న మధ్యాహ్నం మొదలు నా కొడుకుకోసం వేగిపోయానన్నావే, మరి, నీకోసం, రెండు మాసాలనుంచీ నా కొడుకెంత వేగిపోతున్నాడో వూహించుకున్నావా!"

గోవిందమ్మ వాణికిపోయింది.

"ఇప్పటికి కయినా నువ్వనుగ్రహించావు కనక గానీ లేకపోతే నా కొడుకేమయిపోవునో —"

[illegible] కలుక్కు మనగా, సగంలోనే అందుకుని "[illegible] అనకమ్మా" అంటూ గిజగిజ[illegible]యింది గోవిందమ్మ.

గో[illegible] పూర్తిగా బోధపడిపోయింది; గాని "అసలు మాట రానివ్వదేం!" అనుకుని మళ్ళీ అందుకుంది గోవిందమ్మ.

"ఇంత ప్రేమ వున్న ఆడది మొగరాజుని చూడవల సిన పద్ధతి యిదేనా? కోదండమ్మ నా కొడుకి మీంద యీగ నయినా వాలనిచ్చిందా? ఇప్పుడు గొల్లది—"

"ఇం కెందుకూ నన్ను చివాట్లు పెట్టడం? రెండు మాసాల్లో నీ కొడు కనుభవించిన బాధ అంతా రెండు పూటల్లోనే నా కనుభవానికి వచ్చింది చాలదూ? క్షణం యుగంలా వుంది నాకిప్పు డిక నీ దగ్గర దాపరికం యెందుకూ? బతుకు తెరువు గుర్తించుకోలేక యిన్నాళ్ళూ నరకంలో పడి మగ్గిపోయాను, యెవ రెరుగుదురూ? ఇప్పటికి బాగా తెలిసింది తిమ్మన్న విలవ నాకు. ఇదివర కేంచేసినా యిక కోదండమ్మనీ గొల్లభామనీ నీచేతే — "

"నువ్వు చెప్పాలా తల్లీ, నాకు తెలియదూ?"

"కనక, నా డబ్బూ నా బతుకూ నీ కొడుకు చేతిలో ధారపోనేస్తాను, రాత్రి తీసుకురావమ్మా"

ఆవేశంతో గోవిందమ్మ యిలా అనేటప్పటికి కొండ యెక్కిన కైగిసివడింది నారమ్మ.

"నా తల్లి, నా తల్లి" అంటూ తుళ్ళి గుచ్చికౌగిలించు కుని తుందు మూర్ధాఘ్రాణం చేసిం దామె.

"నే నెరుగుదును నీ హృదయం అమృతం ముద్ద. ముఖస్తుతి చెయ్యడం మంచిదీ కాదు, నాకు చేతాకాదు, కాని నా కొడుక్కి నిజంగా తువ్వే తగుదువు. అంచేతే,

నీమీద ప్రాణాలు పెట్టుకునివున్నాడు వాడు. నువ్వ యినా, నాకోడు కంటేనే కరిగిపోయావు, నే నెరగనూ?" అంటూ ఆమెని ఆశాశాని కెత్తేసింది.

చివరికి బుజ్జగిస్తూ "రాత్రి జాముయాక తీసుకునస్తా నేం!" అనడిగింది మెల్లిగా, మొగంమీద మొగం పెట్టి.

"అప్పటిదాకా నువ్వు నాదగ్గిరే వుండాలినుమా" అంటూ గారాంకుడిచింది గోవిందమ్మ.

"దీపాలు పెట్టాటప్పటికే వచ్చి నిన్ను రతీదేవిలాగ తయారు చెయ్యనూ!" అనడిగింది నారమ్మ.

అందుకు సిగ్గుపడి, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ మొగం వంచుకుంది గోవిందమ్మ.

ఉండుండి మెరుపుతీగలు పాకినట్టు ఆమె శరీరం ఝుల్లు ఝుల్లు మంది.

ఇద్దరూ వొక్క క్షణం యేమిటేమిటో భావించు కున్నారు.

యిద్దరూ మప్పితంగా పాయసం పుచ్చుకున్నారు.

ఆసంబాట్లో యిక జరగవలసిన దంతా కూడబలు క్కున్నారు, సావకాశంగా.

ఇద్దరికీ వుత్సాహం తలమునక లయింది.

నారమ్మ మేఘాలమీద మెగిరిపోయింది.

గోవిందమ్మ గాలిలో తేలిపోయింది.

# 32

నారమ్మ వెళ్ళగానే మళ్లీ వుక్కిరి బిక్కిరి అయి, మళ్లీ తేరుకుని యెటు చూసినా పరిసరా లన్నీ సరికొత్తగా కనపడ్డాయి గోవిందమ్మకి.

తనకి పునర్జన్మ వచ్చిన ట్టనుకుం దామె.

చల్లబడి స్తంభించిపోయి వుండిన రక్తం వెంటనే వుడుకెత్తి పొంగులు వారుతూ ప్రవహించి ఆమె మొగాన విలక్షణ మైన తేజస్సు అంకితం చేసింది.

కొత్తవెలుగు వచ్చినట్టు ఆమె చూపులు, ఎక్కడెక్కడివో సూక్ష్మాతిసూక్ష్మాలు కూడా గ్రహించసాగాయి.

రెక్కలు వచ్చినట్టు మనస్సు, లోకాలోకపర్వతాలున్నూ దాటి పురకలు వెయ్యసాగింది.

అతిసాంద్ర మైన కొత్త సంస్కారం అబ్బినట్టు, బుద్ధి ఎంతెంతో గహనవిషయా లర్థం చేసుకుంటూ, ఏమిటేమిటో కల్పనలున్నూ చెయ్యసాగింది.

నూతన తేజం సిద్ధించినట్టు, హృదయం, మధుర మధురంగా స్పందించసాగింది.

దాంతో అణిచేసుకున్న వాంఛ లన్నీ వుబికి, మరిచిపోయిన సుఖా లన్నీ జ్ఞాపకం వచ్చి, కరడుకట్టిపోయిన ఆనందం తరంగితం అయింది.

వెంటనే ఆకెరటాలమీద తుళ్లింతలాడే ఫేనరాశి చిరునవ్వాయి, ఆమె బింబాధరంమీద మెరిసింది.

ఉత్సుక అయి వొక్క అంగలో అద్దం యెదటికి వెళ్లి నుంచుం దామె.

చూడగా, విలాసవతుల హొయలంతా యేకరాశి చేసి, చిత్రకారుడు, తన నేర్పంతా వినియోగపరిచి రచించిన చిత్రపటం లా కనపడిం దామెకి తన ప్రతిబింబం.

అది చూసుకుని చకిత అయిం దామె.

"ఏమి చక్కదనమూ" అనుకుంటూ తనకు తానే ముగ్ధ అయిపోయింది.

చివరికి "కనకనే తిమ్మన్న అలా అయిపోయా" డనుకుని గర్వించింది.

తిమ్మన్న స్ఫురించాటప్పటికి వోరచూపులు వచ్చాయి.

చూస్తుండగానే అవి మదనబాణా లయిపోయాయి.

"నాదగ్గిరా నీఆటలు" అంటూ మించుటద్దం ఆ బాణాలను తిప్పికొట్టింది.

దీనా దానా సిగ్గుపడిపోయి, గదిలోకి పరుగెత్తి, మంచానికి చేరబడి, మొగం తలగడలో గుచ్చేసుకుం దామె.

మొదట అది మంచి రక్షణగానే కనపడింది; గాని, వొక్క క్షణానికి అదింతు, విశాల మైన తిమ్మన్న వక్షస్థలం లాగా, అతని చూపులతో వుత్సుక అయి, అతని

మాటలతో వుత్తేజిత అయి అతని చేతుల్లో కరిగిపోయి తానా వక్షస్థలంమీాద మొగంపెట్టుకుని పరవశ అయి వుండినట్టూ స్ఫురించగా మరీ సిగ్గుపడిపోయిం దామె.

ఇక అక్కడ కూడా వుండలేక పెరటితలుపు తీసింది.

గుమ్మాన అడుగుపెట్టాటప్పటికి ముందు లేగదూడ కనపడిం దామెకి.

తిందామంటే గడ్డిపరకలు లేక, తాగుదా మంటే నీళ్ళ చుక్కలు లేక తనకేసి చూసేవారే లేక వునూరుమని పోయి వుండినట్టు నుంచుని వుందది.

అది కనబడగానే ఆమె గుండెలు కొట్టుకున్నాయి.

" అయ్యో, నాగొడవలో నీమాటే మరచిపోయాను పాపం " అని నొచ్చుకుంటూ వెళ్లి చెంగలిపరకలు ముందు పడేసింది; గాని అవి ముట్టుకోలే దది.

" ఏమి చెప్మా? " అనుకుంటూ నీళ్లగిన్ని పట్టుకువెళ్లి దగ్గిర వుంచింది; కాని అదీ ముట్టుకోలేదు.

చూడనే లే దది.

దాంతో " వెర్రిముండా, ఆలస్యం చేశా నని కోపం వచ్చిందా? " అని బెల్లిస్తూ, బుజ్జగిస్తూ నిమురుతూ దగ్గిర కూచుంది.

పట్టుదారాల వంటి చెంగలిపరకలు వేరి నోటి కందిం చినా అది సుముఖం కాలేదు.





అది చూసి "యేమి వచ్చిందీ!" అని కంగారుపడింది.

వయస్సుకి నాలుగుమాసాలదే గాని, వొక పక్క పాలన్నీ తాగుతూ వుండడంవల్ల సంవత్సరం గిత్తలా మెరిసిపోతూ వుండది.

విడిచిపెడితే పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ లేడి లా పరిగెడుతుంది.

నడిస్తే ఏనుగుగున్న లా నడుస్తుంది.

రంకె వేస్తే పులిపిల్ల బొబ్బరించిన ట్టుంటుంది.

"రెండువందల రూపాయల గిత్త అవుతుంది నా రాజు" అని ముగిస్తూ అతి గారాంగా పెంచుకుంటోంది గోవిందమ్మ దాన్ని.

అలాంటి దూడ యిలా అయినందుకు మహా దిగులు పట్టుకుందామెకి.

నిట్టూర్పువిడుస్తూ అప్రయత్నంగా కళ్లుమూసుకుంది.

కడుపుతరుక్కుపోగా అప్రయత్నంగానే మళ్లీ కళ్లు తెరిచిచూశాటప్పటికి లేగ దూడ కాక తన యెదట మొగం వేలాడవేసుకుని తన యేకపుత్రుడు భూషయ్యే నుంచుని వుండినట్టు కనబడిందామెకి.

"నీప్రియు డేమిటో, నువ్వేమిటో, యిక నే నెందుకూ నీకూ?" అంటూ అతను కళ్లనీళ్లు పెట్టుకుంటున్నట్టున్నా అనిపించింది.

హృదయం కలుక్కుమంది.

వాళ్ళంతా చీమలూ జెర్రెలూ పాకుతున్నట్టయి "నాకొడకా" అంటూ వెంటనే దూడమీద వాలిపోయిందామె.

# 33

"గోవిందమ్మత్తా"

ఉలిక్కిపడింది గోవిందమ్మ.

ఒక్క క్షణం గడిచాక మళ్ళీ పిలుపూ తలుపు చప్పుడూ వినవచ్చాయి.

దూడని విడిచి నుంచుని వొక్క అడుగు వెనక్కి వేసింది; గాని అప్పుడున్నూ మాట్లాడలేకపోయిందామె.

మరో క్షణానికి "అత్తయ్యా" అని పిలుపూ, యీమాటు సందు తలుపు గుంజిన చప్పుడూ వినిపించాయి.

అప్పటికి గుర్తుపట్టి "ఆ, చూడా!" అంటూ యెదురు పిలిచింది గోవిందమ్మ.

"నేనే నమ్మా! సందుగుమ్మాన" అంది చూడమ్మ.

వచ్చిన మనిషి చూడమ్మ అని తెలిశా టప్పటికి, అప్పటికి జరిగిందంతా మరిచిపోయింది గోవిందమ్మ.

వెంటనే ఒక్క అంగలో వెళ్ళి ఆమె తలుపు తియ్యగా, ఒక్క దూకున లోపలికి వచ్చి "భూషయ్య

బావ కులాసాగా వున్నాడంట గోవిందమ్మత్తా? పెళ్ళి నప్పటికంటేనూ బాగున్నాడంట" అని కళ్ళు తిప్పు కుంటూ ఆమె చేతులు పట్టుకుంది చూడమ్మ.

"మామ్మే, మాతల్లే, చల్లని కభురు తెచ్చావమ్మా!"

"అధికార్లు మహా మెచ్చుకుంటున్నా రంట బావని. యుద్ధం పూర్తి అయే లోపున పెద్ద వుద్యోగం అయి పోతుం దంట బావకి. మరేం? అత్తోయ్! పెళ్ళికూతుర్ని రక్షించాడంట బావ" అంటూ గోవిందమ్మని కుదిపేసింది చూడమ్మ.

"పెళ్ళికూతుర్నా?"

"అవును, పెళ్ళికూతుర్నే. అప్పుడే వచ్చారంట గుళ్ళోకి. పురోహితుడు మంత్రాలు చదువుతున్నా డంట. ఆ పాటున వచ్చి పడ్డారంట శత్రువులు. అందులో వొకడు కత్తిదూసి పెళ్లికూతురిమీదే చెయ్యెత్తా డంట"

"అయ్యో, అయ్యో"

"ఆడవాళ్ళందరూ గొల్లుమన్నా రంట. అంతకి ముందే సింహాప్పిల్లలాగ వురికి ఆ చెయ్యి నరికేశా డంట బావ"

"నా – తండ్రి, నా – తండ్రి" అంటూ వొకక్షణం ఆనందవిహ్వల అయిపోయింది గోవిందమ్మ.

మరో క్షణానికి "దేవుడికి నా తండ్రిమీద దయవస్తుం దమ్మా, నా తండ్రికి దేవుడు మంచిపెళ్ళాన్ని – "

 

ఇంతవరకూ అని డగ్గుత్తిక పట్టుకోగా వొక్క క్షణం ఆగిపోయి "నమకూరుస్తాడమ్మా" అని మాట పూర్తి చేస్తూ చూడమ్మని గుండెల కదుముకుంది గోవిందమ్మ.

"మంచి పెళ్ళాన్ని" అన్నప్పుడు, గోవిందమ్మకి, చూడమ్మ కళ్ళల్లో వింత కాంతీ, చూడమ్మకి, గోవిందమ్మ కళ్ళల్లో మమకారమూ కనవడ్డాయి.

గోవిందమ్మ చూపులకు సిగ్గుపడిపోయి చూడమ్మ కళ్ళు మూసుకుంది.

చూడమ్మకు కలిగిన లజ్జ గుర్తించి ఉత్సుక అయి, గోవిందమ్మ, తామర మొగ్గల్లాగ వికసనోన్ముఖా లయి వున్న ఆకళ్ళు ముద్దాడి "ఇదంతా నీ కెవరు చెప్పారు తల్లీ?" అనడిగింది.

"కొండల్రావు బాబు"

"కొండల్రావా?"

"అవును, గణపతిరాయుడు తాతగారి కొండల్రావు—"

"అతగా డెప్పుడు వచ్చాడే?"

"రెండుగంట లయింది"

"ఇందాకటి బస్సులో వచ్చాడు కామోసు" నను కుని "తమ్ముడు కులాసాగా వున్నాడా?" అనీ, ఎందుకు వచ్చాడూ?" అనీ ఆత్రంగా అడిగింది గోవిందమ్మ.

"యుద్ధానికి నువ్వింక పనికిరావు — "

"అదేం తల్లీ!" అంది గోవిందమ్మ, నిర్విణ్ణ అయి.

"నీలమండలదగ్గిరికి – ఎడమకాలు – "

"ఏమయింది నా కూనా!"

"తెగ్గొట్టేశారు శత్రువులు"

"హరిహరీ, హరిహరీ"

ఇలాఅంటూ గోడమీదికి వాలిపోయింది గోవిందమ్మ.

"ఇంకెక్కడా దెబ్బ తగల్లేదు. ఇంచక్కున్నాడు మనిషి. అదొక్కటే లోటు"

"పాపం పాతికేళ్ళవాడు, ఎలాగమ్మా!"

"మొండికాలు చూసి వొక కంట యేడ్చి, అలాగయినా బాగుండినందుకూ, ఇంటికిన్నీ వచ్చినందుకూ వొక కంట సంతోషించింది పిన్నమ్మ"

చూస్తుండగా గోవిందమ్మ కళ్ళు బాష్పప్లుతా లయిపోయాయి.

"ఏకాలో, యేచెయ్యో పోయి మీ మామయ్య కూడా అలా బతికివుండరాదూ తల్లీ!" అంటూ వమిటికొంగుతో మొగం కప్పేసుకుంది గోవిందమ్మ.

నివ్వెరపడిపోయింది చూడమ్మ.

ఈసందర్భంలో వెంకటస్వామి ప్రస్తావన వస్తుందని ఆమె యేకోశానా అనుకోలేదు.

"దెబ్బతిన్నా యెదటివాణ్ణి కూలగొడితే అదో

గొప్ప. మొగవా డయినవాడి కదే ఆభరణం. మరదలి కదొక లోటా అమ్మా, మొదటికే కూల్చేశాడు దేవుడు నన్ను"

ఇలా అని వెక్కివెక్కి యేడ్చింది గోవిందమ్మ.

చూడమ్మ కళ్లుకూడా చెమ్మగిల్లాయి.

"పోటు తిని నామహారాజు ఆసుపత్రిలో చావు బతుకుల్లో వుంటే "పదేళ్లుగా రెండుమూడు జిల్లాల ప్రజలను గగ్గోలుపెట్టేస్తున్న గజదొంగల నాయకులను నరికేశావు, గొప్పవీరుడివి" అంటూ టెలిగ్రాములమీద టెలిగ్రాములు గుప్పేశా రెక్కడెక్కణ్నుంచో అధికార్లు. "బతుకుతావు, సబినస్పెక్టరు వయిపోతావు, బెంగపెట్టు కోకు" అంటూ గుంటూరిలో వున్న అధికార్లు క్షణ క్షణానికీ వచ్చి ధైర్యం చెప్పేవారు. పట్నానికి పట్నం అంతా విరగబడిపోయింది నామహారాజుని చూడడానికి. అదంతాచూసి, అలాంటి స్థితిలోకూడా అలాంటి వీరుడు నాపెనిమిటి అయినందుకు గర్వించుకుంటూ వుండేదాన్ని నేను. కాని, నాపాపం బద్దలాసిపోబట్టి – "

ఇక మాట్లాడలేక, మళ్ళీ మొగం కప్పుకుని నన్న సన్నంగా యేడ్చింది గోవిందమ్మ.

అది చూసి తెల్లపోయింది చూడమ్మ; కాని వొక్క క్షణానికి మనస్సు నిబ్బరించుకుని, పరిస్థితులు మార్చేయ్యా

లని నిశ్చయించుకుంది.

వెంటనే అందుకుం దామె.

"భూషయ్యబావనీ అలాగే మెచ్చుకుంటున్నా రంట అధికార్లు. మొన్ననే సుబేదారువని – "

ఈమాట చెవిని పడేటప్పటికి అంత దుఃఖంలోనూ గోవిందమ్మ మాతృహృదయం వుప్పొంగిపోయింది.

దబాటువాన వెలిశాక చూరునీ ళ్ళింకా పడుతూనే వుండగా, యెండవస్తే ప్రకృతి అంతా విలక్షణకాంతిలో మెరిసేటట్టు, దుఃఖం తగ్గాక, కన్నీ ళ్లింకా పడుతూనే వుండగా ఆనందం కలగడం వల్ల ఆమె మొగం అపూర్వ శోభావంతం అయింది.

దాంతో "సుబేదారయిపోయాడాతల్లీ, నాకొడుకూ!" అంటూ గభీ మని చూడమ్మని పొదివిపట్టుకుని వూపేసిం దామె.

ఆబిగికౌగిలి వుక్కిరిబిక్కిరి కలిగిస్తున్నా, ఆగౌరవం అంతా తనదే అన్నట్టు మురుస్తూ "ఇంకా పెద్ద వుద్యోగస్థు డయిపోతా డంట బావ" అంది చూడమ్మ, వూపిరితీసుకుంటూ.

"కొండ్రావు చెప్పాడా తల్లీ?"

"నీతో చెప్పవలసిన వింకా చాలా సంగతు లున్నా యంట, నిన్ను తీసుకురమ్మని పంపాడు నన్ను"

"అక్కయ్యమీద దయ వుంది కనక"

"కాలులేక గాలేకపోయా నని చెప్పమన్నాడు, మరో విధంగా అనుకోవద్దని – "

"ఎంతమాటా! తమ్ముడి సంగతి నే నెరగనూ! కాక పోయినా, యిన్నాళ్లకి వచ్చాడు, దెబ్బతిని కూడా వచ్చాడు పాపం, మనమే వెడదాం పదమ్మా"

ఇలా అంటూ చూడమ్మని విడిచి, సందు తలుపు వేసేసి, నీళ్ళగిన్ని ఆవుదూడకి దగ్గిరగా వుందో లేదో చూసి, నూతి దగ్గిరికి వెళ్ళి కాళ్లూ, చేతులూ, మొగమూ కడుక్కుని, అద్దంయెదటికివెళ్లి కనుబొమ్మలూ బర్మాముడీ సద్దుకుని, తలుపులన్నీ బిగించి "ఇక రా తల్లీ" అంటూ చూడమ్మ చెయ్యి పట్టుకుని, పక్కనందు ల్లోంచి దారితీసింది గోవిందమ్మ.

## 34

"పరంధామయ్య అని మనవాడే బి. యే. తిరగ్గా తిరగ్గా, ఆశ్రయించగా ఆశ్రయించగా, రాజహంసకి తూటికాడ దొరికినట్టు చివరికి సబ్ రిజిస్ట్రారు పని దొరికి, ఖాయం కూడా అయింది. నెలా తిరిగాటప్పటికి జీతం యాభై రూపాయలూ చేతిలో పడితే, ఆక్షణాని కవే అయిదు

వంద లనిపించేదంట; కాని వుత్తరక్షణంలోనే "చచ్చు బతుకు" అనుకుంటూ దిగాలుపడిపోయేవా డంట" అన్నాడు కొండల్రావు.

"అదేం?" అన్నాడు నలభైయేళ్ళ కుశాల్రావు, చకితుడై.

"తప్పేం?" అంటూ కుశాల్రావుని నిలవతీశాడు డెబ్భయ్యేళ్ళ గణపతిరాయుడు, యెదుర్రొమ్ము విరుచుకుంటూనూ చురుగ్గా చూస్తూనూ.

"చక్కంగా వినక మధ్య నీ అల్లరేమిటోయ్?" అన్నట్టు మొదట నిరసనగా చూసి "చెప్పనియ్యవోయ్" అంటూ చివరికి కుశాల్రావుని సముదాయించాడు, యాభయ్యేళ్ళ వెంచయ్య, తాపీగా.

"మానాయన కనిపెట్టాడు సంగతి" అని తర్జనితో నిర్దేశిస్తూ అందుకున్నాడు కొండల్రావు.

"సెంటు భూమి లేదంట. ఉండడానికి పూరికొంప అయినా మిగల్లేదంట. "మరి చదు వెలా సాగిందీ?" అనడిగితే "అదొక కల" అన్నాడు పరంధామయ్య. ఈదురో గోడా అంటూ బతు కలా యీడ్చేస్తూ వుండగా సర్కారు ప్రకటన వచ్చిం దంట. ఎగిసిపడి వెంటనే మిలిటరీలో చేరాడు, సంవత్సరం తిరక్కుండానే సుబేదా రయిపోయాడు, మరిచూసుకోండి"

"స్సెబాస్" అంటూ వూగిపోయాడు గణపతి రాయుడు.

"అదీ వరస" అంటూ తల యెగరవేసుకున్నాడు చెంచయ్య.

"ఏమిటి మీరు చెప్పేది?" అన్నట్టు కళ్ళు చికిలించుకుంటూ చూశాడు కుశాల్రావు.

"ఏమీ, బోధపడలేదూ?"

"లేదు"

"అన్నాళ్ళు ఆక్టింగు చేసి పని నేర్చుకున్నా, ఖాయం అయ్యాక గూడా పెద్ద గుమాస్తా సలహా లేకుండా యేపనీ స్వతంత్రించి చెయ్యలేకపోయేవాణ్ణి" అన్నాడు పరంధామయ్య. అలాంటివాడు సేనలో చేరీచేరడంతోనే సుబేదారయిపోయాడంటే, అతని దగ్గిర వున్న లోటేమిటి, యోగ్యత యేమిటి?"

కొండల్రావిలా అడగ్గా "అడగవలసిన మాట అదీ" అంటూ గణపతిరాయుడందుకున్నాడు.

"బాగా ఆలోచించు. పరంధామయ్య ప్రతిభావంతుడు కాడంటావా బావా, నువ్వు?"

"అమ్మమ్మా, యెంతమాటా? ప్రతిభావంతుడు కాకపోతే బి, యే. యెలా కాగలిగాడూ?"

కుశాల్రావిలా యెదురడగ్గా, కొడుకేసి చూస్తూ

నిరాసక్తంగా చిరునవ్వు నవ్వాడు గణపతిరాయడు.

అది గుర్తించి "నువ్వేమంటావ్?" వన్నట్టు చూశాడు కొండల్రావు, చెంచయ్యకేసి.

"ప్రతిభావంతుడే కాకపోతే అంత స్వల్పకాలంలో సుబేదా రెలా కాగలిగాడూ!" అనడిగాడు చెంచయ్య, వెంటనే.

"విన్నావా?" అన్నాడు గణపతిరాయడు.

"విన్నానయ్యా"

"అవకాశం కలిగిస్తే ప్రతీమనిషీ బి. యే. కాగలడు. అందులో విశేషం లేదు. కాగా వొక్కటాలోచించు"

"ఏమి టదీ?"

"పరంధామయ్యనితీసుకు వెళ్ళివ్యవసాయంలో దింపితే?"

"అక్షరాలా బాపన వ్యవసాయం అయిపోతుంది. తాత తండ్రులు సంపాదించిన కొంద్ర యేమన్నా వుంటే రెండేళ్ళకే తెగనమ్ముకోవాలి పరంధామయ్య" అన్నాడు చెంచయ్య, అవ్యవధానంగా.

"అదే మన దగ్గిర వున్న జబ్బు" అని ముందు చెందుకున్నాడు కుశాల్రావు.

"బ్రాహ్మణదుర్గం భేదించి వుద్యోగా లన్నీ లాక్కుని అందులో అతని కేది నచ్చితే — "

"ఆగు" అని నిలవేశాడు కొండల్రావు.

"ఆగాను."

"ఇప్పుడు బ్రాహ్మలు చేస్తున్న వుద్యోగాలలో యేది చ్చినా గుంటపువ్వులే పూస్తాడు పరంధామయ్యా."

"ఏమీ?"

"నీకు తెలియదు కానీ, వుద్యోగాల కోసమే చదువులు సాగించడంవల్లా, వుద్యోగాలు సంపాదించుకోడానికే బతుకంతా పాటుపడుతూ వుండడంవల్లా బ్రాహ్మలే గుంటపువ్వులు పూస్తున్నారు".

"వాళ్ళెలా పోతే మనకేం, పరంధామయ్యా సంగతి చెప్పవోయ్"

"పరంధామయ్యా మాటే చెబుతున్నాను, మన కులం వాళ్ళ అందరి సంగతీ కాదోయ్"

"సరే"

"విషయం యిదే, కాని ముందొక నిదర్శనం చూపిస్తాను. సర్. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారిని మిలిటరీలో చేర్చివుంటే!"

"శివా ...... శివా ......" అంటూ చెవులు మూసుకున్నాడు చెంచయ్యా.

మెరుపుకొట్టినట్టయిపోయి "ఏమీ, ఆయన శౌర్యవంతుడు కారంటావా?" అనడిగాడు కుశాల్రావు, కరుగ్గా.

"కాకేం"

"పోనీ, తెలగాలే శూరులు కారంటావా?"

"కాకేం?"

"మరింకేమిటీ?"

"నాయుడుగారి శౌర్యం వేరు"

"వో – క్షనాటికీ కాదు"

"ఏ – ఘ్నటికీ వేళ"

"ఇదెక్కడి ధోరణి బావా!" అనడిగాడు కుశాల్రావు, గణపతిరాయణ్ణి.

"నీకు తృప్తి కాలేదు, కదూ!"

"ఎలా అవుతుందీ!"

"ఉన్నచిక్కల్లా అది. తత్వం గుర్తించలేక బాధపడుతున్నావు నువ్వు"

"నువ్వూ అలాగే అంటావా బావా!"

"అనక!" ద్విపాత్పశువును తీసుకువచ్చి యెదట నుంచోపెడితే గొప్ప మనిషిగా తయారుచెయ్యగలరు గాని, సాటి మనిషిని యెదట నుంచోబెడితే తెగనరకలేరు నాయుడుగారు"

"అంటే!"

"వెఱ్ఱివాడా, యిందులో గూఢార్థం యేమి వుందీ? నాయుడుగారి శౌర్యందయ. ఆయన ఖడ్గం బోధ. ఆయన విరుచుకుపడడం అజ్ఞానంమీాద"

చెంచయ్య మొగాన తృప్తి తాండవించింది.

అంజలిబంధం నుదుట చేర్చుకునీ, కళ్ళు మూసుకునీ నమ్రు డయినా డతను.

"ఏమంటా?" వనడిగాడు కొండర్రావు.

జవాబు తోచక కుశాల్రావు మిడుతూ మిడుతూ చూడగా, గణపతిరాయడు మళ్ళీ ప్రారంభించాడు.

"ప్రతిభ అన్నది యీశ్వరప్రసాదం. మని షయిన వాడి కల్లా అది లభ్యం కాదు"

"సరే"

"లభ్య మయినా, మనలో అం విని యోగించుకోని వాళ్ళే చాలామంది వున్నారు"

"కానియ్యి"

"చదువు, ప్రతిభను రాణింపచేసే వొక సాధనమే కాని, దానికి కారణమూ కాదు, ఫలితమున్నూ కాదు"

చూసి చూసి "సరే, ముందుకి వెళ్లు" అన్నాడు కుశాల్రావు, తలవంకించుకుని.

"పాత్రాపాత్రభేదమే కాని ప్రతిభకు లింగజాతిమత కులభేదాలు లేవు"

"ఎందుకుంటా?" యని దురుసుగా అడిగాడు కుశాల్రావు.

అది విని కొండర్రావూ, చెంచయ్యా చిరునవ్వు నవ్వుకున్నారు.

"ప్రతిభ వంటిదే రుచికూడాను. అయితే, అది ప్రతీ మనిషికీ జన్మసిద్ధం"

"అయితే?" అనడిగాడు కుశాల్రావు, సంశయంతో చూస్తూ.

"దశావిపర్యాసం వల్ల, వొక్కొక్కడికి, వొక్కొక్కప్పుడు రుచిలేని పని చెయ్యవలసివస్తుంది"

"పరంధామయ్య మాట చెప్పవయ్యా బావా" అన్నాడు కుశాల్రావు, కొంచెం విసుగ్గా.

"అదే చెబుతున్నా నయ్యా, రుచి లేదు కనక నబ్ రిజిస్ట్రారుగా వున్నంతకాలమూ "చచ్చుబతుకు" అంటూ యీసడించుకుంటూ బతికి, రుచి వుంది కనక అవకాశంరాగానే సోల్జరయి, ప్రతిభావంతుడు కనక సోల్జరయిన వెంటనే సుబేదా రయిపోయాడు పరంధామయ్య"

"మరి బి. యే. పట్టం మాట?"

"అతను బి. యే. కనక, ఇంకా గొప్పవాడున్నా అయిపోతాడు"

బుద్ధికి నచ్చినా మనస్సు లొంగదీసుకోలేక, అయినా అడ్డుప్రశ్న వేద్దా మంటే దారి దొరక్క, గుటకలు మింగుతూ చూసి వూరుకున్నాడు కుశాల్రావు.

"అంటే యేమన్న మాటా?" అంటూ అందుకున్నాడు కొండల్రావు.

"ఏమన్నమాటా!" అని అనువదించాడు కుశాల్రావు.

"మన కులంవాళ్లకి అంటని చదువుల్లేవు"

"ఎందుకుంటాయీ!"

"నిర్వహించలేని వుద్యోగా ల్లేవు"

"ఇంకా నింపాదిగా అంటున్నావా?"

"చేతకాని వృత్తు ల్లేవు"

"ఆహా"

"వీటిలో, యివాళ మనం యెవరికీ తీసిపోవడం లేదు"

"వొక్కడుగు ముందే వున్నాం, తీసిపోవడం అంటా వేమిటోయ్!"

"కాని ముఖ్యంగా మన కుల శక్తి శౌర్యం"

"మళ్ళీ డొంకల్లోకి లాగేస్తున్నాడా!" అని అనుమా నిస్తూనే "అవును" అన్నాడు కుశాల్రావు.

"కనక, మన కులంవాడి కన్ను ముందు మిలిటరీమీద పడిపోతుంది"

గతుక్కుమనిపోయాడు కుశాల్రావు.

అది గమనించి, బావా అని పిలిచి, గణపతిరాయ డందుకున్నాడు.

"శౌర్యమే ప్రధాన మైన కులాలు మన జాతిలో యింకా యెన్నో వున్నాయి. ఆకులాల యోధజీవితం కూడా చాలా ప్రసిద్ధి కెక్కి వుంది. అయితే, శూర

కులాలకు చెందిన అందరూ.సమస్టిగా శౌర్యం కనపరిచిన కాలం సంగతి అలా వుండగా, మన తాతలనాడూ మన తండ్రులనాడూ మాత్రమే కాక, మన తరంలోనే - ఇప్పుడు కూడా సుబేదార్లూ, సుబేదారుమేజర్లూ, సుబే దారుబహద్దర్లూ వున్నకులం యేదంటావ్?"

"మన కులమే"

"అయినప్పుడు, అబ్బాయి చెప్పినదాల్లో తప్పేమిటీ?"

కుశాల్రావు మాట్లాడలేకపోయాడు.

చెంచయ్యా మహోత్సుకు డైనాడు.

"జస్టిస్‌పక్షంలో వొకకాలూ, బ్రాహ్మణమిత్రుల మధ్య వొక కాలూ వేస్తావ్, నా కర్థం కావడంలేదు బావా" అంటూ వచ్చావు చాలామాట్లు, కదూ?" అంటూ మళ్ళీ అందుకున్నాడు గణపతిరాయుడు.

"అస్వాభావిక మైన వర్ణవ్యవస్థమీద జస్టిస్‌పక్షం కొట్టినంత దెబ్బ మరేపక్షమూ కొట్టలేదు. ఈయిరవయ్యో శతాబ్ది ముగిశాటప్పటికి జస్టిస్‌పక్షం ప్రచారంవల్లనే వర్ణభేదం నశించి మన మంతా యేకజాతివాళ్ళం అయిపోతాము"

"సందేహామేమిటి?"

"జస్టిస్‌పక్షమే మన కళ్లు తెరిచిం దంటే సత్యమే. యుగయుగాలుగా జీర్ణించిపోయి వుండిన మన భావసరణి

మార్చినది అదే అంటే యథార్థమే. పాత దంతా శిథిలం అయి, కొత్తదానికి సరయిన పునాది పడని యీాయుగ సంధిలో మన జీవనస్రవంతిని కొంతవరకూ అదే సుక్షేత్రానికి మళ్లించిం దంటే కూడా నిజమే. అయితే, అది అందుబాటులోవున్న సివిలు ఉద్యోగాల పంపకానికే కాక, తెనుగువాళ్లకి సైన్యంలో ప్రవేశం లేదన్న నిషేధం తొలగించడానికి కూడా పూనుకుని వుంటే—"

ఉద్రిక్తు డయిపోయి, మాట కడ్డం వచ్చి "అది సాధించింది తక్కువ అంటావా?" అనడిగాడు కుశాల్రావు, తల యెగర వేసుకుంటూ.

దానిమీాద "గుమాస్తాపనులకు యోధజాతులకు చెందిన మన బ్రాహ్మణేతర్లే యెగబాకేటప్పుడు అవి మాత్రమే చేతనయిన బ్రాహ్మలు మనకంటే యెక్కువగా పాకులాడ్డంలో వింత యేముందీ?" అని యెదురడిగాడు గణపతిరాయుడు, కొంచెం కరుగ్గా.

"అందులో వింత మాటకేం, వారికా అధికారం సుతరామూ లేదు"

"ఆమాటకి వస్తే మనమున్నూ కొన్ని అక్రమాధికారాలు చెలాయిస్తూనే వున్నాము"

"చెలాయిస్తున్నా మంటే—"

మాట నాన్చేశాడు కుశాల్రావు.

"ఇలా చూడూ" అన్నాడు కొండల్రావు.

"ఏమంటావ్?"

"దేశం యెంత విశాలమైనా, రాజ్యాంగంలో యెన్ని శాఖలుండినా, ఒక్కొక్క శాఖలో కూడా యెన్నెన్నో పదవు లుండినా, ఈవిశాలదేశానికి చెందిన అపారజన సంఖ్యలో యెన్నో వంతుంటాయి నువ్వభిమానించే సివిలు ఉద్యోగాలు?"

"ధోరణి యెలా వెడుతుందీ?" అని అనుమానిస్తూనే "తక్కువే వుంటాయి" అంటూ నసికాడు కుశాల్రావు.

"యువకుల్లో నూటి కే యాభై మందో సైన్యంలో చేరి తక్కినవా ళ్లందరూ వ్యవసాయంలోనూ, పరిశ్రమ ల్లోనూ, లలితకళల్లోనూ, సివిలుఉద్యోగాలలోనూ, ప్లీడరీ మొదలైన స్వేచ్ఛావృత్తుల్లోనూ పనిచేసుకుంటూ వుంటే మన కులాని కిక నిరుద్యోగ సమస్య అంటూ యెక్క డుంటుం దయ్యా?"

వులుకూ పులుకూ చూస్తూ కొండల్రావిలా అడగ్గా, మాట తోచక, ఆలోచనలో పడ్డట్టు మొగం పక్కకి తిప్పేసుకున్నాడు కుశాల్రావు.

గణపతిరాయడు "విన్నావా?" అనడగ్గా "అవును సుమా" అన్నాడు చెంచయ్య.

"యుద్ధానికి వెళ్లేదాకా నాకీ సంగతి తోచలేదు

చెంచయ్యన్నయ్యా" అంటూ మళ్లీ అందుకున్నాడు కొండల్రావు.

"సైనికుడు కావడానికి కావలసిన యోగ్యత వుండడం వొక గొప్పఅదృష్టం. ఏమంటే? వ్యక్త్యపేక్షయా లెక్కకు వచ్చే ధనలాభం సంగతి అలా వుండగా, ప్రతీ వాడికీ అక్కడ శాస్త్రీయమైన గొప్ప శిక్షణ అబ్బుతుంది. సైన్యంలో చేరితే తప్ప చక్రవర్తికయినా లభించని వరప్రసాదం అది. దాని వల్ల యీభౌతికశరీరానికుండుకున్న శక్తు లన్నీ పూర్తిగా వుద్బుద్ధాలవుతాయి"

"మెరుపువేగం — నిశితదృష్టి — ఇంగితజ్ఞానం — సద్యస్ఫూర్తి—వజ్రసంకల్పం— ఝుడితినిర్ణయం— గుండెనిబ్బరం— ప్రయోగలాఘవం—"

గణపతిరాయ డిలా అంటూ వుండగా "అవన్నీ అబ్బడానికా శిక్షణ. అవునవును" అన్నాడు చెంచయ్యా.

"అంతేకాదన్నయ్యా! దానివల్ల అహంకారం నశించి స్వశక్తిపరిజ్ఞానంయేర్పడి వినయం అబ్బుతుంది. వ్యగ్రోత్సాహంపోయి నిగ్రహం అలవడి కార్యదీక్ష కలుగుతుంది. తలకల పెత్తనాలు పోయి ఒక నాయకుణ్ణనుసరించే విధేయత అలవాటయి ఏకాగ్రత సిద్ధిస్తుంది. స్వార్థచింత నశించి సమష్టిప్రాప్యం విలువ గుర్తుకు వచ్చి త్యాగబుద్ధి కలుగుతుంది"

"అసలు ఈగకాలంతయినా వ్యత్యాసం రాకుండా తక్కినవాళ్లతో సరిగా అడుగు కలపడంలోనే మారిపోతాడోయ్ మనిషి" అన్నాడు గణపతిరాయడు.

"ఆమార్పు ఆమనిషి బతికివున్నంతకాలమూ కనపడుతూనే వుంటుంది. ఇలాగ సైన్యంలో చేరే యువకులు చేరుతూవుంటే, పెన్షనుపుచ్చుకుని వచ్చే పెద్దలు వచ్చేస్తూ వుంటే, సంఘంలో యెలాంటి సమగ్రత వెలుస్తుందో యోచించావా! అలాంటి పరంపర లేకపోబట్టే కాదూ సాఫల్యం యెరక్క మనయువకుల జీవితాలు నిరర్థకాలయిపోతున్నాయీ?"

"ఏమంటావ్?" అన్నట్టు చూశాడు చెంచయ్యా, కుశాల్రావుకేసి.

"ఏంబావా!" అని అడిగేవేశాడు గణపతిరాయడు.

కుశల్రావుకి యుక్తి తోచలేదు; కాని వూరుకోలేకపోయాడు.

"నేను కాదన్నానుటయ్యా? ఏది యేమయినా, మన యువకుల్లో ప్రతీవాడికీ యేదో వొక ఉద్యోగం—"

కుశాల్రావు మాట పూర్తి కాకుండానే "నేనుండిన కంపెనీ కళ్లకు కట్టినట్టుంది చెంచయ్యన్నయ్యా" అని మళ్లీ అందుకున్నాడు కొండల్రావు.

"మొదలియార్లు, లింగాయతులు, నాయర్లు — కలిసి

యాభైమందీ పోగా, తక్కిన యాభైమందీ మన కులం వాళ్లే. ఇంతమంది కులంవాళ్లని నువ్వే సివిలు ఆఫీసులో చూడగలవు తమ్ముడూ?" అనడిగాడు పరంధామయ్య.

"సివిలు ఆఫీసుల్లో కూడా అలా యెందు కుండక పోవాలీ?" అనుకున్నాడు కుశాల్రావు.

"మంచి ప్రశ్న" అన్నా డంతకి ముందే చెంచయ్య.

"సంఖ్య అలా వుంచు. మరి ఆజీవకళ? అది మాత్రం చూడగలముటయ్యా సివిలు ఆఫీసుల్లో?" అనడిగాడు గణపతిరాయుడు, చెయ్యూపుతూ.

ఇక్కడ, యిది యిలా జరుగుతూ వుండగా, అక్కడ, గడప అవతల స్త్రీమండలిలో "తమ్ము డెక్క డున్నాడు. పిన్నమ్మా?"అనీ"రండి వదినయ్యగారూ" అనీ "అబ్బాయి వచ్చాడు రావే కూతురా" అనీ "నీ కొడుకు వెళ్ళినవాడు వెళ్ళిన ట్టున్నా డంట చెల్లెలా" అనీ "రావమ్మా మర దలా" అనీ "కొండన్న కాలు తెగిపోయి వచ్చాడు ఏమి చెప్పుకోను మనమరాలా?" అనీ మాటమీద మాట కలగాపులగంగా చెలరేగాయి.

చూడగా, వొకచేత కొండల్రావు భార్య చెయ్యీ, వొకచేత అతని తల్లి చెయ్యీ పట్టుకుని ప్రీతినెరువుతోంది గోవిందమ్మ.

"చెల్లమ్మ వచ్చింది" అన్నాడు చెంచయ్య.

"తమ్ముఁ డిక్కడున్నాడు, పైవా రెవరూ లేరు, అంతా మనవాళ్ళే యిలా రావమ్మా" అంటూ కొంచెం పక్కకి జరిగాడు గణపతిరాయుడు.

# 35

గడప దాటి అడుగు లోపల పెట్టేటప్పటికి, భక్త్యా వేశంతో గోవిందమ్మ పాదాలు పట్టుకుని కళ్ళ కద్దుకున్నాడు కొండ్రావు.

"తెల్లవారితే యీ కొండ్రావే కుక్కని చూసినట్టు చూస్తాడు నిన్ను చూసుకో" అని యెవరో అన్నట్టు కాగా గుండెలు కొట్టుకున్నాయి; కాని అంతలో నిబ్బరించుకుని, భ్రాతృవాత్సల్యంతో జబ్బ పట్టుకుని కొండ్రావుని లేవనెత్తుతూ "యిలా అయినావా తమ్ముఁడూ!" అంటూ కంట తడి పెట్టుకుంది గోవిందమ్మ.

"మా పినమామగారికి లాగ పిక్కపూడ్చుకు పోయినా యిబ్బంది లేకపోవునే కూతురా, సీలమండల దగ్గిరికి పాదానికి పాదమే యెగిరిపోయిందే నా నాయనికీ" అని విచారిస్తూ కొండ్రావు తల్లి ఆమె వెనకనే రాగా, గుమ్మం అవతలే వుండి అతని భార్య మళ్ళీ గుడ్లనీళ్ళు కుక్కుకుంది.

అది చూసి గణపతిరాయుడు "అంతమంది శత్రువులను

కూలగొట్టినవాడికి, బరిమీదికి వెళ్ళినప్పు డామాత్ర మయినా దెబ్బ తగలకుండా వుంటుందా, తప్పు తప్పు, విచారించకు.' తాలూకా మొత్తంమీద అలాంటి గ్రామమున్నది లేదని మీనాయన పేరుపొందగా, నువ్వు ఆయన పేరు పెట్టుకున్నందుకు, మిలిటరీలో జమాదా రయి అధికార్ల మన్నన సంపాదించుకున్నా వబ్బాయి, నీకండలో కండ, వెర్రిదానా నువ్వు గింజుకుంటా బేల పోవాలా!" అని భార్య నోదార్చి "చెంచయ్యా, నువ్వెర గని దేముంది? మా ముత్తాత సుబేదారుగా వున్నాడు. మా తాత సుబేదారు. మా పెంతాత సుబేదారు. మా నాయన జమాదారు. మాంచి యుద్ధంలో ఎడా చెయ్యి తెగిపోయింది గాని మరొక్కనెల గడిచివుంటే ఆయనా సుబేదారయిపోయి వుండును — మళ్ళీ మా పిన తండ్రి జమాదారు. మా పినతండ్రి కొడుకు సబిన్స్పెక్టరు. ఇరవై అయిదేళ్ళకే వుబ్బసం వచ్చి నేనే చేతగానివా ణ్ణయిపోయాను గాని మళ్ళీ నా కొడుకు కొ[illegible]త్సరం లోనే జమాదారయి వోహో అనిపించుకున్నాడు, వొక్క కొడుకయినందుకు వంశమూ నిలిపాడు, కుటుంబగౌర వమూ నిలిపాడు లోటేమిటమ్మా!" అంటూ జడిగొన్న ఆనందబాష్పాలు తుడుచుకుని, మీసంమీద చెయ్యి వేసుకున్నాడు.

కొండల్రావు చూపులు మెరపుతీగ లయిపోయాయి.

అతని భార్య కళ్ళు మిట్టిమీాలై పడ్డాయి.

"శౌర్యం గుత్తగొన్న కుటుంబం, ఓః" అంటూ కళ్ళు మూసుకుని అంజలిబంధం శిరస్సున గీలించుకున్నాడు కుశాల్రావు.

పరిసరా లన్నీ మళ్ళీ వేడెక్కాయి.

వెంటనే చెంచయ్య అందుకున్నాడు.

"కుటుంబగౌరవమే కాదు, వూరి మర్యాదా నిలిపాడు కొండల్రావు. భూషయ్య కూడా —"

అర్థోక్తిలో అందుకుని "నామాట కేం, సగంసగంలో రసాభాస అయిపోయి వచ్చాను. తాను కూడా యేక సంతానం అయినందుకు వెంకట స్వామిబావ పేరు నిలిపినా, ఉగ్గులో శౌర్యం రంగరించి పోసి పెంచుకున్నందుకు గోవిందమ్మక్కయ్య ఆశలు పూరించినా, పుట్టిన కుటుంబ గౌరవం నిలిపినా, పెరిగిన వూరి గౌరవం నిలబెట్టినా, జిల్లా అంతకీ కులం గౌరవం నిలబెట్టినా భూషయ్య నిలువు తాడు చూసుకోండి" అంటూ వొంటికాలిమీాద యెగిరి యథాస్థానానికి వెళ్ళి "అక్కా, అల్లుడు మహా రాజు బిడ్డలాగ కులాసాగా వున్నాడు. నీకు నూటొక్క దండాలు మనవిచెయ్య మన్నాడు. మాపెద్దఅధికారి తన కొడుకుని చూసుకు నేటట్టు చూసుకుంటున్నాడు అల్లుణ్ణి.

తక్కిన సంగతులు వివరంగా చెబుతాను కూచోవమ్మా”
అంటూ మెల్లిగా కూచున్నాడు కొండల్రావు.

గోవిందమ్మ ఆనందవిహ్వాల అయింది; కాని గంట కిందటే తాను చేసిన పని జ్ఞాపకం వచ్చి హృదయం కలుక్కు మనగా సిగ్గుపడిపోయి, అయినా వెంటనే తేరు కుని, ఆనందంనటిస్తూ “చల్లని కభురు చెప్పావు తండ్రీ” అని అతని వీపు నిమురుతూ వాళ పక్కగా కూచుంది.

కొండల్రావు తల్లి ఆమె నానుకుని లోగుమ్మంలో కూచుంది.

గుమ్మం అవతల – కొండల్రావూ గోవిందమ్మా కనపడేచోట చూడమ్మ కూచోగా, ఆమెని వొళ్ళోకి తీసుకుంటున్నట్టు కొండల్రావు భార్య కూచుంది.

అప్పుడు “రాయుడు బాబూ” అంటూ సంభాషణ అందుకున్నాడు చెంచయ్య.

“అయిదు యకరాల పల్లబ్భూమి వుంది కదా, ఇనప్పెట్టివంటి పెంకిటిల్లూ, నందనవనం అనతగ్గ యకరంనర అంటుమామిడితోటా కూడా వున్నాయి గదా, పది రాళ్ళున్నా వున్నాయి గాని లోటు లేదుగదా అనుకుని నే నే వద్దన్నాను గాని “అలా అనకన్నయ్యా, ఇక్కడే వుంటే నాకొడుకు మసిపాతని కట్టిన మణి అయిపోతాడు, పంపేస్తానయ్యా” అంటూ నామాట పడనిచ్చింది కాదు

చెల్లమ్మ, ఆశ్చర్యం — ”

“ఎందుకూ?” అంటూ మాట కడ్డం వచ్చాడు గణపతిరాయుడు.

“అసలేం జరిగిందో యెరుగుదువా మరి? ఇప్పు డిలా దేవుళ్లాడుతోంది గాని, యుద్ధానికి వెళ్ళడానికి అబ్బాయికి ముందు సెలవిచ్చింది నేను కాదు, మీ పిన్నమ్మ”

ఇది విని చెంచయ్య తనకేసి ఆశ్చర్యంగా చూడగా “నిజమేనయ్యా” అంది కొండ్రావు తల్లి, కళ్ళల్లో మాతృగర్వం కనపరుచుకుంటూ.

“ఇలా కొడుక్కి సెలవిచ్చి, నీళ్ళకోసం అలా చెరువుకి వెళ్లి అక్కడ గోవిందమ్మ కనపడగా — ”

“పిన్నమ్మ మాట చెవినిపడ్డాటప్పటి కిక నుంచో లేక పోయాను నేను. నీళ్లు ముంచుకున్నానో లేదో యింటికి పరిగెత్తాను. హాల్లో కూచుని వచనభారతం చదువుకుంటు న్నాడు కొడుకు. బిందె యింటో దింపి వచ్చేదాకా వుండ లేక “ఏం నాయనా, కొండ్రావుమామయ్య వెడుతున్నాడు నువ్వు కూడా యుద్ధానికి వెళ్లవా?” అన్నాను. “ఎక్కడ వెళ్లే” నంటాడో అని గుండెలు పీచుపీచుమన్నాయి; కాని అలా కాకుండా “వెళ్లిపోతానమ్మా, దీవించి సెలవియ్యవమ్మా” అంటూ యెగిసిపడి నాపాదాలు — ”

“మరి నువ్వు? రాయుడుబాబూ, అసలే వుడుకురక్తం,

ఆపైని కొండ్రావు సావాసం, కనక భూషయ్య మెగిసి పడ్డం సహజమే; కాని మరి చెల్లమ్మ పొలంనుంచి పాలి కాపు నవనవలాడుతున్న నీటివంకాయలు తేగా ముద్దం కాయ కూర తయారుచేసివుండిన్నీ, కొడుకు సంబరం చూసి ఆనందం పట్టలేక అప్పటికప్పుడు కోడిపుంజుని కోసి — ”

“ఓః!” అంటూ వూగిపోయాడు గణపతిరాయుడు.

“భేష్‌భేష్” అంటూ చెయ్యి జాడించుకున్నాడు కుశాల్రావు.

కొండ్రావు భార్య చూడమ్మని కుదిపెయ్యగా, చూడమ్మ, తానే ఆపని చేసినట్లు ఆనందపరవశ అయి, కళ్ళు మూసుకుని ఆమె సందిట వాలింది.

“అమ్మా, కన్నతల్లి నిర్విచారంగా దీవించి పంపించింది కనక, కొండ్రావు, గౌరవం సంపాదిచుకుని కుశలంగా యింటికి వచ్చాడు. ప్రోత్సాహం కూడా నువ్వే చేసి, దీవించిన్నీ పంపించావు కనక, భూషయ్య, యీమాత్ర మయినా అపాయం లేకుండా, యింతకంటేనూ గౌరవం సంపాదించుకుని క్షేమంగా యింటికి వస్తాడు; చూసుకో నామాట” అంటూ మళ్ళీ మీసంమీద చెయ్యివేసు కున్నాడు గణపతిరాయుడు.

గోవిందమ్మ శరీరం ఆపాదమస్తకమూ పులకితం

అయిందని. కనుదమ్ము లరమూతలు పడగా ముఖపద్మం వికసించింది; కాని "అప్పు డలా చేశావూ? పైకి మాత్రం యిలా చెబుతూ యిప్పుడు కొడుకు మానాభిమానాలకు గోతులు తవ్వుతున్నావూ? ఛీ, నీ మొగం యీడ్చా" అని యెవరివో మాటలు చెవిలోపడ్డట్టు కాగా కొయ్యయిపోయి, ఆపాగడ్తకు సిగ్గుపడుతున్నట్టు నటిస్తూ మొగం వంచేసుకుంది.

ఆసందుబాట్లో "ఇలాంటి తల్లులుండగా మనకులంలో శౌర్యాని కేమి లోటూ!" అన్నాడు కుశాగ్రరావు.

దానిమీద "అందులోనూ మనభూషయ్య శౌర్యం అంతా యింతానా?" అంటూ గభీమని అందుకున్నాడు కొండ్రరావు.

"కళ్లారా చూశాను, నేనే విస్తుపోయాను చాలా మాట్లు. వయస్సుకి నాకంటే నాలుగేళ్లు చిన్నే కాని, భూషయ్య, బరిమీద మాత్రం యెప్పుడూ నాకంటే నాలు గడుగులు ముందే: అదిచూసి యెన్నోమా ట్లభిమానపడ్డాను. శౌర్యం తెచ్చుకున్నాను. చివరికి "ఎందుకు వచ్చిన యేళ్లు, ఛీ" అని అసహ్యించుకున్నాను. మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాను; గాని వొక్కమాటయినా — అల్లుడితో సమంగా నయినా వురకలేకపోయాను నేను"

"ప్రేమ వుంది కనక, నీకలా అనిపించిందేమో కాని

పాలుబుగ్గలవాడు నా కొడుకెక్కడ –"

"పాలబుగ్గలవాడే నీకొడుకు, కాదనడం యెందుకూ? కనకనే ద్వంద్వా లెరక్క యేకైకలక్ష్యంతో అంతగా పరాక్రమించగలుగుతున్నాడు. ఎదటవడ్డాడంటే శత్రువు ఏనుగే కానీ పీను గయిపోవలసిందే. సింహమే కానీ తోక ముడిచెయ్యవలసిందే"

"ఆశ్చర్యం యెందుకూ? ఇక యుద్ధానికి వెడతాడనగా నీటికట్టు దగ్గిర చూశాము కాదుటయ్యా?" అనడిగాడు కుశాల్రావు.

"చెట్టంత మనిషి. మెలికలు తిరిగివున్నాయి కండలు. ఒకచేత్తో మీసం దువ్వుకుంటూ, మరోచేత్తో ములకాటికర్ర నేలమీద పొడుస్తూ బింకాలు తోలుతున్నవాడల్లా, అమాంతంగా వచ్చి భూషయ్య "మరి రా" అంటూ ఆకర్ర వుళాక్కునేటప్పటికి తెల్లమొగం వేశాడు వెంకట్రాయుడు, "అవునవు" నన్నాడు చెంచయ్య.

"యుద్ధరంగంలో కూడా భూషయ్య అదే వరస. నేలమీద పడుకుని పాకుతున్నా, కందకంలో కూచుని వుండినా, తుప్పల చాటున నక్కివుండినా, పేవబెత్తం లాగ తుపాకీ రెండుచేతులా పట్టుకుని వురుకుతున్నా, వొాక సద్దుకోడం లేదు, వొాక గురిచూడ్డం లేదు, ఏక కాలంలో ఠఫీఠఫీ మని యెక్కడ తుపాకీ పేలడమూ,

గభీగభీ మని అక్కడ శత్రువులు కూలడమూను. మర తుపాకీదగ్గిరికి చేరాడంటే, యిక్కడ సీమటపాకాయల పెట్టె వెలిగించినట్టూ అక్కడ చింతకాయలు దుల్లిపోతు న్నట్టూను"

"ఎప్పుడు నేర్చుకున్నా డయ్యా యిదంతా?" అని కుశాల్రావూ "సహజంగా పుట్టుకురావాలిగాని నేర్చు కుంటే మాత్రం వస్తుందిటయ్యా?" అని చెంచయ్యా సాశ్చర్యంగా చూడగా "స్వయంభు వయినా, అభ్యాస సిద్ధం అయినా శక్తి వుంటే మాత్రం అందరూ బరిమీద అంతంత ధైర్యసాహసాలు చూపించగలరా?" అని మళ్లీ అందుకున్నాడు కొండల్రావు.

"శౌర్యసాహసా లుంటే గాని యుద్ధాని కెలా వెళ్ల లేడో, అదృష్టం వుంటేనేగాని అలాగే మళ్లీ తిరిగిరాలేడు, ఎవడూను. ఏమంటే? ఇప్పటి యుద్ధమే వేరు, ఫిరంగి యెక్కడుందో తెలియదు, గుండు మాత్రం వచ్చిపడి భళ్లు మంటుంది. నిప్పులు కక్కుకుంటూనూ దారిలో యేమి వుండినా మట్టేసుకుంటూనూ టాంకులు బయలు దేరతాయి. ఇది చాల దన్నట్టు నెత్తిమీద విమానాలు. బాంబే వడుతుందో, శత్రువిమానమే కూలుతుందో? ఇలాంటి అగ్ని హోత్రంలో ఆవస్థానా యీవస్థానా కాల్చలం. పత్రికలు చదివి యిక్కడి వాళ్లేమనుకుంటారో

గాని అక్కడ సైనికులకు రక్తం పొంగిపోతూ వుంటుంది చెంచయ్యన్నయ్యా! పగ లని తెలియదు రాత్రని తెలియదు, ఎండ అనిపించదు, వాన అనిపించదు, ముందుకి తోసుకువెళ్లామా లేదా అని ప్రతీవాడికీ వొక్కటేచూపు. కంపెనీ పేరు నిలుస్తోందా లేదా అని వొక్కటే ఆదుర్దా"

"కుశాల్రావ్" అన్నాడు గణపతిరాయుడు, గంభీరంగా.

"వింటున్నా" అన్నాడు కుశాల్రావు, తాపీగా.

"అటు మిలిటరీవాళ్ల త్యాగం చూడు, ఇటు సివిలు వుద్యోగస్థుల భోగం చూడు"

"చూశాను"

"ఏమంటావ్?"

కుశాల్రావు మాట్టాడలేదు.

"నువ్వు కానియ్యి తమ్ముడూ" అన్నాడు చెంచయ్య.

"ఇక సంకులసమరమే పోసగితేనా?" అంటూ అందుకున్నాడు కొండల్రావు.

"కత్తిదూశాడంటే మరీ అగ్గయిపోతాడు భూమయ్య. ఆరూపమూ ఆ తేజస్సూ చూడవలసిందే గాని చెప్పవలసినవి కావు. అతన్ననుసరించి వెడితే మీద యీగ అయినా వాల దని ప్రతీవాడికీ దిలాసాయే. తనమీద దెబ్బపడకుండా కాసుకుంటూ చేతికందిన శత్రువునల్లా నరుకుతూ మాలో చాలామందినిరక్షించాడు చాలామాట్లు.

ఎవళ్లదాకానో యెందుకూ, మొన్న మొన్నా — కన్ను మూసి తెరిచాటప్పటి కెగిరిపోవలసిందే నాతల; కాని నీకొడుకే నిలిపాడమ్మా అక్కయ్యా ”

“నాకొడుకా?” అనడిగింది గోవిందమ్మ చకిత అయి.

“అవును నీకొడుకే” అన్నాడు కొండలావు, కొనగోట ఆనందబాష్పాలు చిమ్ముకుంటూ.

అది విని “ఏమిటే, ఏమి జరిగిందీ కొండన్నా” అనడుగుతూ వుద్రిక్తుడై నిటారుగా కూచున్నాడు గణపతి రాయుడు.

“అటునుంచి శత్రువు చొరుచుకువస్తున్నాడు. ఇటునుంచి మేము తోసుకుపోతున్నాము. మా మకాముకీ వాళ్ల మకాముకీ కూడా యెటు చూసినా ముప్ఫయి నలభై మైళ్లలో వుందొకవూరు. ఆప్రాంతాని కది మంచి కీలక స్థానం. అసలు సేన నూటిగా ముందుకి వెడుతూ వుంటే ఆవూరు పట్టుకోమని అయిదువేల బలగం పంపాడు మా పెద్ద అధికారి. అందులోనే వుంది మాకంపెనీ. శత్రువులున్నా మాలాగే భావించి బయలుదేరి వుంటారు; గాని వూళ్లో తారసపడేదాకా వాకళ్ల సంగతి వాకళ్లకు తెలియదు”.

“ఊరివాళ్లు పారిపోలేదూ?” అనడిగాడు కుశాలావు.

“ఆవూరు నూటిగా దారిలో లేకపోయినా యెప్పుడో

లేచి పోయారు సగంమంది. ధైర్యవంతులు మాత్రం వుండి పోయారు. ఉండిపోవడమే కాదు, సరిగా ఆసమయాని కొక కోటీశ్వరుడు తన యేకపుత్రిక పెళ్లి యేర్పాటు చేసుకుని వున్నాడు"

చకితులై అందరూ మొగమొగాలు చూసుకున్నారు.

చూడమ్మ హృదయవీణ కొత్త సంగతి పలికింది.

"సెబాస్, ఏమి ధైర్య మయ్యా" అంటూ వుత్సుకు డైనాడు గణపతిరాయుడు.

"ఉభయపక్షాలవారూ అప్పుడే గుడిలో ప్రవేశిం చారు. సమీపంలోనే యుద్ధం జరుగుతోంది కనక, భజంత్రీలు లేరంతే, పురోహితుడుమంత్రాలందుకున్నాడు"

"ముప్పయి మైళ్ళలో వున్న యుద్ధం అటో యిటో తేలిపోయేదాకావుంటే యేమో!" అన్నాడు కుశాల్రావు.

"వచ్చి సేనలో చేరవలసిం దని పెళ్ళికొడుక్కి పిలుపు వచ్చింది. వారంరోజులే గడువు. మళ్ళీ యెప్పుడు పిలవ్వు తుందో —"

"ఉభయులూ సమానులేనా?"

"పెళ్ళికూతు రెంత భాగ్యవంతురాలో, పెళ్ళికొడు కంత దరిద్రుడు. నిజంగా, పూటకి టికాణాలేదు. రెక్కలే ఆధారం; కాని పులి. అందుకే ప్రేమించింది పెళ్ళి కూతురు"

"అదీ పిల్లంటే" అన్నాడు గణపతిరాయుడు, చెయ్యి జాడించుకుంటూ.

"విన్నావా!" అన్నట్టు కొండర్రావు భార్య తన జబ్బలు పట్టుకుని వూపగా, వెనక్కి విరగబడి "విన్నాను, మెచ్చుకున్నాను" అన్నట్టామెకేసి సోత్సాహంగా చూసి, ఆపిల్లస్థానంలో తననీ ఆపులి స్థానంలో భూషయ్యనీ వూహించుకుని కులుకుతూ కులుకుతూ అంతలో సిగ్గు పడిపోయింది చూడమ్మ.

గోవిందమ్మ చూడమ్మకేసి చూడబోయి, బాగుండదని అంతలో మానుకోగా, కొండర్రావు తల్లిమాత్రం తన కోడలికేసి సాకూతంగా చూసింది.

"పురోహితుడు పెళ్లిళ్ళ రిజస్టరు — "

"కిరస్తానీలా!" అనడిగాడు కుశాల్రావు."

"దేశీయులే; కాని యెప్పుడో మతం పుచ్చుకున్నారు"

"చక్కనివాళ్ళేనా!"

"పిల్లకంటే పిల్లవాడే అందగాడు. అది అంద మను, ఆకర్షణ అను, అదృష్టం అను — అంతా అతని కళ్ళల్లో వుంది"

"అందుకే లోబడిపోయింది పిల్ల" అన్నాడు మళ్ళీ కుశాల్రావు.

"ఎంత వింత సన్నివేశమో చూశావా! బయటి

వాతావరణం యెంత భీకరంగా వుందో, లోపలి వాతావరణం అంత శాంతంగానూ వుంది; కాని ఆనందజనకమైన ఆసంధానకార్యంలో భీభత్సకరమైన యీసంహారకార్యం తారసిల్లింది"

"శివా, శివా" అంటూ పరితపించాడు చెంచయ్య.

"శత్రువులు ప్రవేశించిపోతా రేమో అని మేమూ, మే మాక్రమించుకుంటా మనుకున్నా రేమో శత్రువులూ చెరో గుమ్మానా గుడిలో ప్రవేశించాము"

"మరి పెళ్లివారు!" అని కుశాల్రా వడగ్గా "పీలయిన వాళ్లల్లా పికాపిక లయిపోయివుంటా రడిగే దేమిటీ!" అన్నాడు చెంచయ్య.

"అవు నంతే జరిగింది. అయితే, యీలోపునే పెళ్ళి కొడుకు మహోగ్రుడైనాడు; కాని ఆయుధంలేక – "

"పావం"

"అప్పటి కప్పుడే శత్రువుల్లో వొకడు పెళ్లికూతురి మీద కత్తి – "

కెవ్వున కేకవేసి ఆడవాళ్ళందరూ నిర్విణ్ణ లయి పోయారు.

గణపతిరాయుడు మాత్రం పిడికిళ్లు బిగించుకుని "చూస్తావేం!" అన్నట్టు కుశాల్రావు కేసి తీవ్రంగా చూస్తూ "హర మహాదేవ" అంటూ వూగిపోయాడు.

"చేతి కందినవాళ్ళ నందరినీ నరుక్కుంటూ ముందు భూషయ్యా, తరవాత నేనూ ముందు కురికాం. నాకంటే ముందున్నాడు కనక, పెళ్ళికూతురిమీద కత్తియెత్తిన వాడి చెయ్యి జబ్బల్లోకి నరికేశాడు భూషయ్య."

"అమ్మయ్యా" అంటూ గుండెలమీద చేతులు వేసుకుంది గోవిందమ్మ.

"విన్నావా!" అన్నట్టు కొండల్రావు భార్యకేసి విరగబడి చూసింది చూడమ్మ, మురిసిపోతూ.

"ఈ లోపున పక్కగా వున్నవాణ్ణి నేను నరగ్గా, నామీద మరో ఇద్దరు పడ్డారు"

"నీ మీదే పడ్డారూ!" అంటూ అగ్గయిపోయాడు గణపతిరాయడు, నరుంబిగిస్తూ.

"అవును, పడ్డారు. అందులో వొకడు నా డొక్కలో పొడుద్దా మని చూశాడు; గాని నేనే ముందు వాణ్ణి పొడిచేశాను. రెండోవాడు నాతల కొట్టబోగా భూషయ్య వాడి తల యెగరగొట్టాడు"

"నా తండ్రే, నాతండ్రే" అంటూ అంజలిబంధం నుదుట కీలించుకుంది కొండల్రావు తల్లి.

చూడమ్మ మొగంమీద మొగం పెట్టి "నా బతుకు నిలిపాడు మీ బావ" అంది కొండల్రావు భార్య.

"కలిసివెళ్ళినందుకు మామయ్యకి సేవలు చేసుకున్నావా

తండ్రీ?'' అంటూ పొంగిపోయింది గోవిందమ్మ; కాని, భూషయ్య తల మొగరకొట్టడానికి తన రాజాతిమ్మన్న గండ్రగొడ్డలి యెత్తి వున్నట్టూ, తలుపుచాటున నక్కి వుండి, తాను "ఇంకా జాప్యం చేస్తా డేమమ్మా" అంటూ ఆత్రపడుతున్నట్టూ, "వేసెయ్" అని తిమ్మన్నని నారమ్మ పొడిచి తొందరపెడుతున్నట్టూ తోచి, తలతిరిగిపోగా, వొణికిపోతూ కొండ్రావుమీద వాలిపోయింది.

అది చూచి కుశాల్రావు తెల్లపోయాడు.

అది, భూషయ్య అంత పనిచేసినందుకు కలిగిన ఆనంద పారవశ్యం అనుకుని ప్రేమగా గోవిందమ్మ వీపు నిమిరింది, కొండ్రావు తల్లి.

హఠాత్తుగా మహాపాయం తటస్థించి అంతలో అది తప్పిపోతే, మొదట కలిగిన ఆదుర్దా అలాగే వుండగా కొత్తగా మహోత్కటానందం కలగడంలో, మనసు మెత్తని దయితే, అక్కడ అనుభోక్తకీ, యిక్కడ ద్రష్టకీ గూడా హృదయస్పందనం నిలిచిపోయినట్టూ చైతన్యం లోపించినట్టూ అభావదశ యేర్పడి, దాంతో శరీరం అవశం అయిపోయి కళ్లు మూతలు పడతాయి.

ఇప్పుడు గోవిందమ్మ ఆస్థితిలో వుం దనుకుని, జాలీ పడి, చెయ్యి పట్టుకుని కదుపుతూ "ఇదిగో, నే నిక్కడే

వున్నాను చూడవమ్మా" అంటూ కొండబ్రాహ్మణి ప్రబోధించాడు.

"పా – పం" అన్నాడు చెంచయ్య, జాలిగా.

"అంత సంబరపడుతూ కొడుకును పంపిన మనిషి యిది విని యిలా కావడం ఆశ్చర్యమే. అమ్మా, మీ పిన్నమ్మ చూడూ యెలా వుందో! అదిగో, కోడలు కూడా యెంత నిబ్బరంగా వుందో పరకాయించూ" అన్నాడు గణపతిరాయుడు, తర్జనితో నిర్దేశిస్తూ.

"అది కాదు నాయనా, గోవిందమ్మక్కయ్యకి భూషయ్య అంటే యెంత ప్రేమో, నేనన్నా అంతే ప్రేమ. వెనక, బండి బోల్తాకొట్టి నావొంటినిండా గాయాలయి నప్పుడు కూడా అక్కయ్య యిలాగే కంగారుపడి పోయింది, మరిచిపోయావా?" అంటూ మళ్లీ కదిపాడు కొండబ్రాహ్మణి.

గోవిందమ్మ యిదంతా వింటూనే వుంది.

తన చిత్తక్షోభ చిత్తవిభ్రమంగా భావించుకుంటూ, అది సమన్వయపరుచుకోడానికి వారు పడుతున్న తికమక లున్నా ఆమె తెలుసుకుంటూనే వుంది.

అయితే, తన ప్రణయవ్యాపారం యెప్పటికీ వారికి తెలియకుండానే వుంటుందా ?

తెలిశాక తనమీద వారికీ సానుభూతి వుంటుందా?

స్వాగతమే కాదు, గణపతిరాయని యింట తన కప్పుడు ప్రవేశం అయినా వుంటుందా?

సిగ్గు భిడియాలు విడిచి తానే లోపలికి వెడితే కొండల్రావు తల్లి తన మొగాన పేడనీళ్ళు చల్లకుండా వుంటుందా?

గణపతిరాయ డిలా జాలిపడతాడా ?

భూపయ్యకి తాను రుణపడివున్నందుకు ప్రత్యుప కారంగా కత్తె డయితే కొండల్రావు తనని నరికెయ్య కుండా వుంటాడా?

ఈచింత కూడా ఆమెని వాణికించేసింది; గాని చివరి కెలాగో వొక నిమిషానికి తేరుకుని "తరవాత యేమి జరిగింది తమ్ముడూ?" అనడిగిందామె, సరిగా కూచుని కళ్లు తుడుచుకుంటూ.

"తరవాత అంతకంటే ఘోరయుద్ధం జరిగింది" అంటూ కొండ్రలావు మళ్ళీ అందుకున్నాడు.

"గుళ్ళో ఖంగ్ ఖంగ్ మంటున్నాయి కత్తులు. బయటి ఆవరణలో ఢాం ఢా మ్మంటున్నాయి తుపాకులు. ఫిరంగుల అగాదు వూరంతా వాణికించేస్తోంది. ఏడుపులు - మూలుగులు — పెడబొబ్బలు — హాహాకారాలు — సింహ నాదాలు — పరవళ్ళు — అంతా మహాకోలాహలంగా వుంది. పడిపోయిన శత్రువు కత్తి వుళాక్కుని పెళ్ళికొడుకు

వీరవిహారం చేస్తున్నాడు. మేము ప్రపంచం మరిచిపోయి వున్నాము"

"ఓః! అక్కడున్నట్టుంది నాకు" అంటూ వుగ్గిపోయాడు గణపతిరాయడు, కళ్లు మూసుకుని.

స్త్రీలు కళ్ళప్పగించేసి వూరుకోగా, కుశాగ్రరావు విస్మితాస్యుడై వుండిపోయాడు.

"చూడగా, గుళ్లో, మావస్థాన భూషయ్యా నేనూ మాత్రమే వున్నాం. శత్రువులు నలుగురున్నారు. వారిలో వొకడితో పెళ్ళికొడుకు కలపటం అయినాడు. గుడి యెగిరిపోయేటట్టు అరిచి భూషయ్యా తక్కిన ముగ్గురిమీదా పడగా, నేను సాయం వెళ్ళాను"

పెదిమలూ పిడికిళ్ళూ బిగించుకుని, కళ్లున్నూ మూసుకుని "అదీ వరస, అదీ వరస" అంటూ గణపతిరాయడు సగం లేచిపోయాడు.

"ఒక్క నిమిషానికి భూషయ్యా వొకణ్ణీ నే నొకణ్ణీ నరికివేశాం. ఎలా గయినా మమ్మల్ని పొడిచేద్దామని వీలు చూసుకుంటున్న మూడోవాడు, చేసేది లేక నాకాలు తెగ్గొట్టగా భూషయ్యా వాడి తల యెగరగొట్టాడు"

నీరవ అయి కొండ్రావు భార్య చూడమ్మమీదికి వాలగా, చూడమ్మ ఆనందబాష్పాలు తుడుచుకుంది.

"అది తప్పింది కాదే నాకొడుక్కి" అంటూ కొండ్రావు తల్లి కళ్లు మూసుకుని గోడకి చేరబడిపోగా "ముందే ఆచచ్చినోడి తల యెగరగొట్టకపోయావా తండ్రీ!" అంటూ గోవిందమ్మ చాలా పరితపించింది.

"వద్దువద్దు, విచారించకు. నాకొడుకుని నాకు తక్కించాడు మనమదు, అది మాత్రం తక్కువటమ్మా!" అని సద్దిచెప్పాడు గణపతిరాయుడు.

"ఒకవూరివాళ్ళయినందుకూ, కావలసినవాళ్లయినందుకూ, కలిసిన్ని వెళ్ళినందుకూ –"

"సమయాని కొక్కచోటే వున్నందుకూ" అని అందించాడు కుశాల్రావు.

"అవునవును. అలాగ వొకళ్లకొకళ్ళు ఆసరా అయితేనే అందం. భూషయ్య చూపించిన పరాక్రమమే కాదు, చేసినపనికూడా చాలాగొప్పది, సందేహం లే" దన్నాడు చెంచయ్య.

"అల్లుడు కనక నాతల నిలిపాడు, నేను నాకాళ్లే నిలుపుకోలేకపోయాను, తేడా గుర్తించావా మరి?" అని గోవిందమ్మని నిరుత్తరను చేసేసి మళ్ళీ ప్రారంభించాడు కొండ్రావు.

"దెబ్బ తిన్నందుకు గాదు, యుద్ధానికి పనికిరాకుండా పోయాను నేను, అందుకుపరితాపం. అల్లుడు నాప్రాణాలు

నిలిపినందుకు ఆనందం — నే నీ స్థితిలో వుండగా, శత్రువుల శవాలు పక్క కీడ్చేసి వచ్చి "దగ్గిరుండీ కూడా నీకు దెబ్బతగలకుండా చూడలేకపోయాను మామయ్యా" అంటూ చేతులూ కాళ్ళూ పట్టుకుని చాలా దేవుళ్ళాడాడు పాపం భూషయ్య." "నాయనా, ఆవేశంలో నీకు తెలియులే దేమో గాని, నాకల నిలిపావోయ్ నువ్వు" అని అల్లుణ్ణి వోదార్చాను నేను. అయినా భూషయ్య విచారించడం మాన లేదు. "బతికి బాగుండి వూళ్ళోకి వెడితే తాతయ్య కేమి సమాధానం — "

"అక్కరలే దక్కరలేదు, నీకొడుక్కి నేనే సమాధానం చెప్పుకోవాలి నిజంగా" అన్నాడు, గణపతిరాయుడు అవ్యవధానంగా.

"ఇంకా నం దేహామా!" అన్నాడు చెంచయ్య.

"వినండి, వినండి" అన్నాడు కుశాల్రావు.

"అప్పటికి పెళ్ళికొడుకూ-డా తనమీద పడ్డవాణ్ణి కడ తేర్చి, బ్రహ్మానందపడుతూ వచ్చి తన ప్రియురాలిని రక్షించినందుకూ, ఆవిధంగా తనకు మహోపకారం చేసినందుకూ అనేకవిధాల మెచ్చుకుంటూ గా — ట్టిగా కౌగిలించుకుని భూషయ్య నెత్తేశాడు. వురోహితుని ఒబిలుకింద నక్కి వుండిన పెళ్ళికూతురు కూడా పొంగి పోతూ వచ్చి, తన ప్రియునిలాగే చాలాచాలా మెచ్చు

కుని భూషయ్య రెండుచేతులూ ముద్దుపెట్టుకుంది"

"పా — పం" అని జాలిపడుతూ కొండల్రావు తల్లికేసి చూసి గోవిందమ్మా, వెనక్కి వాలి మొగం పక్కకి తిప్పుకుని కొండల్రావు భార్యకేసి సాకూతంగా చూస్తూ చూడమ్మా గర్వస్ఫూర్తి కనపరచుకున్నారు.

"తరవాత, యెక్కడోనక్కి ప్రాణాలు తక్కించుకున్న కన్యాదాతలు కూడావచ్చి పొందిన ఆనందమూ, చూపిన కృతజ్ఞతా, చేసిన స్తోత్రాలూ చెప్పలేనమ్మా అక్కయ్యా"

"మరి — "

"ఆశ్చర్యం యేమిటీ!" అంటూ గోవిందమ్మ మాట కడ్డంవచ్చాడు చెంచయ్య.

"ఒక్కగా నొక్క కూతురాయె. పెళ్ళి ఆగిపోవడంతో సంఘమరణమే సిద్ధమయ్యె. అలాంటిది తప్పిపోయి నందుకు — "

"తప్పిపోవడం యేమిటోయ్, భూషయ్య తప్పించాడు, తనప్రాణా లొడ్డి" అన్నాడు గణపతిరాయుడు, స్ఫుటంగా.

"మరి తమ్ముడు మాత్రం!" అనడిగింది గోవిందమ్మ, కళ్లు తిప్పుకుంటూనూ, కొండల్రావు వీపు నిమురుతూను.

"నేనూ కష్టపడ్డాను నిజమే నమ్మా! నన్ను చూపించి భూషయ్య జరిగిం దంతా చెప్పగా వాళ్ళందరూ నన్నూ అలాగే గౌరవించారు. నాకు దెబ్బతగిలినందుకు చాలా

పరితాపమున్నూ కనబరిచారు కాని వాళ్ల కూతుర్ని రక్షించినవాడు మాత్రం –"

"భూషయ్యే" అంటూ ముక్తాయించాడు గణపతి రాయుడు.

"అమ్మయ్యా" అనుకుంది చూడమ్మ, తనభూషయ్య ఘనత యెక్కడ వంపకం అయిపోతుందో అన్న ఆదుర్దాతీరి.

చేసిన లౌక్యం నెరవేరినందుకు గోవిందమ్మా చాలా సంతోషించింది; కాని "సిగ్గులేక యెందుకు వచ్చిన నటన యిదీ!" అని యెవరో గా – ట్టిగా నిలవతీసి అడిగిన ట్టయి మళ్ళీ కుంగిపోయింది.

"ఇంతలో పురోహితుడు కూడా వచ్చి భూషయ్యని కౌగిలించుకున్నాడు. కాని, భూషయ్య అక్కడ వుండలేక పోయాడు. బయట యింకా సంకులసమరం జరుగుతూనే వుంది. "మామయ్యా, సెలవు" అంటూ నాకు పాదాభి వందనం చేశాడు. వెంటనే మహోగ్రు డయిపోయాడు. ఆరూపం చూసి వాళ్లందరూ చకితు లయిపోయారు. అప్పటికప్పుడే బొబ్బరించి బయటి కురికాడు భూషయ్య"

"సింహం –"

"ఆమాటే అన్నాడు పురోహితుడు. ఆ శౌర్యసాహ సాలు చూసి "నేను సిగ్గువడిపోయా" నన్నాడు పెళ్ళి

కొడుకు. పరవశ అయి భూమయ్యకేసి రెప్పవెయ్యకుండా చూసింది పెళ్లికూతురు"

కొండ్రావు భార్య చకిత కాగా, గోవిందమ్మ సాకూతంగా చూడగా, ముందు ఏగిసిపడి తరవాత బిడియపడిపోయింది చూడమ్మ.

"అమ్మా" అంటూ పిలిచాడు గణపతిరాయుడు గోవిందమ్మని.

"నేను మళ్ళీ చెబుతున్నాను విను. నాకూ వొక్క కొడుకు, నీకూ వొక్క కొడుకయినందుకు మనవాళ్ళు మన పేరుప్రతిష్ఠలు నిలుపుతున్నారు. దాని సిగ్గోసిరి అదే మంత పెద్ద దెబ్బగానీ — నాకొడుకు మర్యాదగా యింటికి వచ్చాడు. నిండింటో కూచుని చెబుతున్నాను, నీ కొడుకున్నూడా యింకా చాలమంది శత్రువులను సంహరించి, యింకా గొప్పపేరు డనిపించుకుని, యింకా యింకా గొప్ప పదవులున్నూ పొంది వర్ధమానచంద్రుడై యింటికి వస్తాడు, నమ్ము"

"నీ మాట జరిగితీరుతుంది, అలా దీవిస్తూ వుండు" అన్నాడు చెంచయ్య.

చూడమ్మ ఆనందవిహ్వాల అయింది.

కొండ్రావు భార్య కళ్ళు మూసుకుని అమ్మవారికి మొక్కుకుంది.

"తండ్రిపేరూ తన పేరూ తానే నిలుపుకోవాలి, మరేం భయంలేదు మనమడికి" అంది కొండ్రావు తల్లి, గోవిందమ్మ వీపు నిమురుతూ.

చేతులు దోయిలించుకుని "మాయా మర్మమూ యెరగనివాడూ నాబిడ్డ. మీ పాదాలు కొలుచుకుంటూ బతుకుతున్నాడు, అలాదీవించండి తండ్రులారా" అంటూ నమ్రురాలయింది గోవిందమ్మ; కాని "నీకు మాత్రం అలా దీవించే యోగ్యత లేదు తెలుసా!" అని యెవరో ఛీత్కారించినట్టయి కుసిల్లిపోయింది.

# 36

బొత్తె డరిటాకులు పట్టుకువచ్చి "మరి లేవండి" అంది గణపతిరాయని చెల్లెలు.

గదిలో వున్నవా రందరూ వులిక్కిపడి చూశారు.

"అబ్బాయి వచ్చాడు కాదూ? అందుకోసం విందు చేస్తోంది వదిన. మరి లే" అంటూ గోవిందమ్మని రెక్క పట్టుకుని లేవతీసింది కొండ్రావు తల్లి.

కాళ్ళూ చేతులూ కడుక్కువచ్చి అందరూ బంతులు తీరి కూచున్నారు.

కొండ్రావు పెళ్ళానికి చోటివ్వడంలో వాకచివర పడిపోయింది చూడమ్మ.

అది సహించలేక "నువ్విలా రావే చూడా" అని పిలిచి, ఆమెని తన పక్కని కూచోపెట్టుకుని "ఆవేళ గుమ్మం దిగాటప్పటికి కలకల్లాడుతూ యెదురువచ్చింది చిట్టితల్లి. మహా మంచి శకున మమ్మా" అని సంబర పడుతూ అడుగువేశాడు నాయన. అంచేతే, యీ క్షణం వరకూ క్షేమంగానూ వున్నాడు, పేరూ తెచ్చుకుం టున్నాడు" అంటూ ప్రేమావేశంతో పక్కవాటుగా ఆమెని సందిట పట్టుకుని పూర్ధ్వశ్వాసంతో మూర్ధా ఘ్రాణం చేసింది గోవిందమ్మ.

"మరదలా, దయ వుంచేం!" అంటూ చెయ్యోడిసి పట్టుకుని గిల్లాడు, అప్పుడు భూషయ్య.

చూడమ్మ మొదట విడిపించుకోవా లనుకుని – చివరి కదే బాగుం దని అలాగే వుండిపోయింది, సిగ్గుమాత్రం కనపరుస్తూ.

అదంతా యిప్పుడు జ్ఞాపకం వచ్చిం దామెకి.

స్త్రీ కయినా పురుషున కయినా, వయసు వచ్చాక తటస్థించిన మొదటిస్పర్శ జీవితాంతంవరకూ గిలిగింతలు పెడుతూనే వుంటుంది.

పైగా, తానిప్పుడు భూషయ్య సందిటనే వున్న ట్టను కుని పొంగిపోసాగిం దామె.

దీనికి సాయం "మేనత్త సంగిట పెళ్ళికూతురులాగే

కులుకుతోంది మనమరా" లంది కొండల్రావు తల్లి.

చెంచయ్య మందహాసంచేశాడు.

దానిమీద ఉత్సుక అయి కళ్ళల్లోకి చూస్తూ గోవిందమ్మ నవ్వే అనుమకోగా వాళ్ళే మరిచిపోయింది చూడమ్మ.

ఇదంతా అయాక "మొగం యెదట అనకూడదు గాని మనమరాలు చాలా అదృష్టవంతురాలు" అన్నాడు గణపతిరాయడు.

"సంబంధా లేమయినా — "

కొండల్రా వింత మాత్రమే అని మాట తేల్చెయ్యగా "ఇంకా చూడ్డం లేదు తమ్ముడూ" అన్నాడు చెంచయ్య.

"అయితే, నాతో మాటచెప్పకుండా యెవరికీ మాట యివ్వకు" అన్నాడు కొండల్రావు.

"అందరికీ — అన్నిటికీ పెద్దలు తాతగా రుండగా, గారంగా చూసుకునే పింతండ్రి కూడా వుండగా మా కెందుకూ తాపత్రయమూ?" అనడిగింది, గుమ్మం అవతల కూచుని వుండిన చెంచయ్య భార్య, నరసమ్మ.

"అవునా!" అనడిగాడు చెంచయ్యని గణపతిరాయడు.

"మానాయ న్నెరగను గదా నేను! కొండల్రా వొకటీ నే నొకటీ కాదుగదా నీకు! నీతో చెప్పకుండానూ, నీసెలవు పొందకుండానూ యెప్పు డయినా, యేమయినా చేశానా?

ఇది మాత్రం — ”

“అయితే సరే” అన్నాడు గణపతిరాయుడు, సాలోచనగా పక్కకి చూస్తూ.

దానిమీద, గోవిందమ్మ ఆత్రంగా తనకేసి చూడగా, కళ్ళు మూసుకుని అప్రయత్నంగా ఆమెమీదికి వాలిపోయింది చూడమ్మ.

అప్పటి కప్పుడే పళ్ళెంతో తెచ్చి వేసివేసి గారెలూ, పంచదార జిలేబీలూ వడ్డించేసింది గణపతిరాయని చెల్లెలు.

అందరూ ఫలహారాలు ప్రారంభించారు.

రెండోమాటు జిలేబీ విరుస్తూ “ఇంతవరకూ నే నింటికెంత డబ్బు పంపించానో యెరుగుదువు కాదూ ఉంచయ్యన్నయ్యా!” అంటూ మళ్ళీ అందుకున్నాడు కొండల్రావు.

“ఎరుగుదు, నెరుగుదును”

“అక్కయ్యకి భూషయ్య పంపించిందో!”

“ అదీ యెరుగుదును ”

“ ఏ దెక్కువ! ”

“ ఎక్కువ తక్కువల కేమిటి గానీ—”

“ను వ్వలా సందేహించవద్దు. నే నెందు కడుగుతున్నానో— ”

“ అయితే, నువ్వు పంపినదానికి రెట్టింపు ”

కొండల్రావు తల్లి చకిత అయింది.

గోవిందమ్మ అపవారించుకుని సగర్వంగా చూడగా, మొగం వంచుకుని "కాకేం?" అనుకుంది చూడమ్మ.

ఒక్కమాటు రెప్పవెయ్యకుండా చూసి "అక్కయ్యా" అని పిలిచాడు కొండ్రావు.

"ఏం తమ్ముడూ?" అంది గోవిందమ్మ, నోటి దగ్గిరికి తీసుకుంటున్న జిలేబీముక్క కిందికి దింపేసుకుంటూనూ, ఔత్సుక్యం ఆపుకుంటూనూ.

"తలుచుకుంటే వొళ్లు గరిపొడుస్తోంది" అన్నాడు కొండ్రావు.

గోవిందమ్మ వొళ్లూ గరిపొడిచింది.

"డబ్బు విలవ నాకు తెలిసిన ట్టెవరికీ తెలియదని నాకు మహాగర్వం"

"పెత్తనం నీచేతికి వచ్చాక నాలుగు యకరాల కొబ్బరితోట కొనేశావు, తప్పేం!" అనడిగాడు చెంచయ్య.

"కాని, యుద్ధానికి వెళ్లాక డబ్బూ గడ్డిపరకా సమం అయిపోయాయి నాకు"

"మరి నాయనికి?"

"అల్లుడికి, ఇక్కడ వున్నంతకాలమూ పెద్దకానే గడ్డిపరక. అక్కడికి వెళ్లాక మాత్రం దమ్మిడీ కూడా ప్రాణం కంటె యెక్కువయిపోయింది"

"విడిపోలేదు తమ్ముడూ" అంది గోవిందమ్మ,

మిడుతూ మిడుతూ చూస్తూ.

"కనవడ్డ దల్లా కొనుక్కుని తృప్తిగా అనుభవించాను నేను. అనుభవించగా మిగిలిం దే యింటికిపంపుతూవచ్చాను"

"మరి భూషయ్య?"

"కడుపు కట్టిపెట్టుకుని—"

"అయ్యో నాకొడకోయ్" అంటూ కెవ్వున కేక వేసి, చేతిలో వున్న జిలేబీముక్క ఆకులో వడేసి, సొమ్మ సిల్లిపోయినట్టు గోడమీదికి వాలిపోయింది గోవిందమ్మ.

అంతేకాదు, విస్తరిలో వున్న గారెలు కనబడి, మధ్యాహ్నం తానూ అవి తయారుచేసి వుండడమూ, వాటితో పూరుకోక గంటకిందట సేమియా పాయసం కూడా చేసి వుండడమూ, అ వెందుకు చెయ్యావలసి వచ్చిందో ఆ టక్కరి యెత్తూ జ్ఞాపకం రాగా, గుండెలు బద్దలాసిపోయి ప్రపంచం చూడలేక కళ్లు మూసేసుకుని, తలకాయ గోడమీద దొర్లించుకుంటూ మరణవేదనే అనుభవించిం దామె.

ఆమాట వినలేకా యిది చూడలేకా చూడమ్మ కూడా దిగాలు పడిపోయింది.

అంతకి ముందే తెల్లబోయిన కొండ్రావుతల్లి అప్ప టికి తేరుకుని "ఇదేమిటమ్మా వెర్రిపిల్లా? తమ్ముడు మంచికి చెప్పాడా చెడ్డకి చెప్పాడా? శాబాసు, మంచి

కానవే, విను విను ” అని ధైర్యం చెబుతూ జబ్బపట్టుకుని గోవిందమ్మని కదిపింది.

చూడమ్మ కూడా జాలిగా చూస్తూ “ అత్తా ” అని పిలిచింది.

“ అమ్మా ” అని పిలిచాడు గణపతిరాయుడు, మిక్కిలి గంభీరంగా

దాంతో కొంచెం స్తిమితపడి కళ్లు తెరిచి చూసింది గోవిందమ్మ; కాని మాట్లాడలేక పోయింది.

“ ఇలా చూడూ ” అన్నాడు కొండ్రలావు, కొంచెం కరుగ్గా, చురుగ్గా చూస్తూ.

గోవిందమ్మ చూడకుండా వుండలేక పోయింది.

“చెప్పవలసిం దింకా బోలె డుంది, కాస్త చెప్పాటప్పటికే నువ్విలా అయిపోతే—”

“ కడుపు చెరువయిపోతోంది తమ్ముడూ ” అంది గోవిందమ్మ, డగ్గుత్తికతో, ఇంకాయెలాంటివి వినాలో అని ఆత్రంగా చూస్తూ.

“ అదిగో, అదే వెర్రి. గొప్పవాడు కావా లనుకున్న మనిషి సకలకష్టాలూ అనుభవించాలి. ఆ గొప్పతనం తెలుసుకోవాలనుకునే మనిషి, నిశ్చింతగా వుండి ఆ కష్టాలలో నిగూఢంగా వుండే విజయకారణబీజాలు చక్కగా తెలుసుకోవాలి ”

"లేకపోతే అది సాధ్యపడదు, ఇది బోధపడదు, అవునవును" అన్నాడు కొండ్రావు, తల తిప్పేస్తుంటూ.

"మంచిబట్టలు కొనుక్కోమని ప్రత్యేకంగా నిరుడు రెండువందలు పంపాడు. ఈసంవత్సరం కూడా బట్టల కని నూటయాభై పంపాడు, కొనుక్కున్నాన; కాని నాకొడు కక్కడ కడుపుమాడ్చుకుంటూ వుంటే నే నిక్కడ సిల్కు చీరలు—"

సిల్కుచీర లన్న మాట వచ్చాటప్పటికి "వాటితో కుదిర్చావా మహాతల్లీ! కుంకుమపువ్వు—పచ్చకర్పూరం—సారపప్పు—బాదంపలుకులు—కిసిమిసిపళ్లు–" అంటూ వొక పెద్ద జాపితా వినపడ్డట్టయి, కంఠం నొక్కుకుపోగా, మాట్లాడలేక రెండుచేతులా మొగం కప్పేసుకుంది.

"ఊరుకోవమ్మా, వూరుకో" మని సముదాయించింది కొండ్రావు తల్లి, వీపు నిమురుతూ.

"అత్తా" అని పిలుస్తూ చూడమ్మ ఆచేతులు తీసేసింది.

ఇంతలో "నిన్నేడ్పించడానికే కడుపు మాడ్చుకుంటు న్నాడా నీకొడుకు?" అని కొండ్రావు సాగతీశాడు.

అప్పటికి స్తిమితపడి "అది కాదు తమ్ముడూ!" అంటూ కళ్ళు తుడుచుకుంది గోవిందమ్మ

"అది కాకపోతే యిది మానెయ్యి. బావే చేశాడో, నువ్వే చేశావో పూర్వజన్మలో అఖండతపస్సు — యే

మహారాణీ కడుపునో పుట్టవలసిన భూషయ్యా నీ కడుపున పుట్టాడు. అలాంటివాడు నీకు డబ్బు పంపడానికి కడుపు కట్టిపెట్టుకున్నా డంటే తగినంత కారణం – ”

“ఉండదూ?” అనడిగాడు చెంచయ్య.

“పోనీ, నీకొడుకే యేమి చెప్పాడో – ”

“ఏం చెప్పాడు తమ్ముడూ!”

“బొంబాయిలో పెద్దబజారు చూద్దా మని బయలు దేరాం చెంచయ్యన్నయ్యా! ఆ మేడలు, ఆ షాపులు, ఆమోటార్లు, ఆ జనం, ఆదర్జా, ఆవైభవం, – అదంతా చూశాటప్పటికి నిలువునా మారిపోయాడు భూషయ్య. ఒకచోట, డ్రైవరు తలుపు తెరిచి సవినయంగా పక్కకి ఓసరిల్లగా, వొక యువతీ యువకుడూ కారు దిగి దర్జాగా వొక షాపులోకి వెళ్లారు. వాళ్ళని చూశాడు, మామయ్యా అంటూ తాను నిలిచిపోయి నన్ను నిలిపేశా డల్లుడు. ఏమిటన్నాను నేను “డబ్బు లేని బతు కెందుకు వచ్చిన బతుకయ్యా?” అనడిగాడు నన్ను నీకొడుకు”

“సెబాస్” అంటూ చిటికవేశాడు గణపతిరాయుడు, అవ్యవధానంగా.

“ఏమిటి విశేషం?” అన్నట్టు చూశాడు కుశాల్రావు.

“చాలా భయపడిపోయాను; కాని మనమడు మంచి దారే తొక్కాడు చివరికి” అన్నాడు గణపతిరాయుడు.

చెంచయ్య మిడుతూ మిడుతూ చూడగా "అలా అన్నావేం బావా?" అనడిగాడు కుశాల్రావు.

"అక్కడ భూషయ్య నాకర్షించిన వస్తువేమిటి?"

"ఆపిల్ల – "

"ఛూ"

"కారు" అన్నాడు చెంచయ్య.

"అదీ మాట. యువతీ యువకుడూ ప్రత్యక్షంగానే వున్నా పరోక్షమైన ఆ యువకుల ఐశ్వర్యంమీద పడింది భూషయ్య దృష్టి"

"అవునవును"

"అవునవు నన్నావు గాని పెళ్ళాం ముందా, ఐశ్వర్యం ముందా?"

ఏమంటే యేమవుతుందో అని మిడుతూ మిడుతూ చూసి వూరుకున్నాడు కుశాల్రావు.

"నువ్వేమంటావు చెంచూ?"

"లోక సామాన్యం మాట చెబుతాను"

"కానియ్యవోయ్"

"ఐశ్వర్యం వుంటే మంచి పెళ్ళాం వస్తుంది. పెళ్ళాం వచ్చాక ఐశ్వర్యం వినియోగపడుతుంది"

"వినియోగమా?"

"అంటే ఖర్చుపడుతుం దన్నమాట"

"కనక?"

"అల్లుడిదృష్టి పిల్లమీద పడలేదు. డబ్బుమీదపడింది"

కొండ్రావు కేసి చూశాడు గణపతిరాయుడు.

"కనకనే, అంతకితం, రూపాయు అంటే భూషయ్య దృష్టిలో వొకదమ్మిడీ; కాని ఆక్షణం మొదలు దమ్మిడీ పెద్దకా నయిపోయింది"

"బంగారవు గోడలు కట్టేస్తాడు మనమడు" అంది కొండ్రావు తల్లి.

"అలా దీవించండి అత్తయ్యా" అంది చెంచయ్య భార్య నరసమ్మ.

అప్పుడు చెంచయ్యని పిలిచి "ఓడలో మా కిద్దరికీ ఒక్కమాటే వల్లమాలిన వికారం వచ్చింది. డోకుక్కున్నాం. ఆరాత్రంతా చాలా గాభరాపడ్డాం. అప్పు డేమన్నాడో యెరుగుదువా భూషయ్యా?" అనడిగాడు కొండ్రావు.

"తల్లి జ్ఞాపకంవచ్చిందా?" అనడిగాడు గణపతిరాయుడు.

గోవిందమ్మ గుండెలమీద చేతులు వేసుకుంది.

"ఎంత కంగారుపడిపోయాడో బిడ్డ!" అంది కొండ్రావు తల్లి.

"సరిగా అంతే" అని తండ్రికేసి తిరిగాడు కొండ్రావు.

"డాక్టరు మందిచ్చాడు. ఆజబ్బు వోడ యెక్కిన ప్రతీ వాడికీ వస్తుంది, వింతా లేదు, భయమూ లేదు. ఒకటి

రెండు పూటల్లో తగ్గిపోతుంది; కాని పున్నంతసేపూ మాత్రం యేమీ తోచదు. మళ్ళీ మళ్ళీ డోకోక్కడం, ఎవడికి వాడే నీళ్ళందుకని పుక్కిలించుకోడం, తలతిరగడం — ఈస్థితిలో వుండగా "మా అమ్మ విలవ నాకిప్పుడు తెలిసింది మామయ్యా" అన్నా డల్లుడు"

"నాతండ్రి, నాతండ్రి" అంటూ మళ్ళీ గుండెలమీద చేతులు వేసుకుంది గోవిందమ్మ.

"అప్పు డలా యెందు కన్నాడో గాని నే నంటే యెప్పుడూ భక్తే నానాయనికి, నామాట యెప్పుడూ జవదాటి యెరగడు. నన్నెప్పుడూ కష్టపెట్టిన్నీ యెరగడు"

"జబ్బు చేస్తే తనకి తానే చాకిరీ చేసుకోడం మాత్రం యెరుగును టమ్మా నీకొడుకు?"

"అలా అడుగు" అన్నాడు కుశాల్రావు, వంగి, చెంచయ్యని తప్పించుకుని, సాగి, గణపతిరాయని కేసి చూస్తూ.

"నాతండ్రి యెప్పుడూ జబ్బే యెరగడు. ఎప్పు డేనా తలనొప్పి వస్తే, నేను బెంబేలుపడిపోతా నేమో అని బాధ దాచేసుకుంటాడు. "కంగారుపడకమ్మా యేవడికైన మయినా పడితే తలనొప్పి రాదూ? తలనొప్పి వస్తే చిరాగ్గా వుండదూ? పొలం వెళ్ళలేను గాని, యీ బాధ యిలాగే వుండిపోతుంది టమ్మా? చూడూ, వచన భారతం తీసుకువచ్చి, నాదగ్గిర కూచుని యే వుత్తరగో

గ్రహణమో, యేపద్మవ్యూహమో, యేశల్యసారథ్యమో చదివి వినిపించు" అంటాడు నాయన"

"అలాంటప్పుడు నువ్వేమి చేస్తావ్?"

కొండల్రావిలా అడగ్గా యేదో చెప్పబోయింది గోవిందమ్మ; గాని "నా కిప్పుడదే వనా?" అని విసుక్కుంటూ గదిలోకి వెళ్ళి, తలుపులు బిడాయించుక్కూచుని తిమ్మన్న రాసిన మోహలేఖలు మళ్ళీమళ్ళీ చదువుకుంటూ కులుకుతుంద్ది" అని యెవరో అన్నట్టయి నోట మాట రాకపోగా రెప్పవెయ్యకుండా చూస్తూ వూరుకుంది.

"పోనీ, యిప్పటిలాగ గోలపెడతావా?" అని మళ్ళీ అడిగాడు కొండల్రావు.

దానిమీద చూసిచూసి "యేడ్చేదాన్ని నవ్విస్తావు తమ్ముడూ నువ్వు" అంది గోవిందమ్మ, చిరునవ్వు తెచ్చుకుంటూ.

అది చూసి చూడమ్మ ముసిముసినవ్వులు నవ్వుకుంది.

"కనక, నే నిప్పుడు చెప్పేదన్నీ నవ్వుతూనే విను. కొడుకంటే అందరి కొడుకుల వంటివా డనుకుంటున్నా వేమో నీకొడుకు, వయస్సుకి చిన్నవా డయిపోయాడు గాని అతని కాళ్లు – "

"వద్దు తమ్ముడూ, నాకొడుకుని దీవించు తమ్ముడూ"

అంది గోవిందమ్మ, చేతులు దోయిలించుకుని కంగారుగా.

తాను కూడా చేతులు దోయిలించుకోబోయింది చూడమ్మ; కాని సిగ్గు ముంచుకురాగా మానేసి, ప్రశంసా గర్వమూ, సుఖమూ ఆనందమూ, ఆశా ఆందోళనా నిండివుండిన చూపుల్లోనే అంజలిబంధమూ వేడికోలూ రూపించుకుంది.

"మే మెంతయినా దీవిస్తాం, మాం తామా? కాని తన కోరికప్రకారం సుఖపడుతూ నువ్వు దీవిస్తేనే తనకు జయం అబ్బుతుం దని నమ్ముకుని వున్నాడు, నీకొడుకు. అలాంటి ఆశీర్వచనం కోరి నీపాదాలే స్మరించుకుంటు న్నాడు నీకొడుకు"

గోవిందమ్మ ఆనందవిహ్వాల అయింది.

"నాచిట్టితండ్రి — నాబంగారుతండ్రి — నాకోసం జెంక పెట్టుకున్నాడు కామోసు నాయనా!" అంటూ కొండల్రావు వీపు నిమిరిం దామె; కాని తిమ్మన్న, తన పాదాలు ముద్దుపెట్టుకుంటా ననడం జ్ఞాపకంవచ్చి "ఆపాదపూజ యేమిటో తెలుస్తుంది, తొందరపడకే రాకాసీ" అని యెవరో అన్నట్టయి గతుక్కుమంది.

"చెంచయ్యన్నయ్యా" అంటూ మళ్ళీ అందు కున్నాడు కొండల్రావు.

"మేము వెళ్ళిన దేశం అన్ని విధాలా మనకి మరో

ప్రపంచం. ఆఫలాలే వేరు. ఆపిండివంటలే వేరు. ఆపానీయాలే వేరు. ఆభోజనమే వేరు. ఆమనుష్యులే వేరు. ఆవద్ధతులే పూర్తిగా – ”

“అచ్చంగా మన తెనుగుగడ్డలు హైదరాబాదు బెంగుళూరులే అలా కనపడతాయి కదా, యెక్కడో సముద్రాల అవతలి దేశం – అక్కడి పద్ధతి వేరుకావడం ఆశ్చర్యమా!” అనడిగాడు కుశాల్రావు.

“వీలయితే వాళ్ళని చంపడానికీ, వీలుతప్పితే మనమే చచ్చిపోడానికీ వచ్చాం మన మిక్కడికి. ఇక్కడ మనకి నాఅన్నవా ళ్ళెవళ్ళూ లేరు. మనచేతిలోనా పుష్కలంగా డబ్బుంది, బతుకా అనుమానాస్పదం. అనవసరంగా కడుపెందుకు మాడ్చుకుంటావూ? అక్కడ మీఅమ్మకి లోటేమయినా వుందా పోనీ? హరీ అన్నామంటే యీడబ్బు మనకనుభవానికి వస్తుందా? కనక, బతికుండి వెడితే ఆపెన్షనే చాలు, ఇక్కడ తృప్తిగా అనుభవించు నాయనా” అని చేతులు పట్టుకుని బతిమాలుకున్నాను నేను; కాని వూ – హూ – ”

పెదిమలు బిగించుకుని తల అడ్డంగా వూపుకుంటూ కొండల్రావు విలా అనేటప్పటికి, గోవిందమ్మా చెంచయ్యా యేకకాలంలో “భూషయ్య దాని కేమన్నాడూ!” అనడిగారు, ఆత్రంగా.

దానిమీద వొక్కమాటు కళ్లు మూసుకుని అప్పటి మైమరుపు మళ్ళీ వొకమాటు అనుభవానికి తెచ్చుకుని "ఇప్పుడు వింటున్నట్టుంది" అన్నాడు కొండ్రావు ముందు.

తరవాత వొక్క క్షణం ఆగి "పెద్దవాడవు నీమాట తోసెయ్యడం తప్పే మామయ్యా, కాని మాఅమ్మ బతుకు చూశావా!" అనడిగాడు భూషయ్య. పెళ్లి అయిన ఆరుమాసాలకే — నేను కడుపున వుండగానే మా నాయన చనిపోయాడూ? తరవాత నేను పసివాణ్ణయి పోయానూ? అటు పెనిమిటివల్ల పొందగలిగిన సుఖాలూ యెరక్క ఇటు కొడుకువల్ల పొందవలసిన సేవలూ యెరక్క, యేమి చూసుకుని బతకగలిగిందో కాని ఈయిరవై సంవత్సరాలూ అంధకారంలో పడే కొట్టుకుంది గదా మాఅమ్మ! ఇలాంటి స్థితిలో నేనిక్కడ సుఖపడడం ధర్మమే నంటావా? వెనకటి సంగతి యేమయినా, నేను ప్రయోజకుణ్ణయి, దోసిళ్ళకొద్దీ సంపాదిస్తున్నందుకు డబ్బుతో సమకూడే సుఖానందా లయినా అనుభవించవద్దుటయ్యా మాఅమ్మ?" అని కూడా అడిగాడు భూషయ్య" అన్నాడు కొండ్రావు.

"ఆహా, ఆహా" అన్నాడు గణపతిరాయుడు, సవ్యాపసవ్యాలుగా తల తాటించుకుంటూ.

"కొడుకంటే భూషయ్యే కొడుకు" అన్నాడు చెంచయ్య.

చూడమ్మ గోవిందమ్మకేసి చూసింది.

ఈ మాటల్లో వొకొక్కటే చెవిని పడ్డప్పుడు, హృదయాని కొకొక్క మధురస్పందనం కలిగి మోదమూ, ఆవెంటవెంటనే వొకొక్క బల్లెప్పోటు తగిలిన ట్టయి ఖేదమూ సమంగా కలగ్గా "కొడకా, కొడకా" అని అస్పష్టంగా పలుకుతూ కళ్ళు మూసుకుని గోడకు ఆనుకుంది గోవిందమ్మ.

"ఇప్పుడు మాత్రం మీ అమ్మకి వచ్చిన లోటేమి" టనడిగాను చెంచయ్యన్నయ్యా" అంటూ మళ్ళీ అందు కున్నాడు కొండ్రలావు.

"నిజమే, లోటేమిటీ?" అనడిగాడు చెంచయ్య గోవిం దమ్మకేసి చూస్తూ.

"నిన్నే" అన్నట్టు గోవిందమ్మని కదిపింది చూడమ్మ.

దానిమీద "నాకు వచ్చిన లోటేమి టయ్యా!" అన డుగుతూ సరిగా కూచుంది, గోవిందమ్మ.

"నేనూ అలాగే అనుకున్నాను. కాని భూషయ్య పెద్ద లోటే కనబరిచాడు"

"ఏమిటదీ?"

గోవిందమ్మా, చెంచయ్యా, గణపతిరాయడూ ఏక కాలంలో అడిగా రీప్రశ్న.

"అది తీరడానికి తా నేమి చేస్తాడో అదికూడా – "

"ఏమి చేస్తా డంట తమ్ముడూ!"

"మా నాయన బతికివుంటే పెన్షను పుచ్చుకునేటప్ప టికే ఆపని చేసి వుందును; కాని దేవుడు చూడలేక పోయాడు. చక్కని యిల్లుండనే వుంది కదా! మామిడి తోట కాక, అయిదు యకరాల పల్లంభూమికూడా వుం డనే వుంది కదా! వాటికి సాయం, మరో యేడు యక రాల పల్లం సంపాదించాలి, అప్పుడూ నేను నిద్రపోవడం. ఆ పన్నెండు యకరాలూ స్వయంగా పండించి "నీయిష్టం వచ్చినట్టు ఖర్చుపెట్టుకో" మని నెల కొక యకరం ఆదా యం మా అమ్మ చేతిలో పొయ్యాలి, అప్పుడూ నేను దర్జాగా అనుభవించడం"

"ఓః! రాజా ప్రతం, రాజాప్రశం" అంటూ చేతు లెగరవేసుకున్నాడు గణపతిరాయుడు.

"తనమీాదే దృష్టిపెట్టుకుని కైలాసంలోవున్న తండ్రికీ, ఇక్కడ పెద్ద ఆశతో పెంచుకుంటున్న తల్లికీ భూపయ్య తీర్చే రుణం అదీ" అన్నాడు చెంచయ్య, వొత్తిపలుకుతూ.

"తన పేరిలోనే గాక, తన వంశానికీ, మన వూరికీ కూడా భూపయ్య అప్పుడు భూప అవుతా" డన్నాడు, కుశాల్రాప్రు.

అగమూాశలు పడ్డ చూడమ్మ కళ్ళకి కొత్త చిత్రం కన పడింది.

ఇంతలో "నాతండ్రే, నాతండ్రే" అనేగాని మరోమాట రాక, అదయినా మందమందంగా వలుకుతూ చూడమ్మ మీాదికి వాలిగి అవశ అయిపోయింది గోవిందమ్మ.

అలాగ వొక్క క్షణం వుండిపోయిం దామె.

ఆవొక్క క్షణంలోనూ యెక్కువభాగం, తన కొడుకే వంపుతున్న తనడబ్బూ, తనకొడుకే పూజించుకుంటున్న తన బతుకూ తానే తిమ్మన్న చేతిలో పెట్టెయ్య తలచి వుండడం జ్ఞాపకం వచ్చి, వొక్క మాటుగా నూరు తేళ్ళు కుట్టినంత యాతన అనుభవించిందామె.

ఈ స్థితిలో గణపతిరాయని చెల్లెలు మళ్ళీ వచ్చింది. మారువడ్డిద్దామని గారెలూ జిలేబీలూ పట్టుకువచ్చిందామె; కాని వడ్డించినవన్నీ వడ్డించినట్టే వుండడం చూసి నివ్వెరపడి "అయ్యో, మీాయిల్లు బంగారంగానూ, కాస్తయినా పుచ్చుకున్నారు కారేమర్రా? నేను రెక్కలు ముక్కలు చేసుకున్నందుకిదా ఫలం?" అంటూ సాగతీసుకుంటూ నిలబడిపోయింది.

# 37

భోజనాలయేటప్పటికి చీకటి కమ్ముకుంది, గుమ్మందిగా టప్పటికి అగ్నిహోత్రం భగ్గుమంది.

శరీరం వొణికిపోయిండ, కాళ్లు తేలిపోయాయి.

తల తిరిగిపోయింది, చూపులు చెదిరిపోతూాయి.

మనస్సు క్షుభితం అయింది, బుద్ధి యితికర్తవ్యతా మూఢం అయిపోయింది.

ఈ స్థితిలోనే నాలుగిళ్లు దాటింది గోవిందమ్మ.

ఎదర్నుంచి మోటబండి తోలుకువస్తూ "తప్పుకోండి, తప్పుకోండి" అంటూ కేకవేసి, కొంచెం పక్కగా మళ్ళించుకు పోతూ డొక కర్షకుడు.

వెనకనుంచి సైకిలు తొక్కుతుంటూ వచ్చి, దగ్గిరికి వచ్చాక గంట గణగణ లాడించి రామకుంటూ పోయాడొక నవనాగరికుడు.

అప్పుడే పాలు తాగివుండిన వుల్లాసంతో మెదరిగో లేగదూడ యెగురుతూ దుముకుతూ వచ్చి ఆప్యాయనంగా చెయ్యి నాకింది.

గోడపక్కగా పెంటకుప్పమీద వడ్డలింపు సేవ అనుభవిస్తూ వుండిన వూరకుక్క, అలాగే వుండి మోరమాత్రం పైకెత్తుకుని "కుంయ్, కుంయ్" మంది.

అప్పటికి మరో నాలుగిళ్లు దాటిందామె.

ఏదో వెంటబడి వస్తున్నట్టాయి వులిక్కిపడి వెనక్కి తిరిగి చూడగా, తూర్పునుంచి వెన్నెలవరద ముంచుకు వస్తోంది.

అది చూసి హర్షోత్ఫుల్ల అయి పడమట మంచినీళ్ళ

చెరువు, కలవపువ్వుల కషాయగంధం బుగ్గలకు పులిమీ పులిమి విడిచిపెట్టగా, బెదిరిపోయి, తూల్తూ తూల్తూ వచ్చి చుట్టుకుపోయింది గాలిపిల్ల.

దాంతో, ప్రపంచం తెలిసింది గోవిందమ్మకి.

అవ్యవధానంగా "అటా యిటా" అన్న జిజ్ఞాస కూడా రేకెత్తిం దామెకి.

వెంటనే నిలిచిపోయి "కత్తా బద్దా?" అన్నంత కచ్చితంగా ప్రశ్నించుకుని, దృష్టి యేకాగ్రం కావడానికి కళ్లు మూసుకుని ఆలోచించిం దామె.

మనస్సు చంచలమూ, పైపై మెరుగులకు మోసపోయేదన్నీ కనక దాని నిర్ణయం అంగీకరించలేకా, బుద్ధి నిశితమే అయినా ప్రమాదాని కాస్పదం కనక దాని నిర్ణయమున్నూ వొప్పుకోలేకా, నూటిగా హృదయంతో జేసిం దామె, ఆలోచన.

ఇటు ప్రేమ..................అటు ప్రణయం.

ఇటు వాత్సల్యం..................అటు వాల్లభ్యం.

ఇటు పాలన..................అటు ఆరాధన.

ఎటూ నిర్ధారణ చేసుకోలేక మళ్లీ ఆలోచించింది.

ఇటు ముచ్చట్లు..................అటు మురిపాలు.

ఇటు వినోదాలు..................అటు విలాసాలు.

ఇటు మర్యాద..................అటు మనోల్లాసం.

ఇటు సంఘం..................అటు స్వర్గం.

ఇటూ అటూ కూడా వరువైన యీ వయస్సున ఆడ దాని కిందులో అక్కర్లేని దేది?

ఈమాటు కళ్లు గుచ్చేసుకుంది.

ఇటు కన్న కడుపు ..................అటు......?

ఆమాట తో చాటప్పటి కామె చైతన్యం లోపించిన ట్టయిపోయింది.

తరవాత, గుండెల మీాద కసిక్కున కైజారు గుచ్చు కున్నట్టున్నూ అయి "స్స" అంటూ మొగం చిట్లించు కుని చాలా బాధపడిం దామె.

అయినా, అంతటితో నిరాశ చేసుకోలేక "మరి అటు? మరి అటు?" అని మళ్లీ మళ్లీ తర్కించుకుని మళ్లీ మళ్లీ సంబంధాలు వెతుక్కుని, హృదయంమీాద సమ్మెటపెట్లూ, శిరస్సున పిడుగుపాట్లూ మళ్లీమళ్లీ పడ్డట్టయి, మళ్లీ మళ్లీ బాధపడిపోయిం దామె.

ఇలాగ — ఎన్నిమాట్లు—ఎంతెంత అవస్థపడ్డా "రంకు మొగుడు" అనే తప్ప మరో మాటే స్ఫురించకపోగా వెలపరం పుట్టుకు వచ్చిం దామెకి.

దానిమీాద "ఛీ, కట్టుకున్న పెనిమిటి కానప్పు డదేం బతుకూ?" అని యీాసడించుకుం దామె.

"భూషయ్య తల్లికి రంకు మొగుడా?" అని శౌర్య

మున్నూ తెచ్చుకుం దామె.

వెంటనే అంతకంతకే కలిగివుండిన ఆవెలపరింపు ఆయీనడింపుతో కలిసి వాణు కయి, ఈ శౌర్యస్ఫురణంతో అగ్ని అయి ఆమెని చుట్టబెట్టుకుంది.

మంట లరకాళ్లకింవా నాలుకలు కీలుకీలునా, పొగలు కళ్లల్లోనూ సెగలు శిరస్సునా, భుగభుగలు మనస్సునా ఛటఛ్ఛటలు హృదయంలోనూ అయి సుడిగాలితోడయిన దావానలం లాగ నిలువునా దహించే వేసిం దామెని.

# 38

ఆవృద్ధృతం శాన్త తగ్గాటప్పటికి, ఆమంటల వెలుగున, మసకమసకగా నారమ్మ కనపడిం దామెకి.

గోడచాటున నుంచుని, అటూ యిటూ దొంగ చూపులు చూస్తూ యేవో కాగితమ్ముక్కలు లెక్కబెట్టు కుంటోంది నారమ్మ.

"అవేమిటి, నోట్లా?" అనుకుంది గోవిందమ్మ.

ఈవూహా తోచాటప్పటికి మంటలు మళ్లీ విజృంభించాయి.

అయితే, మాంటిలుస్పర్శతో కిరసనాయిలుమంట వర్ణాంతరం పొందేటట్టు యీవూహతో రోషంగా మారి పోయిం దా అగ్ని.

దాంతో "మాయలమారిముండ, కానలేకపోయాను, గడ్డి తిని తార్చడానికి వచ్చింది నన్ను" అనుకుంటూ పళ్లు పిండి చేసుకుంది గోవిందమ్మ.

నారమ్మ మాటలు అప్పుడు వింటున్నట్టూ, టక్కులప్పుడు కంటున్నట్టూ అనిపించిం దామెకి.

నిజమే.

అయితే, మరి, తన మాటలు?

తన టక్కులు?

అవి మాత్రం సామాన్యంగా వున్నాయా?

ఒకొక్కప్పుడు నారమ్మకి తానే పైచెయ్యి అయిపోలేదూ?

తా నొక్కొక్క మాట అన్నప్పుడూ, ఒకొక్క రస్సా వేసినప్పుడూ జారిణీజార సంధానంలో జగజంత అయిన నారమ్మే కీచుకీచుమని పోలేదూ?

పోనీ, నిజంగా నారమ్మ తార్చడానికే వచ్చినా, యీవ్యవహారంలో తన స్వార్థమూ తన ప్రయత్నమూ తన తహతహా యెక్కువగా వుండలేదూ?

చూసినకొద్దీ తప్పంతా తనదే అని స్పష్టం అయింది గోవిందమ్మకి.

నారమ్మ కలగజేసుకోడంవల్ల, అధమం వారాలయినా పట్టవలసిన వ్యవహారం పూటల్లో తేలిపోయిం, దంతే.

కనక, నారమ్మ నని లాభం లేదనుకుంది గోవిందమ్మ.

పైపెచ్చు, బతిమాలుకోవాలిగాని కోప్పడితే, నారమ్మ తన శీలం చెరవలేకపోయినా, తన సంగతి వూరంతా యేకేసి, తిరపతమ్మని కూడా వుసికొల్పి అల్లరి చేయించి, ఆవిధంగా కసితీర్చుకుంటుం దనిన్నీ భయపడిం దామె.

దీనికి సాయం, యిలా స్థిరపరుచు కునే టప్పటికి "తిమ్మన్నని వెంటబెట్టుకువెళ్లి నారమ్మత్త మన యింటి దగ్గిర కనిపెట్టుకుని వుంటుం దేమో కొంపతీసి!" అని కంగారుపట్టుకుం దామెకి.

అదే నిజమయితే, తిమ్మన్న యేగోడ చాటునో నక్కి వుండినా, నారమ్మ మాత్రం గుమ్మంలో కణాయించు కూర్చుని వుంటుంది, అప్పాలవాడిలాగ, వచ్చే పోయే వాళ్ళ కందరికీ కనపడుతూ.

కొంద రామెని పలకరిస్తారు.

ఆమే కొందర్ని పలకరిస్తుంది.

అనివార్యంగా, కారణపరీక్షా కార్యనివేదనా జరిగి తీరతాయి.

కొందరు విని, మరిచిపోయిన్నీ చక్కాపోయినా, కొంద రామె చెప్పిందే నమ్మినా, కొందరయినా ఆమెని కాక తననే అనుమానిస్తారు.

"ఎవణ్ణో కలువుతుందోయ్" అనీ "మెవ రయి

వుంటాడోయ్!" అనీ "యీ చుట్టుపక్లె నక్కి వుంటాడు వెతకండోయ్" అనీ, ఆ రకం కుర్రనాయకులు నందు గొందులూ పాడుదొడ్లూ గాలించేస్తారు కూడా.

తన కపసరం వచ్చి తానే అంతగా మేగింది గాని, వూళ్ళో పరువైన యే ఆడది నారమ్మని చేరనిస్తుంది!

నారమ్మ తార్పుడుకత్తె అనీ, యెన్నో కొంపలు కూల్చిం దనీ యెవ రెరగరూ?

తానుమాత్రం ఆమెతో అదివరకి మాట్లాడియెరుగునా?

ఇలాంటి సందర్భంలో, యింత రాత్రి అయాక, నారమ్మ తనకోసం తన గుమ్మాన కనిపెట్టుకుని వుండడం మంచిదా?

ఒక్క క్షణంలో వూరంతా గుప్పు మనిపోదూ?

ఝంఝూమారుతంలో యేలకితీగ లాగ మళ్ళీ వొణికిపోయింది గోవిందమ్మ.

ఉత్తరక్షణంలో వూచలాగ బయలుదేరింది.

# 39

ఇంకో నాలుగిళ్ళు దాటాటప్పటికి యెడమవేపు నందు మొగనే నారమ్మ యిల్లు.

"నాలుగు వీథుల మొగని కాసింది, ముండ" అనుకుంది గోవిందమ్మ.

"సెంటు భూమి లేదు. ఇటున్న చెంబు అటు పెట్టదు; కాని చలవమడతలే కడుతుంది. నన్ను బిచ్చమే కాని ముట్టదు. ఎంతమంది ఆడవాళ్ళ మానమర్యాదలు వీట్లో కలిపిన కూడో అది!" అని యేవగించుకుం దామె.

ఇంతకీ: ఇంటో వున్నట్టా లేనట్టా?

తీరా, వెళ్ళి చూస్తే అక్కడ లేకపోతే!

ఒక్క క్షణం గజిబిజిపడిపోయింది గోవిందమ్మ.

"ఏమయినా, యిక్కడే తెగతెంపు లయిపోడం మంచి" దని తోచిం దామెకి.

వెంటనే గబగబా వెళ్ళి దడదడా తలుపు గుంజింది.

ఎవరువా రంటూ వచ్చి, తలుపు తీసి గుర్తించి, లోపల అడుగుపెట్టాటప్పటికి "నీకోసం కాలు కాలిన పిల్లి లా తిరుగుతున్నా, నెక్కడికి వెళ్ళావు చిట్టికల్లీ!" అంటూ ఆమెని పొదువుకుంది నారమ్మ.

గోవిందమ్మ తన మాయలో పడ్డం వొక యెత్తూ, యింతసేపటికి వెతుక్కుంటూ తన యింటికే రావడం వొక యెత్తూగా తోచిం దామెకి.

కాని, ఆవాలకం చూడలేకా, ఆధోరణి సహించలేకా, ముఖ్యంగా "చిట్టికల్లీ" అన్న సంబోధన భరించలేకా పేగులు తోడేసినంత బాధపడింది గోవిందమ్మ.

భల్లూకప్పట్టులో యిరుక్కుపోయినట్టు మళ్ళీ

వాణికికిన్నీ పోయిందామె.

అది చూసి "యేమి తల్లీ, యేమి మామ్మా!" అనడిగింది నారమ్మ.

పాయసం పుచ్చుకుని వెళ్ళిపోయే దాకా తాను గోవిందమ్మని పొదువుకున్నప్పుడు కలిగిన వాణుకులోనూ యీ వాణుకులోనూ భేదం కనపడిందామెకి.

అది, గోవిందమ్మకి రక్తం పొంగించిన వాణుకూ, తనకి గంధపూ్వాత అనిపించిన వాణుకూను.

ఇది, గోవిందమ్మకి గుండెలు పగిల్చేసిన వాణుకూ, తనకి కారపుగుండ పూసినట్టనిపించిన వాణుకూను.

ఈభేదం గుర్తించి "యేదో మునిగింది" అనుకుంది నారమ్మ.

ఆమె మనస్సు పరిపరివిధాల పోయింది.

కాని, మళ్ళీ ఆమె మాట్లాడకముందే ఆబాహు బంధం విడిపించుకుని "నువ్వు అత్తవు కావు, మా అమ్మవు" అంటూ ఆమె రెండు కాళ్ళూ పట్టుకుంది. గోవిందమ్మ.

"ఏం తల్లీ, యేమిటి?"

"యుద్ధానికి వెళ్ళిన మా గణపతిరాయడు బాబుగారి కొండ్రలా వింటికి వచ్చేశాడు"

"ఏం, మెంచేశా?"

"తమ్ముడు నాకొడుకు సంగతు లన్నీ చెప్పాడు"

భూమయ్యకి కాళ్లో చేతులో రాలిపోయి వుంటా యనుకుంది నారమ్మ. ఈ వూహతో "మనమడు కులాసాగా వున్నాడా చిట్టీ?" అనడిగింది, అందుకోసం తా నెంతో ఆదుర్దాపడుతున్నట్టు.

"నిక్షేపంలా వున్నా డంట. ప్రాణా లన్నీ నామీదే పెట్టుకుని వున్నా డంట నాయన"

"లేకపోతే, యుద్ధం అంటే వూళ్ళో లోకువయిన వాళ్ళతో గిల్లి కజ్జాలు తెచ్చుకోడమా యేమిటి?" అనుకుని, పైకి మాత్రం "పోనీ, చల్లని కబురు చెప్పా" వంది నారమ్మ, అప్పటికి స్తిమితపడ్డట్టు గుండెలమీద చేతులు వేసుకుని.

"కబురు చల్లందే; కాని నా ప్రాణాలు కొరికేస్తోం దది" అంది గోవిందమ్మ.

"అదేమిటి తల్లీ?"

ఇలా అడుగుతూ నారమ్మ మళ్లీ పొదువుకోబోయింది; కాని, గోవిందమ్మ, ముందు ఆమె కందకుండా తప్పుకుంది.

అందుకే నారమ్మ తెల్లబోతూ వుండగా, తరవాత "నా కొడుకుని నేను చంపుకోలే" నంది, తల అడ్డంగా వూపుకుంటూ.

ఇది విని నారమ్మ మరీ యిదయిపోయింది.

"జరిగిం దేదో జరిగింది. అలా యెందుకు జరిగిం దని నన్నడక్కు. అదంతా మరిచిపో. నా బతు కంతా నువ్వో రుగుదువు. హఠాత్తుగా మతి చలించి, నుంచున్న పాళంగా దుర్బుద్ధి పుట్టి కళ్లు మూసుకుపోగా, నాగొయ్యి నేనే తవ్వుకున్నాను, గాని నా చేతులు పట్టుకుని వుండి, కళ్ల నీళ్లతో నాకేసే చూస్తూ ప్రాణాలు విడిచిన నా పెనిమిటి, సమయాని కాదుకుని నాకీ గండం తప్పించారు"

అప్రతిభ అయిపోయింది నారమ్మ.

"దానికీ దీనికీ గూడా కారణం నేనే కాని మరెవరూ కారు. నామీద అనుగ్రహం వుంది కనక, నువ్వు ఇందాకా అందుకు పూనుకున్నావు, ఇప్పు డిందుకూ నువ్వే పూను కోవాలి"

ఉత్సాహంతో పొంగులువారుతున్న రక్తం అప్పటికి చప్పగా చల్లబడిపోయింది; గాని ఉత్తరక్షణంలోనే రోషంతో మళ్లీ వేడెక్కగా "ఏమంటావే!" అనడిగింది నారమ్మ, కంఠంస్వాధీనపరుచుకునీ వొళ్లు మండబెట్టుకునీనీ.

దానిమీద "యేమనడానికీ యేమి వుంది? తిమ్మన్న, నా పెద్దకొడుకు, సరా?" అంది గోవిందమ్మ.

నారమ్మ కొయ్యాయిపోయింది.

"అతని నరసం గుర్తించి మొదట తిరస్కరించిన్నీ, తరవాత పెనిమిటిగా సేవించుకుందా" మని మననుపడ్డాను;

కాని ఆమైకం వదలగా, యిప్పుడూ ఆపరవమే నమ్ముకుని, అతను నాభూవయ్యకి అన్నగారని నిశ్చయించుకున్నాను''

అప్పటికీ నోట్టాడలేకపోయింది నారమ్మ.

"కనక, నీకు అత్తవరస అయిన గోవిందమ్మ క్షణం కిందటే చచ్చిపోయిందని అతనితో చెప్పు. ఈగోవిందమ్మే, నీకు, సాకిచ్చి పెంచుకున్న తల్లి అని కూడా చెప్పు''

అన్యవధానంగా "యిలాంటి కొడుకులు నీ కెందరయి నాకే?'' అనడగబోయింది నారమ్మ; కాని తిమ్మన్నతో ఆలోచించకుండా తొందరపడ్డం మంచిది కాదని వస్తాయించింది, మొదట.

అయినా పుత్రోపం నిగ్రహించుకోలేక "నాకొడుకు ప్రాణాలు పుచ్చుకుంటూ నంటే? ఇంతా కష్టపెట్టి నాబతుకూడా నప్పులపాలు చేస్తావంటే?'' అంటూ నిలవతీసింది, చివరికి.

గోవిందమ్మ యిక అక్కడ వుండలేకపోయింది.

నారమ్మ అఘాయిత్యం చేసినా చెయ్యనక్కరలేదు, తనంతో గట్టిగా నాట్టాడితే చాలు తనంతట తను దగ్గం పాడుకావడానికి.

అంత రాత్రివేళ తానొక తార్పుడుకత్తె యింటో పుట్టి పురందాకీ వెళితే యిక వ్యభిచరిస్తే వొకటే మానికట్టుకుంటే వొకటీనా?

ఇలా అనుకుని, గోవిందమ్మ "నే నిక నుంచోలేను.

తిమ్మన్న నిన్ననొక పటం తెచ్చి నాయింటో దాచు కున్నాడు. ఒక్క క్షణ మయినా యిక నాయింటో వుండడానికి వల్లకావది. కాబట్టి, నీతిమ్మన్నకి తల్లి నని నన్ను కనికరించి, నువ్వు నాకు తల్లివయి, వెంటనే వచ్చి ఆపటం తీసుకువెళ్లి అతని కందచెయ్యి" అంది.

ఒక విధంగా నారమ్మ కటికి గుండెలు కరిగాయి.

మరో విధంగా, మళ్లీ వొక్క టక్కు చేద్దామని ఆమెకి ఆలోచన పుట్టింది.

దీంతో కోపం సమాళించుకుని "వెర్రితల్లీ" అంటూ రెక్కపట్టుకోబోయిం దామె; గాని ఆమె కందకుండా తప్పించుకుని, ఆమెకాళ్లు ముట్టుకోకుండా పాదాభివందనం చేసి, మళ్లీ లేవడమూ యిటు తిరగడమూ తెలియకుండా దివ్వున వెళ్లిపోయింది గోవిందమ్మ.

అందుకు మళ్లీ నిర్విణ్ణ అయిపోయి, వొక్క క్షణానికి మళ్లీ ప్రకృతిలోపడి, సూచనలు లేకుండా అప్పటికప్పుడు దివాలాకోరయిపోయిన వర్తకుడు లాగ పక్కగా వున్న గది గుమ్మంకేసి వునూరుమంటూ చూసింది నారమ్మ.

## 40

పన్నీటితుంపారం కురుస్తున్నట్టు విరుస్తున్న వెన్నెలా, మంచిగంధం పూస్తున్నట్టు వీస్తున్న పిల్లగాలీ అనుభవిస్తూ

వీధిగుమ్మాన నుంచుని వుండి, అల్లంత దూరాన చూసీ చూడ్డంతోనే గుర్తుపట్టి వొక్క వుడాంవేసి "అత్తా" అని నడివీధిలోనే పొదువుకుంది గోవిందమ్మని చూడమ్మ.

అంతకంటేనూ సంబరపడుతూ తాను కూడా ఆమెని పొదువుకుని "యేమిా? ఇక్కడ నుంచున్నావేం తల్లీ?" అనడిగింది గోవిందమ్మ.

"మీాయింటికి రావాలని వుందత్తా! కాని నాయన యేమంటాడో అనీ, అమ్మ నడగలేకా —"

"నాబంగారుకొండే! నావరహాల మూటే!" అంటూ మాట కడ్డంవచ్చి, ముందు, ఆమె శిరస్సు ముద్దుపెట్టుకుంది గోవిందమ్మ.

"ఇటు నాయన యెడల ప్రణయం అంకురించి వుద్ధూతలూచేస్తోంది. అటు తెరలు తెరలుగా సిగ్గు ముంచుకు వచ్చి ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. ఇది మహాభాగ్యం కాని మరోటి కాదు. కనక, మన పిల్లే" అని దిటవు తెచ్చుకుని, తరవాత "పోనీ, నేనడుగుతానేం తల్లీ?" అంటూ ఆమె గడ్డం పుణికిం దామె.

"అడగవమ్మా, ఏం?" అంది చూడమ్మ, యెగిసిపడి.

దీంతో గోవిందమ్మ జారుముడి చేతికి చల్లగా తగలగా చకిత అయి, మళ్ళీ బాగా తాకి చూసి "ఇదేం? స్నానమాడావేం?" అనడిగిం దామె.

"ఇంటికి వచ్చాటప్పు డేదో తొక్కిన ట్టనిపించింది. ఎప్పుడూ యెరగను నేనిది. అంచేత, వచ్చి రావడం తోనే సచేలస్నానం – "

"అయితేం, సిల్కుచీర కదా, వొళ్ళ పక్కగా వుంచి – "

"ఎందుకూ? తెల్లవారా టప్పటికి చాకలి భద్రి రాదూ?"

"మరి జుట్టు ముడివేసుకున్నా వేం?"

"ఇంటికి వెళ్ళాక బాగా ఆరబెట్టుకుని సాంబ్రాణి పొగ – "

"నేను వేస్తా నేం?" అంది సూరమ్మ, వుబలాట పడుతూ.

"నాకూనా, నువ్వే వేస్తువుగాని" అంటూ సూరమ్మని మరో మాటు గుండెల కదుముకుని "అమ్మ యేమి చేస్తోంది?" అనడిగింది గోవిందమ్మ.

"ఇప్పుడే పాలుపిల్లకి దాలిమీద పడేసింది"

"నాయనో?"

"వెన్నెట్లో మంచం వేయించుకుని పెట్లో – "

"చెల్లాయో?"

"అమ్మకి సాయం చేస్తోంది"

"చెల్లి పద్యాలు నేర్చుకోకుండా, బడి కెళ్ళడం మానే

సింది కూడానూ కనక, నువ్వు మా యింటికి వచ్చేసినా అమ్మకి లోటుండదు, కదూ!"

కళ్ళల్లో కళ్లుపెట్టి, హృదయాంతరాళంలో దాచుకున్న వస్తువును లాగేస్తున్నట్టు చూస్తూ గోవిందమ్మ యిలా అడగ్గా సిగ్గుపడిపోయింది; గాని తా నొక్కమాటు వెళ్ళి వద్దా మని ముచ్చటపడుతున్నట్టు తేల్చగా, తీసుకు వెళ్ళి తన దగ్గిర అట్టేపెట్టుకోడానికే గోవిందమ్మ వచ్చివుండడం గ్రహించీ, అందుకు మూలమైన కారణం వూహించుకునీ మురిసిపోయింది చూడమ్మ.

తరవాత, బాహుబంధాల్లో దేహాలు లాగే, వుబలాటంలో మనస్సులున్నూ యేకీభవించగా నూతోన్నె త్సాహంతో యిద్దరూ చీడీ లెక్కారు.

వారు ద్వారంలో అడుగుపెట్టేటప్పటికి, అప్పుడే హాల్లో అడుగుపెడుతున్న నరసమ్మ "వదినా" అంది, పరకాయించి చూస్తూ.

"అవును, నేనే వదినా" అంది గోవిందమ్మ.

ఒక్క అంగలో యెదురువచ్చి "దయచెయ్యండి, దయచెయ్యండి" అంటూ చెయ్యివట్టుకుని, వసారా గుమ్మందాకా వెళ్ళాక "మీ చెల్లెమ్మ వచ్చారండీ" అంది నరసమ్మ, పెరట్లోకి చూస్తూ.

"మనమే వెడుతున్నాం గదా, అన్నయ్య నెందుకూ

శ్రమపెట్టడం!" అనడుగుతూ గోవిందమ్మ ముందు కడుగు వెయ్యడమూ "చెల్లెమ్మా" అని పిలుస్తూ వుబ్బెత్తుగా లేచి చెంచయ్య యెదురు రావడమూ యేకకాలంలో జరిగిపోయాయి.

చూడమ్మ తుంగచాప వరిచింది.

"మంచంమీద కూచో అన్నయ్యా" అని గోవిందమ్మ అంటూనే వుండగా చెంచయ్య కూడా చాప మీదే కూచున్నాడు.

గోవిందమ్మ చూడమ్మని తన దగ్గిర కూచోబెట్టుకుంది.

వీధి తలుపు వేసేసి వంటింటి యెదట ఆగి "గోవిందమ్మత్తయ్య వచ్చారు, కసిన్ని పాలచుక్కలు పట్టుకురా చిట్టీ" అని చిన్న కూతురి కాజ్ఞాపించి వచ్చి "యేం వదినా, యింత రాత్రయాక వచ్చారూ!" అనడుగుతూ మొగుడికి కొంచెం యెడంగా నగం చావమీద కూచుంది నరసమ్మ.

"అంతా చెబుతాను గానీ, యిప్పుడు పాలెందుకు వదినా!"

"కసిన్నే కాదూ!"

"ఇప్పుడిప్పుడే కాదుటమ్మా విందులు – "

"కనకనే"

"అంటే!"

"మీా అన్నయ్యా నడగండి"

ఇలా అని "యిక తరవాతి వంతు మీాదీ" అన్నట్టు నరసమ్మా "వదిన గారేమిటీ అంటుంది!" అన్నట్టు గోవిందమ్మా చెంచయ్యకేసి చూశారు.

చూడమ్మ కూడా చూసింది, వోరచూపులు.

చెల్లెలి సేవ వ్యవహారం యింత చక్కగా సాక్షిస్థం అయినా దాకు చెంచయ్య చాలా ఆనందించాడు; కాని తన ప్రశ్నలో స్పష్టీకరించాలసిన కారణం కంటే మనసులో కల్పించవలసిన నిష్ఠురోక్తి బలీయంగా వున్నట్టు గుర్తించి సాహసించలేకపోయాడు.

అయినా వూరుకోలేక "కాదా?" అనుకుంటూ వొక్కపాటు తల పంకించుకుని "మీా వదిన పట్టు యేమిటో, కనుక్కోనమ్మా" అన్నాడు తాపీగా.

"అలాగే పుచ్చుకుంటా నన్నయ్యా" అంది గోవిందమ్మ, చూడమ్మ మీాద చెయ్యివేసి.

చూడమ్మ శరీరం ఝల్లుమంది.

నరసమ్మ వులుకూ పులుకూ చూసింది భర్తకేసి; కాని గణపతిరాయుని మాట జ్ఞాపకం చేసుకుని మళ్ళీ తెల్లబడింది.

వెంటనే "చిట్టి కింకా పని తెమలదు, పంచదార వేసి పాలచుక్కలు నువ్వు పట్టుకురా చూడా" అందామె.

మాసింది గోవిందమ్మ.

"చెంగల్రావు బాగా మొగ్గుతున్నాడంట; కాని భూషయ్యకి కావాలి ను వ్వద్దురాకు అన్నాడంట బాబు. దానిమీద చెంగల్రావు తప్పుకున్నాడంట"

"నీవుద్దేశం?"

"పుచ్చుకోడమే నావుద్దేశం. ఏమంటావా? కాడిగట్టు కావడం అలా వుండగా, నల్భై శెంట్ల దిమ్మా, దిమ్మ మీద పెంకుటి సాలా—"

"పెంకుటిసాల" అని వినవడాటప్పటికి, తిమ్మన్న బత్తాయితోట కథ ఫిలిం రీలు లాగ కళ్ల యెదట జరుగు తున్నట్టు స్ఫురించగా వొళ్లు ఝల్లు మని ముచ్చెమటలూ పోశాయి గోవిందమ్మకి.

కాని యిదేమీ యెరగని చెంచయ్య "నాలుగంటు మామిడిచెట్లూ, మూడు నారింజచెట్లూ, రెండు పనస చెట్లూ, పద్ధెనిమిది కొబ్బరిచెట్లూ - ముమ్మరంగా కాస్తు న్నాయి కూడా" అని మాట పూర్తిచేశాడు.

"ఇంతవరకూ మనకి కొబ్బరిచెట్లు లేవు. నీకు నచ్చితే బజానా యిచ్చెయ్యి" అంది గోవిందమ్మ.

రెండు గ్లాసులతో పాళాలు చేస్తూ అప్పటికి చూడమ్మ పాలు తెచ్చింది.

"కసి న్నంటే కసిన్నే తెచ్చావేమే?" అంటూ

నరసమ్మ గ్లాసు లందుకోగా "కసి న్నంటే అన్నెందుకు తెచ్చావు చూడా?" అంటూ గోవిందమ్మ ఆగ్లాసు లందుకుంది.

"సరాగాల కేం గాని, చల్లారిపోగలవు, ముందు పాలు పుచ్చుకోవమ్మా" అన్నాడు చెంచయ్య.

వేళ్లు మార్చి మార్చి గళాసు పట్టుకుంటూనూ, వూదుకుంటూనూ పాలు పుచ్చేసుకుంది గోవిందమ్మ.

ఇదయాక "అన్నయ్యా" అని పిలిచిం దామె.

"వదినా" అనిన్నీ పిలిచింది.

పిలిచిందే గాని "పాలు ఇవ్వడం పిల్ల నిస్తా మని తాంబూలా లివ్వడమే, అడగనే అక్కర్లేదు" అనుకుం దామె.

ఇంతలో "ఏం, చెల్లెమ్మా" అన్నాడు చెంచయ్య.

"చెప్పండి వదినా" అంది నరసమ్మ కూడా.

అన్నారే కాని "చెప్పనే అక్కర్లేదూ. తేలేపోయింది" అనుకున్నారు దంపతు లిద్దరున్నూ.

అయితే, యీగుటకలు మింగడం పెద్దలకు కష్టంగానే వుంది; గాని చూడమ్మకి మాత్రం చేదుమాత్రలు మింగుతున్నట్టుంది.

"ఈవుత్తుత్తి మాటలతోనే అర్థరాత్రి అయిపోతే, యింకా యీవీధినుంచి ఆవీధికి వెళ్లాలి, సాంబ్రాణిపొగ వేసి

అత్తయ్య జుట్టు ఆర్పాలి, భూషయ్య కావకబుస్సు—"

ఇలా అనుర్దాపడుతూ అనుర్గావడుతూనే, ముచ్చట పడుతూ ముచ్చటపడుతూనే చివరికి సిగ్గుపడి పోయిందామె.

తాను కూడా చూడమ్మకి పెళ్లిమాపు కలిగించి అది భూషయ్య మీదకి మళ్లిద్దా మని ఆత్రపడుతోంది కనక, అప్పటికి సాహసించి "వొక్కత్తినీ వుండలేకుండా వున్నాను వదినా! అందుకోసం చూడమ్మని దగ్గిర పెట్టుకుంటా మని"—అంటూ మాట నాన్చేసింది గోవిందమ్మ, చెంచయ్యకేసి బెదురు బెదురుగా చూస్తూ.

కానీ; గులాబీ అత్తరు చిలికించినట్టు దీంతో వాతావరణం అంతా "గు—మ్—ము" మని పోయింది.

మనస్సు గుబగుబ లాడగా ఇటున్న మొగం అటు తిప్పేసుకుంది చూడమ్మ.

గోవిందమ్మ యింతకంటే స్పష్టంగా అడుగుతుం దని ఆశించింది సరసమ్మ. అయినా "యిదిమాత్రం తక్కువా?" అనుకుని "మా యింటో వుంటే వొకటీ, మీయింటో వుంటే వొకటీనా, అలాగే అట్టే పెట్టుకోండి వదినా" అంది "యింకా చూస్తారేం!" అన్నట్టు భర్తకేసి చురుగ్గా చూస్తూ.

దాంతో సోత్సాహి అయి చెంచయ్య "ఈమాత్రం

కూతురుచేత కండువా తెప్పించివేసుకుని "యిక్కడే కాదుటమ్మా, నాలు గడుగులు" అంటూ తాను కూడా బయులుదేరాడు చెంచయ్య.

అన్నా చెల్లెలూ వాళ్లో యిలా మాట్లాడుకుంటూ వుండగా, చూడమ్మని గదిలోకి తీసుకువెళ్లి కుంకుమ బొట్టుంచి, అయిదు సువర్ణ రేఖ పళ్ళు చేతిలో కూడా పెట్టి "కనుసన్నల్లో మెలిగి అత్తయ్య దయ సంపాదించుకోమ్మా" అని మంత్రోపదేశం చేసింది, నరసమ్మ, ముంగుర్లు సవరిస్తూ.

ఇదంతా భవిష్యత్తూహించుకుంటూనూ, సంబర పడుతూనే చేసింది; కాని అప్పటికప్పుడే హృదయం దేవేసినట్టయి, కళ్ళునూ్న చెమ్మగిల్లా యామెకి.

పదహారేళ్ళు వెళ్ళిన పిల్లని "అత్తయ్య" తో పంపడం తోలీమాటు కాపరానికి పంపుతున్నట్టే అనిపించిం దామెకి; గాని గొప్పవీరుడై భూషయ్య పేరుప్రతిష్ఠలు సంపాదించుకుంటూ వుండడమూ, స్థితిపరుడునూ్న అవుతూ వుండడమూ, — ఇక్కడ, గోవిందమ్మ, అంద చందాలూ ముద్దుముచ్చట్లూ తెలిసిన మనిషి కావడమూ, చూడమ్మమీద వల్లమాలిన మమకారం కనపరుస్తూ వుండడమూ గమనించి, మళ్లీ అంతలో స్తిమితపడిందామె.

తరవాత మరో అయిదు పళ్ళు తెచ్చి గోవిందమ్మ

చేతిలో కూడా పెట్టి, చిన్నకూతుర్ని చెక్కుం తెమ్మని యిద్దరి చేతుల్లోనూ వున్న పళ్లు పుచ్చుకుని అందుంచి భర్త చేతి కందించింది.

చెంచయ్య అడుగు వేశాడు.

"చిట్టిని తీసుకుని నువ్వూ అన్నయ్యా పొద్దున్న అక్కడికే కాఫీకి రండి వదినా" అంటూ తరవాత అడుగు వేసింది గోవిందమ్మ.

"ఎలా దిద్దుకుంటారో, మాయా మర్మమూ యెరగనిపిల్ల" అని చెబుతూ నరసమ్మ ఆమె ననుసరించింది.

ఈసందుబాట్లో, చూడమ్మని వంటింటి గుమ్మం దగ్గిరికి లాక్కు వెళ్లి "ఎక్కడికే!" అనడిగింది చిట్టి.

"గోవిందమ్మత్తయ్యగారింటికే"

"నడే!......అదీ చెప్పాలి కామోను......ఎందుక నడుగుతున్నాను"

"అత్తయ్యకి సాయం" అంది చూడమ్మ; కాని "దొంగా, అబద్ధాలాడుతున్నావ్! భూషయ్యకి మరో పిల్లని చూడకుండా వుండేటట్టు అత్తయ్యని మంచిమాట ఆడుకోడాని క్కాదూ!" అని యెవరో ముదలకించిన ట్టయి ముడిసిపోయింది.

ఆముడిపెం మొగాన మెరిసింది.

అది చూసి ఫలానా అని యేర్పరించుకోలేకా,

వూరుకోలేకా "సాయం యెందుకే!" అనడిగింది చిట్టి.

"ఒక్క ర్తీ వుండలేకుండా వుందంట"

"సింగినాదం కాదూ!"

చూడమ్మ మాట్లాడలేదు.

"ఇన్నాళ్ళనుంచీ యెలా వుండగలిగిందమ్మా!"

"ఏమో, నన్నడుగుతా వేమమ్మా!"

ఒక్క మాటు చురమర చూసి "అయితే, తెల్లవార గానే వస్తావా మరీ!" అనడిగింది చిట్టి.

"రా" నన్నట్టు తల అడ్డంగా వూపింది చూడమ్మ.

"పోనీ, భోజనా లయాకేనా – "

మళ్ళీ అలాగే తల వూపింది చూడమ్మ.

ఇంతలో చూడమ్మని తల్లి పిలిచింది.

"బాబోయ్" అంటూ తుర్రు మంది చూడమ్మ.

తెల్లపోయీ, చిన్నపుచ్చుకునీ, చివరికి చిరాకుపడీ, ఘుమఘుమ లాడుతూనూ తల్లి దగ్గిరికి వెళ్ళింది చిట్టి.

తలుపు తీసే ముందు చెంచయ్యా, మన స్నేంత తొందర పెడుతున్నా విధిలేక మెల్లిగా అడుగులు వేసు కుంటూ తరవాత చూడమ్మా, చెయ్యీ చెయ్యీ పట్టు కుని విద్యుపురాలితనం అనుభవిస్తూ ఆమె వెనక వదినా మరదళ్ళూ, తల్లి పమిటికొంగు పట్టుకుని బిక్కు బిక్కు మంటూ అందరికీ వెనక చిట్టీ వరాసగా గడప దాటి,

మెల్లిగా చీడీలు దిగారు.

"ఇక నవ్వుండు వదినా" అంది గోవిందమ్మ; కాని నరసమ్మ వుండలేకపోయింది.

అది గుర్తించి నాలుగిళ్లు దాటాక గోవిందమ్మ నిలిచి పోయింది.

చేసేదిలేక అప్పుడు తానున్నూ నిలిచిపోయి "వదినా, మరి సెలవు. చూడమ్మ మీపిల్ల గాని మా పిల్ల కాదు సుమండీ" అని మాత్రం అని మరి మాట్లాడలేకపోయింది నరసమ్మ.

"నన్నింతగా చెప్పాలా వదినా! ఆమంచి బిడ్డలు నావి మాత్రం కావూ!" అని బెదురడిగింది గోవిందమ్మ, నరసమ్మ బుజంమీద చెయ్యి వేసి.

"అమ్మా,.............భద్రం" అంది నరసమ్మ, చూడమ్మకేసి చూస్తూ, గద్గదికతో.

"అమ్మ పిలుస్తోందే" అంది గోవిందమ్మ.

చూడమ్మ వచ్చి తల్లి దగ్గిర నుంచుంది, మొగం వంచుకుని.

అతికష్టంమీద మాట తెచ్చుకుని "అత్తయ్యని సేవించుకో" అంది నరసమ్మ.

"అలాగే" అంది చూడమ్మ.

పదడుగులు ముందున్న చెంచయ్య "ఇక నువ్వ

వెనక్కి పద" అన్నాడు భార్యతో.

నరసమ్మ కదల్లేకపోయింది.

బదులూ చెప్పలేకపోయింది.

కళ్ళనిండా చూడనే లేకపోయింది.

పండువెన్నెలతో నిండిపోయి ఆమె కళ్ళు తరంగితాలయిపోయాయి.

అది గుర్తించి "వెళ్ళుమరి. నువ్వున్నంతసేపూ మాకు అడుగు పడదు. భూషయ్యా వొకటే, చూడమ్మ వొకటే కాదు నాకు. చూస్తావుగా? రెండు వీధులేగా యెడం?" అంటూ రెక్క పట్టుకుని నరసమ్మని వెనక్కి మళ్ళించింది గోవిందమ్మ; కాని నిట్టూర్పు విడుస్తూ ముడుచుకు పోతున్న ట్టయిపోయింది నరసమ్మ.

చూస్తుండగా చెంచయ్యా, అత్తా కోడళ్ళూ సందు మళ్ళారు.

అప్పుడు కదిలింది నరసమ్మ, వునూరుమంటూ.

"అక్కయ్యా సెందుకే పంపుతున్నావూ?" అని చిన్న కూతు రెంత అడుగుతున్నా బదులుచెప్పలేక, పై పెచ్చు, దానివల్ల మరింత బెంబేలుపడిపోయి, కాళ్ళీడ్చుకుంటూ వెనక్కి వెళ్ళి, యిటే చూస్తూ చివరిచీడీమీద చతికిల బడి, అవశ అయి, కళ్ళు మూసుకుని అరుక్కి చేరబడి పోయిం దామె.

# 42

అక్కడ, చెంచయ్య, ఆకబురూ యీకబురూ చెబుతూ మెల్లిగానే నడిచాడు. పళ్ళచిక్కం వొాక చివర వుంచి కవాచీబల్లమీద యథాపూర్వంగానే కూచున్నాడు. ఒక్క నిమిషం సంసారవుగొడవలున్నా బాగానే మాట్లాడాడు; కాని "మరి వెడతా" నంటూ లేచి నుంచున్నాక మాత్రం నరసమ్మ లాగే యిదయిపోయాడు, వొక్క క్షణం.

చదువుకి చదువు, తెలివికి తెలివి, చాకచక్యానికి చాకచక్యం, భయభక్తులకు భయభక్తులు, సాయానికి సాయం — చూడమ్మ అందివచ్చిన కొడుకులా వుం దతనికి.

ఒక్క పొలంలో పని వచ్చినప్పుడే మొగసంతానం లేని లోటు కనపడుతుం దతనికి.

ఆ పను లయినా యింటో జరగవలసిన వన్నీ చూడమ్మ చేతిమీదుగా జరగవలసిందే.

ఆ యింటోకల్లా చూడమ్మ చేస్తే వచ్చే రుచి కాఫీకి మరెవరు చేసినా రాదు.

చూడమ్మ తయారుచేసి యివ్వనిదా డతనికి కాఫీ పుచ్చుకున్నట్టే వుండదు.

వయసు వచ్చాక చెంచయ్యకి భోజనం వడ్డించడం

చూడమ్మ పనే అయింది.

ఒకమాటు రాజమహేంద్రవరం వెళ్ళినప్పుడు "గాయ నకు పెరుగుతోడుపెట్టడాని క్కావా" లని యించక్కని పింగాణీకప్పులు కొంటను, వచ్చింది చూడమ్మ.

వాటిల్లో తోడుపెట్టిన పెరుగు వడ్డించడం తటస్థ డితే, ఎంత మీగడ వుంచి వడ్డించినా అది అతనికి కొన్న పెరుగులాగే వుంటుంది.

చూడమ్మ గజేంద్రమోక్షం పాడుతూ వుంటే వింటూ వింటూనే నిద్రపోతా డతను.

ఇలాగ, అనేకవిధాల, మనసు పెరిగిపోయిన పెద్దపిల్లని విడిచివుండడం అనేటప్పటికి అతనికీ గుండె తరుక్కుమంది.

అయితే, చూడమ్మ నిప్పుడు నాయింటికి పెట్టకుపోతే "నీ కొడుక్కి చేసుకో" మని గొణుక్కున్నారు మొగ మాటపెట్టడానికి వీలవుతుందా తరవాత?

బతికిబాగుండి యింటికి రావడమే వస్తే భూషయ్యశాస్త్రికి దొరుకుతాడా అప్పుడు?

కొండల్రావు చెప్పిన సంగతు లలా వుండగా, యిక్కడ, తనచేతిమీదుగానే సాగవుతున్న అయిదు యకరాల మాగాణీ, అంటుమామిడితోటా, గొడ్డూగోదే, నాగులమ్మ పంపూ, చక్కని యిల్లూ — తన స్థితి కలాంటి సంబంధం తేగలడా!

అల్లుడూ కొడుకూ కూడా తానే అయి, భూషయ్యే తనకి చేదోడూ వాదోడూ అయి వుండడూ?

అప్పు డెలా వుంటుందీ తన పనీ?

ఆ వొక్క క్షణంలోనూ యిదంతా మనసానికి రాగా, అప్పటికి ధైర్యం తెచ్చుకుని మెల్లిగా బయలుదేరాడు చెంచయ్య.

తండ్రి వాలకం చూసి చూడమ్మకూడా బొమ్మ అయి పోయింది.

ఆమె గుమ్మంలోనే నిలిచిపోయింది గాని గోవిందమ్మ నడివీధిలో కంటా వెళ్ళింది.

వీధిలో కూడా వొక్క క్షణం మౌనంగా వుండిపోయి, తరవాత "అయ్యవార్లంగారి యీనాం సంగతి రాయుడు బాబుతో చెప్పనే యింటికి నెడతా" నంటూ తూర్పుగా తిరిగాడు చెంచయ్య.

"ఊరు మాటుమణుగుతోంది గదా!"

"పన్నండయితేగాని రాయుడుబాబు నిద్రపోడుగా!"

"అయితే, బజానా మాట మరిచి పోకేం!"

"చెబుతా, చెబుతా"

"వాయిదా అక్కర్లేదు మనకి, రేపు కావాలంటే రేపే గుమ్మరించేద్దాం సొమ్ము, కాగితం రాయించెయ్య మను"

"నాకూ అలాగే తోచింది, మరి నువ్వింటోకి వెళ్ళు"

ఇలా అంటూనే చెంచయ్య బయలు దేరాడు.

"పదిన్నీ చిట్టినీ తీసుకుని పొద్దున్నే నువ్వోమాటు రావాలి, మరిచిపోయావు సుమా"

"అలాగే, అలాగే"

"రాయుడు బాబునీ, కొండ్రాపుతమ్ముణ్ణీ కాఫీ కిక్కడికే రమ్మన్నాను, జ్ఞాపకం చెయ్యేం!"

"ఆ"

చెంచయ్య వెళ్ళిపోయాడు.

"దీంతో పదిన్నర యకరా లవుతుం" దంటూ గోపిందమ్మ లోపల అడుగుపెట్టగా, భూషయ్య వ్రతం మనస్సులో వుంచుకుని "ఇక యకరం నరేగా లోటు!" అంటూ తలుపు గడియ వేసింది చూడమ్మ.

గడియారం టింగున గంటకొట్టింది.

ఉలిక్కిపడి చూసి "గంట కూడా పదిన్నరే అయిందేవ్" అంది గోపిందమ్మ.

"అయితే, దానికీ వొకటిన్నరే లోటు" అంది చూడమ్మ.

ఇద్దరూ నవ్వుకున్నారు.

అంతలో మళ్ళీ గాంభీర్యం వహించి "నెలకి యకరం భూమిరాబడి వాడుకోవా లని అంచనా వేసుకున్నాడు నాయన, ఇంకేం లోటూ!" అనడిగింది గోపిందమ్మ.

తల అయిమూలగా వంకించుకుంటూ.

"ఏమీ వాడుకోకా? చెమట వోడ్చి – "

"కాదు కాదు, రక్తం ధారపోసి – "

"అవు నవును, ప్రాణాలకు తెగించి సంపాదించుకున్నది అనుభవించకపోతే యింకెందుకూ!"

"నాకు వచ్చే పెన్షనూ, నాయనకు వచ్చే జీతమూ–"

"కొల్లలు కొల్లలు. ఇంత వూరుంది గాని – వొక్క బద్దిరెడ్డీ – వొక్క కొమ్మారెడ్డీ – వొక్క బైరెడ్డి – యీా మూడు కుటుంబాలవారేగా వున్నంతను లక్షణంగా అనుభవిస్తున్నారూ! ఇప్పుడింకో కుటుంబం – "

"మన కుటుంబం – "

"అప్పుడు నేను జ్ఞాపకం వుంటానా అత్తా!" అంటూ అవ్యవధానంగా అడిగింది చూడమ్మ, కళ్లు తిప్పుకుంటూ.

ఇది విని చకిత అయింది గోవిందమ్మ.

తనకంటే యెంతో చిన్నపిల్ల, తన యెత్తుకి పై యెత్తు వెయ్యడం ఆశ్చర్యం కలిగించింది; గాని ఆ సద్యస్ఫూర్తి గుర్తించి "నాయనకు తగిన పిల్ల" అని సంబరపడింది.

అయినా "నువ్వే అనేశావూ ముందు! ఏమి నంగనాచివే మామ్మా" అంటూ బుగ్గలు చిదిమి చేతిలో పెట్టింది, వెంటనే.

చూడమ్మ సిగ్గు పడింది, లోపలమాత్రం కులుకుతూ.

దానిమీద యింకేమి రాకడ వస్తుందో అని వొక్క-క్షణం నిదానించి "మోతాదు తప్పనివ్వదు చిట్టితల్లి" అని మెచ్చుకుని, ఏమీ యెరిగివుండనట్టు "నూతికి వెళ్లి కాళ్ళూ చేతులూ కడుక్కువద్దాం రావే తల్లీ" అంటూ బయలుదేరింది గోవిందమ్మ.

"పద" అంటూ తలుపు తీసి "యెంత బాగుందో వెన్నెల" అని సంబరపడతూ అడుగు పెరట్లో పెట్టి, ఇంతలో "ఓయ్ఓయ్" అంటూ లేగదూడ మీదికి రాగా చూడమ్మ కొంచెం బెదిరింది.

అది చూసి "అడుగు పెట్టావో లేదో, అప్పుడే తల్లిని విడిచిపెట్టేసి వుగకలు వేసుకుంటూ వచ్చి నీకాళ్ళ దగ్గిర వాలింది, నిన్నంతలో పసిగట్టేసిందో చూశావా! నా కొడుకుని చూసినట్టు చూసుకుంటున్నాను దీన్ని, ఇక ధ్యానం అంతా నీదే సుమా" అంటూ వెనక వెనకనే వచ్చి, గోవిందమ్మ, రాసుకుంటూ — కరిచివట్టి పమిటికొంగు లాగుతూ — బోడికొలతో కుమ్ముతూ, చేతి కందకుండా చూడమ్మ చుట్టూ గంతులు వేస్తున్న దూడని వొడుపేసి పట్టుకుంది.

"ఆ, విడిచిపెట్టుకో, విడిచిపెట్టుకు" అంటూ దాని మెడ పట్టుకున్నా-[illegible] "కళ్ళే కన్ను తగిలేసి వుంటుంది దీన్ని" అంది చూడమ్మ.

ఉలిక్కిపడిపోయింది గోవిందమ్మ, యీ రెండు దినాల కథా నెమరుకి వచ్చి.

"వెర్రిపిల్ల వనుకున్నాను, నసాళం అంటబొడిచావు గదే వగలాడీ!" అనిన్నీ అనుకుంది.

ఇంతలో "ఇది నన్నిలా అల్లరిపెడుతోందో చూడూ" అంది చూడమ్మ, కళ్ళు తివ్వుకుంటూ.

"సయ్యాట లాడ్డం గాని అల్లరిపెట్టడమా యేమిటమ్మా అదీ!" అని యెదు రడిగింది గోవిందమ్మ, అంత కంటేనూ కళ్లు తివ్వుకుంటూ.

దానిమీద "అవునా? నాతో సయ్యాటలా నీకు! రెణ్నెల్లయింది నీతో ఆడుకునీ, నన్ను మరిచిపోలేదూ నువ్వు!" అంటూ బుంగమూతి పెట్టుకుని దాని మొగం మీద మొగంపెట్టి గునిసింది చూడమ్మ.

"రెణ్నెల్లయితే మాత్రం, మననూ మననూ కలిశాక—రెండేళ్ళయింది భూషయ్య బావ వెళ్ళీ, మొన్నటి అమాసకి. అయితే మాత్రం మరిచిపోతాడా నా తండ్రీ! మరిచి పోగలడా!"

చూడమ్మ కళ్లు మెరిశాయి.

యుద్ధానికి వెడుతూ భూషయ్య తనని వాడిసి పట్టుకోడమూ, చెయ్యి గిల్లడమూ, మొగమ్మీద మొగం పెట్టి "మరదలా, మరిచిపోకేం!" అనడమూ, కన్ను

గేటి తన సెలవు పుచ్చుకోడమూ జ్ఞాపకం వచ్చి ఆమెకి వొళ్లు గరిపొడిచింది.

అప్పుడే తాను నిలువునా కరిగిపోయి వుండింది కనక ఆమైకం జ్ఞాపకం చేసుకుని "నారాజా! ఇప్పుడయితేనా?" అనుకుంది.

దీంతో, యెంతో ముచ్చటయింది.

ఎన్నో విలాసాలు తోచాయి.

ఆస్మృతి యిలా భావన అయేటప్పటికి, అరమూతలు పడ్డ కళ్లకి, తాను భూషయ్యే మెడే పెనవేసుకుని వుండినట్టనిపించిం దామెకి.

స్పర్శసుఖమున్నూ అనుభవానికి వచ్చినట్టయింది.

వెంటనే పరిసరా లన్నీ మరిచి, పావురంలా గుబాళిస్తూ—అప్రయత్నంగా—పూర్వ్వశ్వాసతో — భూషయ్యే అనే భావనతో లేగని ముద్దుకూడా పెట్టుకుం దామె.

అదంతా చూసి మొదట చమత్కృతి అయి, తర వాత ఉత్సుక అయి, దాంతో ఉద్రిక్త అయిపోయి, కాని వెలవరించుకునీ, ఏవగించుకునీ, మథనపడిపోయీ అతికష్టం మీద దృష్టి మార్చుకునీ ప్రేమభరాలస అయి, వెంటనే వత్సల అయి చూడమ్మ నొక చేతా, దూడ నొక చేతా పొదువుకుని "నారాజు, నారాజు" అంటూ చూడమ్మ శిరస్సు ఆఘ్రాణించింది గోవిందమ్మ.

# 43

గోవిందమ్మా చూడమ్మా నడుములు వాల్చా టప్పటికి ఖరాగా పన్నెండు గంట లయింది.

వసారాకీ రాచవుసిరిచెట్టుకీ మధ్యగా వున్న తెర పిలో వేసుకున్నారు వారు పక్కలు.

గట్లారుసుకుంటూనూ కెరటాలు వేసుకుంటూనూ వెండినది ప్రవహిస్తున్నట్టుంది పండు వెన్నెల.

కెరటాలమీది నురగల్లా వున్నాయా పక్కలు.

తెల్లని టిన్యూకాగితాల్లో వుంచిన బంగరు సలాకల్లా వున్నారు వా రా పక్కలమీద.

చూడమ్మ బేసరి, వుష్యమీ నక్షత్రం లాగ మిలమిల్లాడుతోంది.

గోవిందమ్మ గాజులు, ఇంజను ముందు చీలిపోతున్న రెయిలు పట్టా ల్లా జిలజి ల్లాడుతున్నాయి.

తెరలు తెరలుగా చల్లని గాలి వీస్తూనే వుండినా గాజుకుప్పెల్లా వేడెక్కిపోయి వున్నాయి వారి శిరస్సులు.

"నిద్ర పట్టడం లేదు" అంది గోవిందమ్మ, తల దోర్చుకుంటూ-

"పాడికళ్లు పడిపోయాయి" అంది చూడమ్మ, వొళ్లు విరుచుకుంటూ.

"ఏమిటీ చెయ్యడం?" అని గోవిందమ్మ ఉపాయం అడిగింది.

"కళ్లు మూసుకుంటే?" అని సలహా చేసింది చూడమ్మ.

ఇద్దరూ వొక్కమాటే ఆపని చేశారు; గాని, పొటమరించి వుండిన మొగ్గలాగ వెంటనే, యిద్దరి కళ్లూ మళ్లీ వొక్కమాటే విడ్డాయి.

దీనికి సాయం, యెదురొమ్ముమీది కుంపటి లాగ, నభోమధ్యగతు డయి వుండిన పూర్ణచంద్రుడు వారి స్నిగ్ధ హృదయాలమీద నిప్పులు కక్కాడు.

వెంటనే ఆరెండు హృదయాల్లోనూ మంటలు రేగాయి.

ఒకరి హృదయం వొకరికి విప్పిచెప్పుకుంటే యీబాధ వుండకపోవునని యిద్దరికీ తెలుసు; కాని వొక్కరికీ సాహసంలేదు.

"గోవిందమ్మత్త యే మనుకుంటుందో?" అని చూడమ్మకి సందేహమూ "చూడమ్మ యే మనేస్తుందో?" అని గోవిందమ్మ కాందోళనానూ.

చెంచయ్య వెళ్లింది మొదలు గోవిందమ్మ, యిప్పటికి పదిమాట్లయినా ఆమాట నాలుకచివరికి తెచ్చుకుంది; గాని జంకిపోయి వూరుకుంటూ వచ్చింది.

"యాదాలాభంగా అయినా గోవిందమ్మత్త నోట ఆమాట రాగూడదూ?" అని చూడమ్మ యిరవై

మాట్లయినా ఆశించింది; గాని యెప్పటి కప్పుడే ఆశా భంగం పొందుతూ వచ్చింది.

ఇలాగ వొక్క గడియ గడిచింది.

అయోమయస్థితి అంటే యేమిటో అప్పుడే మొదటి మాటు అనుభవానికి వచ్చింది చూడమ్మకి.

వినుగంటే యేమిటో అప్పుడే పూర్తిగా గుర్తుకు వచ్చింది గోవిందమ్మకి.

దాంతో "పోనీ, మనమే సాహసించేద్దాం" అన్న స్థితికి వచ్చింది చూడమ్మ.

"ఏమయినా సరే" అన్న నిశ్చయానికి వచ్చేసింది గోవిందమ్మ కూడా.

వెంటనే, వొక్కమాటుగానే యిద్దరూ వొకరికేసి వొకరు చూసుకున్నారు; గాని తీరా, ఆభిముఖ్యం యేర్పడేటప్పటికి యిద్దరికీ ధైర్యం చప్పబడిపోయి వూరుకుంది.

"లోకువయిపోమూ?" అని జంకిపోయింది గోవిందమ్మ.

"చులకన అయిపోమూ?" అని భయపడిపోయింది చూడమ్మ.

అయినా ఆవేగం నిగ్రహించుకోలేక "పోనీ, యిలా అని చూతాం" అని ధోరణి మార్చుకుని "ఆకల్లాడుతూనే వుండినా యిప్పుడే యిలావుంది, జ్యేష్ఠమాసంలో యేమయిపోతామో?" అంది మెల్లిగా గోవిందమ్మ,

చెవు లోరజేసుకుని.

"ఇలా వచ్చావా! ఊహూ?" అనుకుని "మరి జ్యేష్ఠ మానం దాకా మాట?" అంది చూడమ్మ, నిలవతీసి నట్టు చూస్తూ.

ఉలిక్కి పడిపోయింది గోవిందమ్మ.

"నిజమే, ఈరాత్రి గడవడం అంటూ వస్తే, తరవాత జ్యేష్ఠమే కాదు, ఆషాఢమూ వెళ్లిపోతుంది" అని గుర్తించుకుం దామె.

దీంతో, తన తపన వేరూ, చూడమ్మ మథన వేరూ అనిన్నీ గ్రహించుకుం దామె.

"ఆజ్యాల పుట్టకే పోవాలి గాని పుట్టాక – నిన్న రాత్రి నీపని యేమయిం దమ్మా?" అని యెవరో ముదల కించిన ట్టయిం దామెకి.

ఏమయిం దేమిటి, ఏమయినా అయింది.

అదంతా తలుచుకునే టప్పటికి తిమ్మన్న జ్ఞాపకం వచ్చాడు.

అప్పుడే స్నానం చేసి, క్రాపింగు చక్కగా దువ్వుకుని, బట్టలనిండా సెంట్లు పులుముకుని, నిమ్మకాయలు నిలిచేటట్టు మీసాలు మెలిపెట్టుకుని, ముసిముసినవ్వులు నవ్వుతూనూ తెల్లింపుచూపులు చూస్తూనూ వచ్చి, తిమ్మన్న, యెదట నుంచున్నట్టునూ అయిం దామెకి.

దద్దిరిల్లిపోయింది.

అలా పడుకునివుంటే తిమ్మన్న తనమీద చెయ్యే వేస్తా డని వొణికిన్నీ పోయింది.

వెంటనే గభీ మని లేచి వెళ్ళి చూడమ్మ పక్కలో కూచుంది.

అది చూసి చూడమ్మా లేచి కూచుంది.

"చూడా!"

"ఆ"

"ఇంకా నిద్ర రాలేదూ తల్లీ!"

"లేదమ్మా"

మాట్టాడకుండా చూడమ్మనిపొదువుకుందిగోవిందమ్మ.

"అదేం, వొణికిపోతున్నా వేమమ్మా!" అనడిగింది చూడమ్మ, కంగారుగా తానున్నా ఆమెని పొదువు కుంటూ.

"తల తిరుగుతోందే"

"ఏం!"

"పిండివంటలతో భోజనం చేశాం కాదూ! ఇందాకా మీయింటో పాలు పుచ్చుకోకుండా వుండవలసింది"

"కసిన్నే కాదూ!"

"అయితేం!"

"పంచదార కలిపే తెచ్చానమ్మా"

"చాలింది కాదేమో?"

"మరిప్పుడు — "

"ఏమీ అక్కర్లేదు, కళ్లుమూసుకు పడుకుంటే అదే పోతుంది కాస్సేపటికి"

చూడమ్మ చోటివ్వగా గోవిందమ్మ ఆమంచంమీదే పడుకుంది.

గోవిందమ్మ మొగాన నీళ్లు చిలకరించి, కొంత సేపు తడిచేత్తో నిమిరి, పమిటికొంగు తడుపుకుని కొంచెంసేపు దాంతో కూడా వొత్తి "ఏం, యిప్పు డెలా వుంది?" అనడిగింది చూడమ్మ, మొగంమీద మొగంపెట్టి.

గోవిందమ్మకి ఆబెంగురు పోవడమే కాదు, ఈచికిత్సకు నవ్వు కూడా వచ్చింది; కాని బిగపట్టుకుంది.

"తగ్గింది యిక పడుకోవమ్మా"

"మళ్ళీ మొగం తిరిగితే చేప్పేం?"

"ఇక భయం లేదు. నామీద చెయ్యి వేసుకుని పడుకో తల్లీ"

అనుకున్నట్టే, చూడమ్మ చెయ్యి తామరతూడులా కాక, వేడినీళ్లు నింపిన రబ్బరుగొట్టంలా ఉండడం చూసి "ఎంత నలిగిపోతున్నావే నూకల్లీ!" అంటూ జాలి పడింది గోవిందమ్మ.

చూడమ్మ చేతివేళ్ళలో తన వేళ్లు గుచ్చుకుని కళ్ళున్నా మూసుకుం దామె.



## 44

వెలుగు రాకుండానే చూడమ్మకి తలంటిపోసి, పొద్దు పొడవకుండానే చెరువుకి వెళ్ళి కంఠస్నానం చేసి చక్కా వచ్చింది గోవిందమ్మ.

పాలికాపు కుర్రాడి కాపనీ యీపనీ పురమాయిస్తూ గదులూ వాకలీ స్వయంగా తుడిచేసి, చూడమ్మ, నీళ్ళు కాచి కాఫీ ఫిల్టరులో పోశాటప్పటికి, తాను పాలు పితికి, కాఫీకోసం గిన్నెతో కొన్ని కుంపటిమీదా, తక్కినవి కుండతో దాలిమీదా పడేసి బట్టలుపెట్టె తెరిచిందామె.

చూడమ్మ యీలోపునే తెగబారెడు జుట్టూ చిక్కు తీసుకోడమూ, సొంతనగలు కసిన్ని ధరించుకోడమూ అయిపోయింది.

తరవాత, సరికొత్త మడతలు తీసి, సన్నంగా పసుపు బొట్టుంచి, లేతాకు పచ్చగళ్ళ పట్టుచీరా అందుకు తగ్గ రవికా చూడమ్మ కిచ్చి, నీలంపట్టుచీరా అందుకు తగ్గ రవికా తాను ధరించింది గోవిందమ్మ.

"మా అమ్మ పంపిస్తుంది యివెందుకూ, వద్దమ్మా" అంటూ చూడమ్మ కొంచెం బెట్టుసరి చేసింది; గాని,

గోవిందమ్మ, అంతటితో చాలించక తన మువ్వల వడ్డాణమూ, కట్టుకాసుల పేరూ, పలకసర్లూ కూడా యిచ్చి ధరించే దాకా బలవంత పెట్టింది.

వాటితో పాటు సన్నంగా కాటుకా, కొనగోట గీరగీరి తళుకు కుంకమబొట్టూ స్వయంగా వుంచుకుని, పొంగివస్తున్న ఆనందం అణుచుకుంటూ అద్దం యెదట నుంచుని అలకలు సవరించుకుని "ఇంకేమిటీ తరవాయి?" అనడిగింది. చూడమ్మ, యేమీ యెరగనట్టు.

"చెప్పుకో" మంది గోవిందమ్మ, యెడమబుగ్గ యిట్టే పొడిచి బెల్లించి చూస్తూ.

"బుగ్గని చుక్క" అనుకుంది చూడమ్మ. పైకిమాత్రం "నలుగురూ నవ్వడం" అంది.

"సిగ్గూ భిడియమూ లేకపోతే సరి, యెందుకూ నవ్వడం? ఎవళ్ళ సొమ్మయినా కొల్లగొట్టుకువచ్చామా మనమూ?" అనడిగింది గోవిందమ్మ, చురుగ్గాచూస్తూనూ తల పంకించుకుంటూనూ.

"వీధిలోకి వెళ్లి నలుగురి కంటా — "

"పాలకీ యెక్కి నాలుగువీధులూ వూరేగుతావు, నీకేం తక్కువా? కాకపోయినా, నాఅన్న కూతుర్ని నే నేంచేసినా చేసుకుంటాను ఎవళ్లే నన్ను నగలిగేవాళ్లూ?"

గోవిందమ్మ యిలా అడగ్గా "అనగలిగితే మాత్రం,

భూషయ్యబావ వూరుకుంటాడా!" అనుకుంది చూడమ్మ.

కాని వుత్తరక్షణంలో, దానా దీనా, ఆకాశం అంతా గప్పుమని మెరుపు వెలుగు పాకిపోయి ఆవెంటనే కటిక చీకటి అలుముకు పోయేటట్టు, ఆమె కళ్లనిండా ఆనందం వెల్లివిరిసి ఆవెంటనే సిగ్గుదొంతర్లు కమ్మేశాయి.

ఆస్థితిలో గోవిందమ్మకేసి చూడలేకపోయిం దామె.

అది గ్రహించి గోవిందమ్మ ధోరణి మార్చేద్దా మను కుంటూ వుండగా "అమ్మగారూ" అంటూ పెరట్లోనుంచీ "అమ్మా" అంటూ వీధిలోనుంచీ పిలుపులు వచ్చాయి.

ఈ మెకసక్కాలూ, యీ నిభృతానందాలూ, యీ సిగ్గుదొంతిర్లూ యెగిరిపోయాయి, దాంతో.

"వీధిలో రాముడు తాతయ్య" అంది చూడమ్మ.

"అవును, పాలికాపు కూడా యెందుకో పిలుస్తున్నాడు, నువ్వది చూసిరా తాతయ్య సంగతి నేను చూస్తాను" అంది గోవిందమ్మ.

ఇద్దరూ చెరో వేపుకీ బయలుదేరారు.

చూడమ్మ వసారా గుమ్మం దాటాటప్పటికే "పాలి కాపు, నేను వచ్చానని చెప్పడం ఆపిలుపు" అంటూ యెదురువచ్చి ఆవేషమూ, ఆసాగనూ చూచి విభ్రాంతురా లయిపోయింది నరసమ్మ.

"వద్దు వద్దంటూ వుంటే అత్తయ్య బలవంతం చేసింది"

"నే ననుకుంటూనే వున్నాను. నాతల్లీ, ను వ్వదృష్ట వంతురాలి వయితే —"

ఇలా అంటూ తల్లి పొదువుకోగా చూడమ్మ పరవశ అయిపోయింది.

"అత్తయ్య యేం చేస్తున్నారూ ?"

"తాతయ్య —"

"అవును, చూశాను. మీ నాయన కూడా వచ్చారు; కాని మున్సబుగారు —"

"మున్సబుగారా ?" అని చకిత అయింది చూడమ్మ.

"అందుకే నేను బెంగటిల్లిపోతున్నాను. ఏమి తలుచుకుని వచ్చారో మరి, తాతయ్యని వెంటబెట్టుకుని ?"

"కలిసే వచ్చారా ?"

"అవును"

చూడమ్మ వులుకూ వులుకూ చూసింది.

మున్సబు కూతురు పద్ధెనిమి దేళ్ల పిల్ల. ఆరోతరగతి చదివింది; గాని చామనచాయకిన్నీ తక్కువే. పైగా, దళసరి అద్దాల కళ్లజోడు పెట్టుకుంటుంది.

ఆమె పెళ్లికూతురు వేషంలో కనవడ్డట్టనిపించింది, చూడమ్మకి.

చూసి చూసి "పదే, యింట్లోకి పద" అంటూ బయలుదేరింది నరసమ్మ.

కేసి దీనంగా చూసింది, తరవాత.

చూడమ్మకీ ఆందోళనగానే వుంది; గాని ఆమె చూపు గోవిందమ్మమీాద వుంది.

ఇలాగ తనకేసి చూసేవారే లేక వొంటరితనం తట స్థించగా మరీ తహతహలాడిపోయింది నరసమ్మ.

"నిన్న రాత్రి లౌక్యాలకు పోయారు గాని నే నన్ని విధాల సూచించినా స్పష్టంగా చెప్పగలిగారా?" అని చెంచయ్యమీాద అసంతృప్తిన్నీ పొందిం దామె.

ఇక్కడ యిది యిలా జరుగుతూ వుండగా, అక్కడ "కవిత్వం కడుతున్నావు బాబూ" అన్నాడు మున్సబు.

"ఇక యీా చెవులతో స్పష్టంగా వినాలి కామోసు. ఆ మాట" అనుకుని నరసమ్మ మరీ యిదయిపోయింది.

"నిజమే, యెందు క్కాదనాలీ? నువ్వు తెచ్చిన శుభ వార్త నా కలాంటి వుత్సాహం కలిగించింది మరి"

"శివశివా!" అనుకుంది నరసమ్మ.

ఈ విషయమై గణపతిరాయ డింత వుత్సాహపడుతూ వుండడం చూసి "యింకెక్కడి ఆశ?" అనుకుంటూ నిలు వునా కుంగిన్నీపోయిందామె.

"ఎంత చప్పని మాట అయినా చిలవలూ పలవలూ పెంచి రసవంతంగా చెప్పగలవు నువ్వు; కాని అవతల చాలా పనుంది నాకు, కనక,—"

"ఇక వ్యాఖ్యానం చేసి నిన్ను పంపేస్తా" అని

"అమ్మో" అని పిలిచాడు గణపతిరాయుడు.

చూడమ్మ శరీరం ఝల్లుమంది.

చెవులు గల్లు పడ్డట్టయింది నరసమ్మకి.

గోవిందమ్మ "వింటున్నా" నంది అలాగే నిశ్చలంగా.

"తమ్ముడు చెప్పాడు కాదూ, భూషయ్య వాళ్ల పెళ్లి కూతుర్ని రక్షించా డనీ?"

"అయితే?" అనుకున్నారు నరసమ్మా చూడమ్మా వాళ్లొళ్లకరు చూసుకుంటూ, అప్రయత్నంగా.

"అవు" నంది గోవిందమ్మ.

"అందుకు సంతోషించి అపిల్లతండ్రి, భూషయ్యకి రెండువేల రూపాయలూ, పెళ్ళికాలంలో భార్యకి వుంచ డానికి రవ్వలవుంగరమూ బహుమతీచేశాడు, అవి అధి కార్ల ద్వారా నీకు వచ్చాయి"

అది విని గోవిందమ్మ నిలువునా పొంగిపోయింది; కాని అదంతా వెంటనే నిగ్రహించుకుని, పైగా ఆత్రం కనపరుస్తూ "మరి తమ్ముడికో బాబూ!" అనడిగింది.

ఈలోపునే "విన్నావా!" అన్నట్టు చెంచయ్య తన కేసి చూడగా, నరసమ్మ మొదట యెగిసిపడింది; గాని "కనక, మున్సబుగారు భూషయ్యని అసలే విడిచిపెట్ట" రనుకుంటూ తపించేపోయింది.

చూడమ్మ మాత్రం తన అనామిక చూసుకుంది, ఆనందావకుంఠితా లయిన వాలుజూపులతో.

అప్పటికి "తమ్ముడికీ పంపాదు వెయ్యి రూపాయ" అన్నాడు గణపతిరాయుడు.

"వెయ్యా?"

"అవును"

"అదేం. యిద్దరికీ భేదం — "

"ధర్మంగానే వుందన్నాడు కొండల్రావు"

"ఏమో, నామట్టుకి బాగా లేదు బాబూ"

"తమ్ముడంటే అభిమానం కనక నీ కలా అనిపిస్తోంది సరే కాని — త్వరగా భోజనం కానియ్యి, మనం తహసీలుదారుగారి దగ్గిరికి రాజమహేంద్రవరం వెళ్ళాలి. వారు దయచేస్తారా బహుమతులు, ఈ మాట చెప్పడానికే వచ్చాడు మున్సబు"

"నిమిషంలో వంట చేసేస్తా, నక్కడికి రండి వదినా" అంది నరసమ్మ—మనస్సులో "అమ్మయ్యా" అనుకుంటూ.

"మనమూ వెడితే?" అనుకుంది చూడమ్మ.

"చెబుతా" నన్నట్టు నరసమ్మకి సన్న చేసి "నౌకరు చేత కబురుచేయిస్తే చాలదూ,. మున్సబన్నయ్య స్వయంగా దయచెయ్యాలా బాబూ ఈమాత్రానికీ?" అనడిగింది గోవిందమ్మ, వినయం కనపరుస్తూ.

"నా ఆనందంకొద్దీ నేను వచ్చాను, చెల్లెమ్మా, నౌకరుచేత పంపతగ్గదా యీ వర్తమానం? చిన్నతన మయినా, పెద్దవాళ్ళకూడా సాధ్యం కాని బలపరాక్ర

మాలు చూపిస్తున్నాడు భూషయ్య. ఏమి చేసి మే మతన్ని సరిగా గౌరవించగలమూ!"

"తగుదు నమ్మా అంటూ వెళ్ళి అక్కడ సెబా సనిపించుకోకపోతే, మళ్ళీ వచ్చి మీ అందరి యెదటా తల యెత్తుకు తిరగ్గలడా అన్నయ్యా, నాబిడ్డ!"

"ఏమయితే యేం? అల్లుడి సంగతి విని వూరంతా మెచ్చుకుంటోంది. కులం అంతా గర్విస్తోంది"

"ఇలాంటి మాటలు విని నలుగురిలోనూ తిరగడానికి పెట్టిపుట్టా ననుకుంది గోవిందమ్మ.

"చెల్లెమ్మా. నేనూ వస్తున్నాను, పదయాటప్పటికి బయలుదేరండి. మరి వెడుతున్నాను, చాలా పనుంది"

"కాస్త కాఫీ పుచ్చుకుని —"

"ఇంకా పూజకాలేదు చెల్లీ, స్నానమూతరవాయే"

"తోడబుట్టినదానిమీద దయవచ్చి యిన్నాళ్ళకి దయచేసి, వూరికే వెడతారా అన్నయ్యా?"

"అల్లుణ్ణి రానియ్యి, కాఫీకే యేం, భోజనానికేవస్తాను"

"మరిచిపోకండి అన్నయ్యా"

రాయుడూ చెంచయ్యా మున్సబుని సాగనంపివచ్చారు.

## 45

"ఇవాళ గొప్ప సుదిన మమ్మా భూషయ్య కూడా —"

"సుదినమే; కాని నీకు తక్కువచెయ్యడం యేమీ బాగుంది తమ్ముడూ!"

ఇలా అభినందిస్తూ కొండల్రావు హాల్లో అడుగుపెట్టగా యిలా అసంతృప్తి కనపరుస్తూ యెదురువెళ్ళి, రెక్క పట్టుకు తీసుకువచ్చి, కవాచీబల్లమీద రాయడు దగ్గరగా కూచోబెట్టిం దతన్ని గోవిందమ్మ.

"నాకూ రెండువే లివ్వా లంటావా?"

"ఎందు కివ్వకపోవాలి?"

"నాకే రెండువేలిస్తే మరి భూషయ్యకి నాలుగువే లివ్వాలి, తెలుసా?"

"అదేమిటి తమ్ముడూ?"

"అదంతే, అక్కయ్యా, ప్రజ్ఞకి విలవ కట్టడం గాని, పంక్తిభేదం చెయ్యరా దనడాని కిదేం విందుభోజనమా?"

"నీకాలు తెగిపోవడం చూసినీన్ని – "

"భూషయ్యకి నేను వెనక వుండడమూ చూశారుమరి" గోవిందమ్మ మాట్టాడలేకపోయింది.

"తమ్ముడే యీభేదం వుండవలసిం దంటున్నప్పుడు నీ కెందుకు చెల్లెమ్మా, యీకించ?" అనడిగాడు చెంచయ్య.

"విధికి విధీ నెరవేర్చుకున్నారు, బహుమతీలకు బహుమతీలూ గడించుకున్నారు, మనవాళ్లు తక్కువేమిటి చెంచయ్యా!" అనడిగి, గణపతిరాయుడు "పదయా టప్పటికి బల్లు బయలుదేరా లన్నాడు మున్సబు. ఇంకా కాఫీ కాలేదు, అప్పుడే యెనిమిది కావస్తోంది" అని తొందరపెట్టాడు గోవిందమ్మని.

"క్షణం" అంటూ గోవిందమ్మ వంటింట్లోకి వెళ్ళింది.

"పాలు పొంగిపోతున్నా" యంది నరసమ్మ, యెదురై,

"నీకూతురిలాగే, కదూ!"

"మిమ్మల్ని చూసుకునీ. అంతేనా!"

"అలాగే అను, నువ్వా మాత్రం దయ వుంచితే –"

"దయవుంచినా అభిమానంవుంచినా మీరేవుంచాలి"

వదినా, అదంతా తరవాత చూసుకుందాం గానీ, పది కాగానే బయులుదేరాలంట –"

"నిమిషంలో వంట –"

"కాఫీ పుచ్చుకోకుండా వెడతా నంటావా, మంచి దానవే. కూచోకూచో నేర్చుకుపోయావ్. చూడూ, చల్లగా వుంటుంది చాపలు పెరట్లో వేయించు చూడా!"

చూడమ్మ స్వయంగా చాపలు పరిచి వచ్చింది.

నరసమ్మ వీధి తలుపులు బిగించేసి వచ్చింది.

"నువ్విక్కడ కాఫీ పుచ్చుకోవాలి, నడిచివెళ్ళాలి, అప్పుడు నివ్వు రాజెయ్యాలి –"

"ఈపాటికి చిట్టి వంటే ప్రారంభించి వుండ దనా!"

"అయ్యో, ఈ అడావుడిలో దాని మాటే మరిచి పోయాను, పాపంవెర్రిపిల్ల దాన్ని తీసుకువచ్చావు కాదేం!"

"ఇల్లో?......పాలికాపాడికి చద్దన్నమో!"

"మునిగిపోయింది, ఈవొక్కపూటా ఆలస్యంఅయి తే!"

ఈసందుబాట్లో వీధి తలుపెవరో గుంజారు.



గోవిందమ్మ చెప్పగా వెళ్ళి చూడమ్మ తలుపుతీసింది.

చూడగా, నడివీధిలో జట్కా, గడప దగ్గిరగా బండి వాడూ, చివరిచీడీమీద ఉజ్జ్వలవేషంతో భూషయ్యాను.

గుర్తుపట్టి చూడమ్మ బొమ్మ అయిపోయింది, గుర్తు పట్టలేక భూషయ్యా చకితుడైనాడు.

ఇద్దరి కళ్ళూ మెరిశాయి.

ఇద్దరి చూపులూ కలిశాయి.

ఇద్దరి హృదయాలూ కులికాయి.

అప్పటికి జ్ఞాపకం చేసుకుని మహోల్లాసంతో "చూడా" అన్నాడు భూషయ్యా.

చూడమ్మ వంటింట్లోకి పరుగెత్తింది.

ఆవాలకంచూసి "ఎవరే!" అని తల్లి అడగ్గా "బావే" అని సన్నమెలుగున చెప్పిందామె.

ఇది విని మెలా వున్న పని అలా విడిచిపెట్టేసి "నా తండ్రే! నా నాయనే!" అని మెగిరిపోయింది గోవిందమ్మ.

నరసమ్మ చెప్పగా పురుషులు వాళ్లో వాలారు.

అప్పటికప్పుడే భూషయ్యా తల్లి పాదాలకు మొక్క డమూ, గోవిందమ్మ "యెన్నాళ్ల కెన్నాళ్లకీ! నాకళ్లు కాయలుకాసిపోయాయి తండ్రీ!" అంటూ పొదువుకుని ఆనందబాష్పాలు చిలుకుతూ భూషయ్యాశిరస్సు మూర్కొ డమూ అయిపోయింది.

తరవాత, భూషయ్యా తక్కిన పెద్దలకున్నూ పాదాభి

వందనం చెయ్యగా, పురుషులు కౌగిలించుకుని దీవించారు.

నరసమ్మ, శిరస్సున చెయ్యి ఉంచి దీవించింది.

గదిగుమ్మందగ్గిర వుత్తడిబొమ్మ అయివుంది చూడమ్మ.

మెల్లిగా అడుగులు వేసుకుంటూ వెళ్లి "ఆవేళ గుమ్మం దిగాటప్పటికీ ఇవాళ గుమ్మం యెక్కాటప్పటికీ నువ్వే యెదు రయినావు. ఇదంతా నీచలవ" అని ప్రీతివెల్లడించి, మళ్లీ అలాగే వెనక్కి వెళ్లి నుంచున్నాడు భూషయ్య.

నరసమ్మ వెళ్లి చూడమ్మ అలకలు సవరించగా, గోవిందమ్మ వెళ్లి ఆమెచెయ్యి పట్టుకుని "ఏమి చేసినీ చిట్టి తల్లి రుణం తీర్చుకోలేము" అంటూ గడ్డం పట్టుకుంది.

అప్పు డందరి యింగితమూ గుర్తించి "యేం, భూషాయ్! సెలవుమీద వచ్చావా?" అనడిగాడు కొండర్రావు, కాళ్లకేసి పరకాయిస్తూ.

ఆచూపు గమనించి లోపల్లోపల నవ్వుకుని "లేదు మామయ్యా, నన్ను కూడా యుద్ధానికి పనికిరావు, పో" మ్మన్నారు" అన్నాడు భూషయ్య.

అందరూ నివ్వెరపడ్డారు, ముందు.

తరవాత "యేమీ? ఎంచేతా?" అంటూ పాదాది శిరఃపర్యంతమూ యెగాదిగా చూశారు, ఆత్రంగా.

కరువునపోసిన బంగరుప్రతిమలా వున్నాడు భూషయ్య.

ఇటు నూత్న యౌవనమూ, అటు అసాధారణ వ్యాయామమూ కలిసి పౌరుషం రూపొందినట్టున్నాడు భూషయ్య.

అందరూ ఆవర్చస్సు చూసి ముగ్ధు లయినారు.

"కారణం?" అనడుగుతూ కొండల్రావు వులుకూ వులుకూ చూడగా, భూమయ్య, కుడిచెయ్యెత్తి, వేళ్లు యెడంగా చాచి అరిచెయ్యి చూపించాడు, చిరునవ్వుతో.

"అరే, అరే, కణువు దగ్గరికి బొటనవేలు—"

"ఏది నాయనా, ఏది తండ్రీ!" అంటూ వెళ్లి ఆచెయ్యి పట్టుకుంది గోవిందమ్మ, కళ్లనీళ్లు కుక్కుకుంటూ.

అందరూ మూగారు.

తల్లిచాటునుంచిచూడమ్మచూసింది,ఆర్ద్రనేత్రఅయి.

"ఏమి జరిగింది భూషాయ్?" అనడిగాడు కొండల్రావు.

"ఎక్కడో బాంబు పేలింది, యిక్కడ నావేలు సగానికి నరికివేసిన ట్టయిపోయిం" దన్నాడు భూమయ్య.

అందరూ స్తబ్ధులు కాగా "నా కొడుకోయ్" అంటూ అవశ అయి భూమయ్యమీద వాలిపోయింది గోవిందమ్మ.

దానిమీద "కనపడ్డదల్లా తినడం లేదని చెబితే "కడుపు మాడ్చుకుంటున్నా" డని నిన్న గోలపెట్టావూ? చీమ కుట్టినట్టేదో కాస్త దెబ్బ—"

"కాస్తదెబ్బా తమ్ముడూ యిదీ? ఊతగలడం తగలడం యేగుండెల మీదేనా—"

"తగల్లేదుగా?"

"ఆకాస్త దెబ్బతో కుదిరినందుకు సంతోషించాలా, విచారించాలా వెర్రిపిల్ల కానా?"

"అది సంతోషించడమే రాయడు బాబూ!"

"ఏదీ నన్ను చూడనియ్యి"

ఇలా అంటూ గణపతిరాయడు డాచెయ్యి పట్టుకుని చూసి "గుర్రం లాగి తుపాకీ పేల్చడానికి వీలులేదంతే. రాతకోతల కేమీ యిబ్బంది వుండదు, అలవాటయిపోతుంది. మొత్తానికి వెళ్లినవాడు వెళ్లినట్టు వచ్చాడు నీకొడుకు. నాయనా, భూషయ్యా! నువ్వనుకున్నదానికి కొంచెం తక్కువగా భూమి సంపాదించుకున్నావు. గంట కిందటే నాగులమ్మపంపుకి బజానా యిచ్చాను" అన్నాడు.

"నాగులమ్మ పంపా!" అని యెగిసిపడ్డాడు భూషయ్య.

మూడు వేల అయిదువందలకు సిసలయింది నాయనా!"

"అదే రైతుచేతిలో వుంటే ముప్ఫయివే లిచ్చినా రాదమ్మా! నాకు బంగారం గని కొనిపెట్టావు తాతయ్యా" అంటూ భూషయ్య గణపతిరాయని పాదాలు పట్టాడు.

"గొప్పవీరుడ వనిపించుకున్నావు. పైగా, రెండు వేల రూపాయలూ, రవ్వల వుంగరమూ—"

"అవేమిటీ?" అన్నాడు భూషయ్య చకితుడై, చూడమ్మ మెడ పరిశీలించి చూస్తూ.

"నువ్వేమీ యెరగవూ భూషాయ్?"

"ఎరగను మామయ్యా"

గణపతిరాయడు, మున్నబు రాయబారం చెప్పాడు.

"చాలా సంతోషం; కానినాకెక్కువా, మామయ్యకి—"

"అదే నేనూ అన్నాను నీకింకా పెళ్ళి కాలేదు కనక, రవ్వల వుంగరం యివ్వడం బాగానే వుంది; కానీ – "

"అదనంగా డబ్బివ్వడమూ బాగానే వుందమ్మా! ఆ రెండో వెయ్యి పెళ్ళి ఖర్చుల కనుకో"

"సెబాస్" అన్నాడు గణపతిరాయుడు.

"అతికింది తమ్ముడూ! నీసమయస్ఫూర్తి కనపరిచావ్" అంటూ మెచ్చుకున్నాడు చెంచయ్య.

చూడమ్మకేసి సోల్లాసంగానూ, చెంచయ్యకేసి సాకూతంగానూ చూసింది నరసమ్మ.

"ఇంటికి వెళ్ళిపో, నువ్వు సంతోషవార్త వింటావన్నాడు పెద్దదొర. ఇదే అదన్నమాట"

"నేనన్నా నువ్వన్నా ప్రాణంకదా, యీమాత్రం దెబ్బ తగిలినందుకే–"

"నియమం యెప్పుడూ నియమమేట. యుద్ధరంగంలో యింకా నా సరదా తీరలేదు, పోనీ, మీ డ్రయివరుగా వుంటాను అన్నాను; కాని వెళ్లు వెళ్లు అనే తప్ప – "

"వింతగానే వుంది"

"చివరికి వింతే జరిగిందయ్యా"

"ఏమిటదీ?"

"ఇంకొక్క నెల గడిస్తే నువ్వు సుబేదారువయి – "

"శివశివా" అన్నాడు చెంచయ్య.

"హరిహరీ" అన్నాడు గణపతిరాయుడు.

"నలుసంతలో తప్పిపోయింది అదృష్టం" అంటూ

పరితపించాడు కొండన్రావు.

"ఆ దురదృష్టం నాదీ" అని దేవుళ్ళాడింది గోవిందమ్మ.

చూడమ్మ నిర్విణ్ణ కాగా, సరసమ్మ నీరవ అయిపోయింది.

"ఇంతకంటే యెక్కువే విచారించాడు దొర. అయితే మద్రాసు వెళ్ళకుండా యింటికి వెళ్లవద్దన్నాడు. అక్కడ చూడవలసినవారి జాపితా — "

"చూశావా?"

"ఆ"

"మరి వింత యేమిటీ!"

జేబులోనుంచి కవరూ, కవరులోనుంచి కాగితమూ తీసి "ఇదిగో, యిదీ" అంటూ అందించాడు భూషయ్య.

అందరూ అటు చూశారు, ఆదుర్దాతో.

చూసి "సెబా" సంటూ యెగిసిపడ్డాడు కొండన్రావు.

"నాయనా, జమాదారు భూషయ్యగారు పోలీసు డిప్టీ సూపరెంటు — "

"ఆ, ఆ, యేమన్నావూ కొండన్నా? చూస్తావేం చెంచయ్యా? డిప్టీసూపరెంటుదొరగారు దయచేసి యెదట నుంచుని వుండడమూ, రెడ్డికం వేసుకుని మనం బల్లమీద–"

"బాబూ, బాబూ" అంటూ గోలపెడుతూ వెళ్ళి లేవకుండా గణపతిరాయణ్ణి అదిమి పట్టుకుంది గోవిందమ్మ.

"డిప్టీ సూపరెం టయేది, డిస్ట్రిక్టు సూపరెం టయేది, నీ పాదాలు కొలుచుకుంటూ బతకవలసినవాణ్ణే కాదూ తాతయ్యా నేను!" అంటూ వెళ్ళి భూషయ్య, తన

శిరస్సు గణపతిరాయని పాదాలకు తాకించాడు.

హాలంతా భక్తిప్రపత్తులతో జాజ్వల్యమానంఅయింది.

అప్పుడు ప్రేమావేశంతో భూషయ్యని కౌగిలించుకుని "కొండల్రావ్! నేనానందం పట్టలేకుండా వున్నాను. కనక, యేమయినా సరే వొకమాటనేస్తా" నన్నాడు రాయడు.

"నీకడ్డేమిటి గానీ" అని మాట తేల్చేసి, కొండల్రావు ప్రశ్నార్థకంగా చూశాడు, వరాసగా వొక్కొక్కరికేసీ. చేతులు మోడ్చుకుని భూషయ్య నమ్రుడైనాడు.

"బాబేమన్నా నాకు వరప్రసాదమే"అంది గోవిందమ్మ.

"బాబయ్య నాకు దేవుడే" అన్నాడు చెంచయ్య.

"ఇక నేనేనా పరాయిదాన్ని?" అనడిగింది సరసమ్మ.

ఆనందంలో ఔత్సుక్యమూ, ఔత్సుక్యంలో లజ్జా, లజ్జలో అవధానతా స్పష్టంగా కనబరిచింది చూడమ్మ, అరకంట చూస్తూ.

ఒక అర్థచంద్రభ్రమణంతో యిదంతా చూసీ వినీ "కులపతుల ఆజ్ఞచొప్పున, నా కూతురు గోవిందమ్మ కొడుకైన భూషయ్యకి, నా కొడుకు చెంచయ్య కూతురైన చూడమ్మనిచ్చి వివాహం జరిగించడానికి నేను నిశ్చయించేశా" నన్నాడు గణపతిరాయడు, గంభీరంగా.

"నాయనా, నీ నిశ్చయం కులపతుల ఆజ్ఞే, సందేహంలే" దన్నాడు కొండల్రావు.

"మరదలపిల్ల దాటిపోయిందేమో అని కంగారుపడి పోతూ వచ్చాను తాతయ్యా" అన్నాడు భూషయ్య.

"ఈమాట యెప్పుడు వింటామా అని ఆదుర్దా పడి పోతున్నా" నంది గోవిందమ్మ, వూపిరి తీసుకుంటూ.

"మా తాహతుని పట్టి చూస్తే మాకిది అందరానిది. మన కీ అదృష్టం వుందా లేదా అని బెంగటిల్లిపోయి వుంది నీ కోడ" లన్నాడు చెంచయ్య, నరసమ్మకేసి చూస్తూ.

"అవు" నన్నట్టు చేతులు మోడ్చుకుంది నరసమ్మ, రుద్ధకంఠ అయిపోయి.

అంకాపొంకాలమీద వచ్చి అప్పటికప్పుడే చూడమ్మని పెళ్లికూతుర్ని చేసేసింది, సిగ్గు.

వెంటనే గోవిందమ్మ భూషయ్య చెయ్యీ, నరసమ్మ చూడమ్మ చెయ్యీ గణపతిరాయుని కందించారు.

ఆ రెండు చేతులూ కలిపి, దాంతో వాటంతట అవే కలిసిన మెరుపుచూపుల్లో వారి హృదయైక్యం గుర్తించి, గణపతిరాయుడు ఆనందిస్తూ వుండగా, వొకచేత్తో భూషయ్య నడుమూ, వొకచేత్తో చూడమ్మ నడుమూ పొదువుకుని, సముజ్జ్వలమైన భవిష్యత్తు భావించుకుని, నూత్న జీవితమాధుర్యం చవిచూసి, ఆనందపరవశ అయిపోయింది గోవిందమ్మ.

1942 ఆంధ్ర వారపత్రిక నుంచి



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్ |
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 103 B174 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 375 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | h,2, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | RUKSANA, |
| పేజీలు విడదీసినది | RUKSANA |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |